రవిరాజ్ ఇంటర్నేషనల్ సమర్పించు

శ్యామ్ బెనగల్ చిత్రం



# అనుగ్రహం

ఈస్ట్‌మన్‌కలర్

నిర్మాత: కాటంరెడ్డి వెంకటరామరెడ్డి

సహనిర్మాతలు: యు. వరదారెడ్డి - వి. మల్లిఖార్జునరెడ్డి

ఫోటోగ్రఫీ: గోవింద్ నిహ్లానీ సంగీతం: వనరాజ్ భాటియా

తారకరామా నవభారత్ నైజాం: శ్రీతారకరామా

సంస్థాపకులు
కీ॥ శే॥ వి.వి. రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
శ్రీమతి వి. లీలావతి రాఘవయ్య

సచిత్ర మాసపత్రిక
జూలై 1978

సహకార సంపాదకుడు : వేమూరి సత్యనారాయణ

సంపుటి 16 | సంచిక 6

## విషయసూచిక



ఇంకా కార్టూన్లూ, జోకులూ మరియూ జయదేవ్ '(వి)చిత్ర విజ్ఞానం'

నవలానుబంధం

**ఆకాశదీపాలు : యండమూరి వీరేంద్రనాథ్
కాటూరు రవీంద్రత్రివిక్రమ్**



ముఖచిత్రం: 'రామకృష్ణులు'లో ఎన్. టి. రామారావు, జయసుధ

జ్యోతి, 17-B రాజారాం కాలనీ, P.B. నెం. 2650, మద్రాసు-600 024.
ఫోన్: 423123. సంవత్సర చందా (ప్రత్యేక సంచికతో) రూ. 12/-

# తొలిమాట

జ్యోతి నిర్వహించిన కథలపోటీలో బహుమతులు పొందిన కథల గురించి ఎంతోమంది పాఠకులు విభిన్నాభిప్రాయాలు వ్యక్తపరుస్తూ రాశారు. ఈ సంచికలో ఆ కథలపై పాఠకులు వెలిబుచ్చిన అభిప్రాయాలు కొన్నిటిని 'ఉత్తరాలు' శీర్షికలో ప్రచురించాము. విమర్శలున్నప్పటికీ, అధిక భాగం పాఠకులు బహుమతులు పొందిన కథల ఎన్నిక బాగున్నదనే భావించారు. ఏ న్యాయనిర్ణేతా 'అందరినీ' సంతృప్తిపరచడం సాధ్యంకాదు. ఆ విషయం నిరూపిస్తూ చాలామంది మెచ్చుకొన్నదైనా, మూడవ బహుమతి పొందిన కథను 'కథేకాదు పొ'మ్మన్న అభిప్రాయం వెలిబుచ్చారో పాఠకుడు. అదీ చిత్రం!

* * *

ఈ సంచికనుంచీ మరో సీరియల్ 'పూలూ-ముళ్ళూ' ప్రారంభమవుతూంది. రచయిత్రి ఐ. వి. యస్. అచ్యుతవల్లి.

* * *

అధిక ప్రశంస పొందిన క్రొత్తశీర్షిక (వి)చిత్ర విజ్ఞానం బాగున్నదన్న విషయంతోపాటు, కొంతమంది పాఠకులు ఆ శీర్షికా నిర్వాహకులు ఎవ్వరన్న ప్రశ్న వేశారు. ఆ శీర్షికకు సంబంధించిన విషయసేకరణతో పాటు, ఆ శీర్షికకు వ్యంగ్య చిత్రాలంకరణ జరుపుతున్నది-మీకు చిరపరిచితుడైన కార్టూనిస్ట్ జయదేవ్.

* * *

ఈ సంచికలోని రెండు కథలలో 'సామ్యం' వెదికి పాఠకులు రెండూ ఒకే కథావస్తువుపై రాయబడ్డ కథలుగా భావించే అవకాశముంది. ఆ రెండు కథల ప్రచురణా ఈ సంచికలో జరగడం యాదృచ్ఛికంగా జరిగినది కాదు. కావాలనే అలా ప్రచురించాము. 'పిల్లల్ని కావాలని గుడ్డివాళ్ళుగా కుంటివాళ్ళుగా చేయడాన్ని' రెండు విభిన్నమైన కోణాలలో చిత్రించబడ్డ ఆ రెండు కథలూ. ..చదవండి! మీకే తెలుస్తాయి.

# ఉత్తరాలు

జయప్రద ముఖచిత్రంతో వెలువడిన జూన్ నెల 'జ్యోతి' చదివాము. బీనాదేవిగారి సీరియల్ "భూమి గుండ్రంగావుంది" లేని లోటు స్పష్టంగా కనబడింది. బహుమతి పొందిన కథలలో "ప్రియురాలి ప్రేమలేఖ" చాలా బాగుంది. మిగిలిన కథలలో "బ్రతక నేర్చినవాడు" హ్యూమరస్‌గావుంది. వెరైటీ కథలనందించే మల్లాది వెంకటకృష్ణమూర్తిగారి కలంనుంచి వెలువడిన మరొక వెరైటీ "పడమట సంధ్యారాగం."

—యస్. యల్. యన్. ప్రసాద్, యస్. శ్రీనివాసరావు, యస్. సూర్యకుమారి, నిడదవోలు.

బహుమతులు గెల్చుకున్న మూడుకథల్లో శ్రీ పురాణం శ్రీనివాసశాస్త్రిగారి కథ "గూడుచాలని సుఖం"లో బీదవారి పాట్లూ వాళ్ళలో మమతలూ, సుఖాన్వేషణ ఎంతగావున్నదీ, వాళ్ళ తృప్తికి విలువెంత? అన్నది బాగా వ్యక్తం చేశారు.

శ్రీమతి పవని నిర్మల ప్రభావతిగారు, సంఘంలో ఘరానా మనుష్యులుగా చెలామణి అవుతున్న కొంతమంది ధనవంతులు, విద్యావంతులు తెరవెనుక జరిపే బిజినెస్, రాసక్రీడలు వారి మిథ్యానాగరికత వగైరాలను తమ కథలో చక్కగా చిత్రించారు. ఇది చాలా పట్నాలలూ, పల్లెల్లోనూ కూడా జరుగుతున్న వాస్తవాలకు దర్పణం.

పార్టనర్స్ కథలో లాంటివి-అక్కడక్కడా ఇలాటి మోసగాళ్ళు విసిరేవల, ఆడే చదరంగం - బాగా వ్యక్తపరిచారు రచయిత. ఈ కరువుకాలంలో బతకనేర్చిన రిక్షావాళ్ళ తీరును చక్కగా మలిచారు కెఎస్వీగారు.

పడమట సంధ్యారాగం నవలలోలాగ, పసితనంలోనే తలిదండ్రులను పోగొట్టుకొనిన అభాగ్యుల మనస్తత్వం చాలాభాగం సత్యమూర్తి మనస్తత్వానికి దగ్గరగానే వుంటుంది. సత్యమూర్తి భార్యతో, తనలోని ఆ బలహీనతకు కారణాలు చెపుతూంటే కళ్ళనీళ్ళు వచ్చాయి. ఆ భావాన్ని అద్భుతంగా వ్యక్తంచేసిన రచయితకు ధన్యవాదాలు.

మధురాంతకం నరేంద్రగారి నవలిక 'ఇరుకు గదులు' వాస్తవానికి ఎంత దగ్గరగానోవుంది. ఇతివృత్తానికి పెట్టినపేరు చక్కగా అమరింది. ఈ రోజుల్లో పదింట ఐదు కుటుంబాలలో, ఇటువంటి పరిస్థితులతోనే నలిగిపోతున్నారు. ఈ ఇతివృత్తాన్ని ఇంత అందంగా మలచిన నరేంద్రగారిని అభినందిస్తున్నాను.

మొత్తంమీద జూన్‌నెల జ్యోతి, విజ్ఞాన వినోదాలతో ఆకర్షణీయంగా వుంది.

—సమయమంత్రి రాజ్యలక్ష్మీదేవి, హైదరాబాదు.

అనేక మార్పులతో మమ్ములను అలంకరించిన మీ (మా) జ్యోతి నాకెంతో సంతోషాన్ని కలుగజేసింది. బహుమతి పొందిన పి. శ్రీనివాసశాస్త్రిగారి "గూడుచాలని సుఖం" యర్రంశెట్టి శాయిగారి "ప్రియురాలి ప్రేమలేఖ" పవని నిర్మల ప్రభావతిగారి "మలుపులో మనుషులు" కథలు చక్కని రచనాశైలితో సాగినయ్. మొత్తానికి ఈనెల కథలు అన్నియూ బాగుగా వున్నవని గట్టిగా చెప్పగలను. "సినిమా" శీర్షికలో మార్పులుచేసిన మీకు నా కృతజ్ఞతలు. ఎన్. ఆంజనేయులు "గళ్ళనుడికట్టు కథాకమామీషు" చక్కగా వున్నది. సీరియల్స్‌లో బీనాదేవిగారి "భూమి గుండ్రంగావుంది" ప్రచురింప

# రామస్వామి పెరుగుతున్న కుమార్తె భవిష్యత్తును భద్రపరచే పథకం కోసం ఆలోచిస్తున్నాడు.





## ఆంధ్రా బ్యాంక్ వారి మహిళా సంక్షేమ పథకం రామస్వామి కోరిన పథకం. ఆపథకం రామ స్వామి కుమార్తె విద్యాభ్యాసానికి, వివాహానికి లేదా స్వయం ఉపాధి కల్పనకు ఆర్థిక సహాయం చేస్తుంది.

రామస్వామిలాంటి ఆడ పిల్లల తండ్రులకోసం మహిళా సంక్షేమ పథకం ఒక వరప్రసాదం ఈ పథకంలో పొదుపు చేసేధనం మీ కుమార్తెతోపాటు పెరుగుతుంది
నేటి యువతులలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించి, ఆర్థిక స్వాతంత్ర్యాన్ని పొందేటందుకు ఈ పథకం సహాయపడుతుంది

దాదాపు 55 సంవత్సరాల అపారమైన అనుభవం గడించి, 600 కు పైగా శాఖలతో, దేశమంతటా విస్తరించిన ఆంధ్రా బ్యాంక్, అనేక ఇతర పథకాలనుకూడా ప్రవేశ పెట్టింది అవే - భాగ్యలక్ష్మి, కీర్తిబ్యాంక్, సంరక్ష, సంక్షేమ, జన సహాయ, కర్షక సహాయ, గృహకల్ప మరియు కల్పతరువు పథకాలు ప్రతి పథకం ప్రత్యేకమైనదే ఒక్కొక్క సమస్యను తీర్చడానికి ఒక్కొక్క పథకం.
అంతేకాదు పరిశ్రమలకు, బలహీనవర్గాలకు కూడా ఆంధ్రా బ్యాంక్ ఆర్థికసహాయం చేస్తోంది.

ప్రజావసరాలకై పాటుపడేదే - ఆంధ్రాబ్యాంక్



**ది ఆంధ్రా బ్యాంక్ లి.**

కేంద్ర కార్యాలయం, సుల్తాన్ బజార్,
హైదరాబాద్-500 001

**ఓ. స్వామినాథరెడ్డి : ఛైర్మన్**

KIRON/AB/78/12

బడనందుకు విచారిస్తున్నాను. మల్లాదిగారి "పడమట సంధ్యారాగం" మళ్ళీ నన్ను సస్పెన్సుతో ముంచెత్తింది. మధురాంతకం నరేంద్ర నవల "ఇరుకు గదులు" ఫర్వాలేదు. జోక్స్ బాగా తగ్గించినారు. పెంచవలసినదిగా ప్రార్థిస్తూ

—యం. సుధాకరగుప్త, తిరుపతి.

జూన్ జ్యోతిని వెలిగించిన బహుమతి పొందిన కథలు ఒకదానికొకటి పోటీగా నిల బడ్డాయి. కాని బహుమతి పొందిన కథలుకూడ పేరున్న రచయిత(త్రి)లకు రావటం బాధనిపించినా, చదివిన తర్వాత బహుమతికి సమంజస మైన కథలనిపించాయి. మల్లాదిగారి "పడమట సంధ్యారాగం" సీరియల్ చాల ఇంటరెస్టింగ్‌గా వుంది. ముఖ్యంగా 'థీమ్' కన్నా మల్లాదిగారి వినూత్న పంథా మమ్మల్ని ఉత్సాహపరుస్తుంది. "మయసభ" జ్యోతికే హైలైట్. ఈ శీర్షిక ద్వారా మన ఆర్థికవిధానాన్ని ఎత్తిపొడుస్తూ, సున్నితమైన హాస్యాన్ని అందించిన రామ సంజీవిగారికి కృతజ్ఞతలు.

మార్కెట్టులో ఎన్ని పత్రికలున్నా — ఈ ఎండలకు మనోల్లాసం కలిగించే ఉత్కృష్టమైన శీర్షికలు కలిగివున్న జ్యోతిని చదవనిదే మా సాహిత్య దాహం తీరనంటుంది.

—ఈతకోట సుబ్బారావు, నెల్లూరు-1

జూన్‌నెల సంచికలోని 'గళ్ళనుడికట్టు కథా కమామీషు'లో రచయిత పొరబడ్డారు. 'తెలుగులో మొట్టమొదటగా గళ్ళనుడికట్టును పేనింది' నేనుకాదు. నాకన్నా ముందుగా శ్రీశ్రీ, ఆయనకన్నా ముందుగా ఎందరో పేరు జ్ఞాపకం రానివాళ్ళు పజిల్స్ రచన చేశారు. ఎటొచ్చీ క్రాస్‌వర్డ్ పజిల్‌కి గళ్ళనుడికట్టు అనే పేరును పెట్టింది మాత్రం నేనే. (అందుచేత 'తెలుగులో మొట్ట మొదటగా గళ్ళ నుడికట్టును పేనింది ఆరుద్రే' అని రచయిత ఎన్. ఆంజనేయులు గారు తను స్టేటుమెంటును సమర్థించుకొంటే అది వాదబలాన్నేగాని కమామీషు విషయంలో భేష్ అనిపించుకోదు.

'మే' పదబంధ ప్రహేళికలో 'లాత్వం' అనే మాటకు ఇచ్చిన 'ల్' అనే ఆధారం నిరాధారం. అత్వం, ఇత్వం, ఉత్వం, ఎత్వం అనే పారి భాషిక పదాలు అచ్చునే సూచిస్తాయి. అచ్చు లేని హల్లును పొల్లు అంటారు. 'ల'కారపు పొల్లును 'ల'కారపు పొల్లనే పేర్కొనాలిగాని 'లాత్వం' అనడం సబబు కాదు.

—ఆరుద్ర, మద్రాసు-17.

దినదిన ప్రవర్థమాన నటి కుమారి జయప్రద చిరుదరహాస వదనారవిందంతో వెలువడిన "జూన్"నెల జ్యోతి అత్యంత ఆకర్షణీయంగా వుంది. బహుమతి పొందిన కథలు "గూడు చాలని సుఖం" "ప్రియురాలి ప్రేమలేఖ" చాలా ఆసక్తిదాయకంగా వున్నాయి. "పడమటసంధ్యా రాగం" సీరియల్ చాలా రసవత్తరంగా సాగు తోంది. శ్రీ జయదేవ్‌గారి (వి)చిత్ర విజ్ఞానం బాగుంటోంది. కాని ఈ సంచికలో బీనాదేవి "భూమి గుండ్రంగావుంది" సీరియల్ లేక పోవడంలో ఏదో వెలితి అన్పించింది.

—పులుసుగంటి సత్యనారాయణ, (రవి)
బండార్లంక.

పోటీ కథల్ని చదివాను. అద్భుతమైన కథను అందంగా చెరచిన శ్రీనివాసశాస్త్రిగారికి, అతిసున్నితమైన కథను అద్భుతంగా ప్రెజెంట్ చేసిన శాయిగారికి మీరు బహుమతి ఇవ్వడాన్ని హర్షించవచ్చుగాని, ఇది 'కథ' అంటే సంశ యించాల్సిన అవసరముండే 'మలుపులో మను షులు' కథకి బహుమతి యివ్వడం నేరం: ఇంగ్లీషులో 'క్రయిం'. దయచేసి యెప్పుడూ జ్యోతిని అపరాధిని చెయ్యకండి.

—ఎన్నార్కే మూర్తి, మద్రాసు-26.

జూన్‌నెల జ్యోతి చదివాను. అందులో "ఇరుకు గదులు" నవల చాల బాగుంది. చాల సహజంగా వుంది. "ప్రియురాలి ప్రేమలేఖ" "గూడుచాలని సుఖం" మల్లాది వెంకటకృష్ణ మూర్తిగారి "పడమట సంధ్యారాగం" సీరియల్ చాలా ఆసక్తికరంగా ఉన్నాయి. ముఖచిత్రం జయప్రద కలర్ ఫోటో చాల బాగుంది. సినిమా గురించి చాల వివరాలు తెలియజేశారు.

—దాస రవీందర్, జగిత్యాల.

# మా ప్రకటనా కార్యక్రమం ఎయిర్-ఇండియా ఘనతను ఘనంగా పెంపొందించింది.





అయితే మేంచెప్పేది కొంత మాత్రమే
అందరూ అనుకునేది మరెంతోమరి.
అందుకే రండి—మీ అంతట మీరే చూడండి



ఎయిర్-ఇండియా

AI-2674-A

ప్రధమ బహుమతి పొందిన పి. శ్రీనివాస శాస్త్రిగారి "గూడుచాలని సుఖం" కధ నా మనస్సుని విపరీతంగా ఆకట్టుకొంది. ఈ కథ ఎన్నికచేసిన న్యాయ నిర్ణేతల అభిరుచి మెచ్చదగినది.

ద్వితీయ బహుమతి పొందిన యర్రంశెట్టి శాయిగారి రచన "ప్రియురాలి ప్రేమలేఖ" కథ ఒక మాదిరిగా వుంది.

తృతీయ బహుమతి పొందిన పవనినిర్మల ప్రభావతి గారి "మలుపులో మనుషులు" కథ చాలా బావుంది. కాని రచయిత్రి-ఒక స్త్రీ-మరియొక స్త్రీని ఆ విధంగా చిత్రించడం, ఎంతో పవిత్ర నామమయిన "సుశీల" అనే పేరును ఆ పాత్రకు పెట్టడం ఆశ్చర్యముగా వున్నది.

కథలకు బాపుగారి బొమ్మలు చాలా బాగా వున్నాయి.

బీనాదేవిగారి "భూమి గుండ్రంగా వుంది" సీరియల్ వేయకపోవడం చాలా అసంతృప్తిగా వుంది.

సినీమా మామూలు పద్ధతిలో వేస్తున్నందుకు సంతోషంగావుంది.

—డి. వి. మురళి. కొవ్వాడ.

జూన్ సంచికలో రెండవ బహుమతిగెలుచుకొన్న యర్రంశెట్టి శాయిగారి ప్రియురాలి ప్రేమలేఖ బాగుంది . చాల చాల బాగుంది. గిలిగింతలు పెట్టింది. ముఖ్యంగా మొదలుపెట్టినప్పటి 'టెంపో', ఉత్తరం ముగింపు వరకూ బిగువు సడలకుండా పటుత్వంతో 'సరిగమలు' చిందించిందంటే నమ్మాలి మరి!

రచన, శైలి, కథనం-సన్నగా, శ్రావ్యంగా, గలగలపారే కృష్ణమ్మ వొడిలా, ఎంతహాయిగా వుంది ఎంత హుషారుగా నడిచింది, మత్తెక్కించింది. మధుర భావాలను మదిలో నిలిపింది. పిల్లాడు ఎంత ఏడిస్తే అంత బలం! ప్రేమికుడు ఎన్ని అవస్థలు పడితే ప్రేమకు అంత పునాది అనే సూక్తి ఈ కథలో యెంత నిజం ఇది ఈనాటిది గాదు. . అనాదిగా వస్తున్నదే అయినా అదే విషయాన్ని స్ట్రాటజిక్ గా అల్లి విప్పి చెప్పటంలోనే వుంది రచయిత నేర్పూ, ఓర్పూను ఇంత మంచి అనుభవ సారాలతో వడకట్టబడిన ఈ రచనకు జ్యోతిలో రెండవ బహుమతి రావటం . ఐయామ్ రియల్లీ హేపీ ఇంత మంచి కథను యెంపిక చేసిన మీరు ఎంతయినా అభినందనీయులు.

—కొంగర ఉమామహేశ్వరరావు,
తెనాలి.



గంగ, యమున, సరస్వతుల సంగమం
త్రివేణి
రుచి, సువాసన, పరిమళాల సమ్మేళనం
"త్రివేణి" వక్కపొడి

TRADE MARK

Regd no. 169505






తయారుచేయువారు.

PHONE-270

త్రివేణి నట్ పౌడర్ మాన్యుఫ్యాక్చరింగ్ కంపెని
మేనేజింగ్ పార్ట్నర్.... దోసు వెంకటసుబ్బారావు...
ఘార్బురోడ్ ........... మచిలీపట్నం (ఆంధ్ర)

KAMAL Process

బ్రాంచీలు హైదరాబాద్, సికింద్రాబాద్, ఏలూరు, కాకినాడ, గుడివాడ, విజయవాడ



# మయసభ

## సమస్యల సర్వాంతర్యామిత్వం !

ఆ వెన్నెలను చూడండి!

ఇదుగో ఈ వారపత్రికలో సీరియల్ నవల చదవండి!

ఆ నవల ఆధారంగా తీస్తున్న ఛప్పన్న రంగుల టాడ్-ఓ-ఓ-సినిమా చూడండి!

664 రోజులు ఆ సినిమా ఆడాక జరిగిన విజయోత్సవాలను తిలకించండి

ఆహాహా! ఓహోహో!

ఏమానందంబీ భూమీతలంబున

ఔనా? నిజమేనా? 'సర్వే జనాస్సుఖినో భవంతు'యేనా? సర్వే డిపార్ట్‌మెంటు వారితో సహా సకల జనులూ సుఖంగా, సంతోషంగా వున్నారు కదూ! బార్లు, బీర్లు, కేబరేలు, హషీషులలో తేలియాడుతున్నారు కదూ?

మత్తులోపడి వాస్తవానికి దూరం అవుతున్నారు కదూ?

ఇంతలా సుఖసంతోషాలతో నిండిపోతే వారి గుండెకాయలు రాక్కున ఆగిపోవూ?

'ఆనందం అర్ణవం' అయితే కావచ్చుకాని అర్ణవం చెలియలి కట్టను దాటరాదు కదా?

జీవితమంతా ఇలాగా తీపిమయం అయిపోతే అయ్యో, విప్లవ వాదులు ఏమయిపోతారు? ఉద్యమాలు ఏమవుతాయి? నాయకుల అవసరం ఏం వుంటుంది? నిప్పులు చెరిగే కవితలకు వస్తువు ఎక్కడుంటుంది? చీకటే తెలియకపోతే వెన్నెలని వెన్నెలగా ఎలా పోల్చడం? అంతా ఒక్క రుచే అయినప్పుడు మిగతా అయిదు రుచులనూ ఎలా తెలుసుకోవడం?

జీవితం అన్నాక కాస్త చేదు, కాస్త కారం, ఒకించుక వగరూ లేకపోతే వైవిధ్యం ఎక్కడ వుంటుంది!

కనుకనే—

ఆనందాబ్ధి మధ్య విషాద ద్వీపాలవలె- అభిమాన రచయిత్రి (అబ్‌బ!) సీరియల్ మధ్య అడ్వర్టయిజ్‌మెంట్ పేజీలవలె—

20+5 పాయింట్ల ప్రోగ్రాము మధ్య మార్చి 77 ఎన్నికలవలె—కొన్ని ఏర్పాట్లను కరుణామయుడయిన ఆ భగవంతుడు చేశాడు.

భగవంతుడికి మల్లేనే ఆ ఏర్పాట్లకూ అనేక రూపాలు; అనేక వేషాలు. వాటికి మల్లేనే వాటికికూడా సర్వాంతర్యామిత్వం వుంది. ఇందు గల దందు లేదంచు సందేహంబు వలదు.

ప్రభుత్వపు రూల్సుగా, మున్సిపాలిటీ ఇన్స్పెక్టర్‌గా, రైల్వే ఉద్యోగిగా, ఎం.ఎల్.ఏ.గా, ఎల్.ఐ.సీ. ఏజెంటుగా, ఇన్‌కంటాక్స్ అధికారిగా, పోస్టల్ క్లర్కుగా ఈ భగవదంశం కనపడుతుంటుంది. పాలబూత్ దగ్గర్నుంచి సిటీ బస్‌దాక, పోలీసుస్టేషన్‌నుంచి రేడియోస్టేషన్ దాక జనులు పూర్తిగా సుఖం మరిగి పాడయిపోకుండా వుండడానికి అనేకానేక ఏర్పాట్లను

ఏ. రామసంజీవి

చేసియున్నారు. గమనింతురుగాక!

ఈ కిటుకు తెలియక పత్రికల్లో సంపాద కీయాలు రాయడం, రాయించుకోవడం, 'ఆర్యా' లేఖలు రాయడం, మహజర్లు విజ్ఞప్తులు సమర్పించుకోవడంలాటి అర్థం పర్థంలేని పనులను ప్రజలు చేస్తుండడం చూస్తుంటే, వాళ్ళు చిక్కుకున్న మాయ ఎంత ప్రగాఢమైనదో తెలుస్తుంది.

మీరో పావలా కవరు కావాలని పోస్టాఫీసుకు వెళతారు. కౌంటర్ వెనకాలవున్న దేవ మాత చేతికి అర్ధరూపాయిస్తారు.

"చిల్లర లేదు!" అంటాడాయన రావు గోపాల్రావు గొంతుకతో.

"అయితే కవర్‌తోపాటు కార్డు ఇవ్వండి" అంటారు మీరు.

"కార్డులు లేవు."

"ఇన్లండ్ కవరివ్వండి."

ఆ రెండూ ఇచ్చి అయిదు పైసలు ఇవ్వడంలో మీకు అష్టైశ్వర్యాలు సిద్ధించాలని ఆశీర్వదించే భగవంతుడి పోజులో వుంటాడా తంతి తపాలా మనిషి. చిరునవ్వు నవ్వితే మీరు సుఖపడి పోతారేమోనని భయం.

## కుడిఎడమైతే పొరపాటు ఉందోయ్!

—"హలో హలో!"

రింగ్ పోతుండడం మీకు వినపడుతుంటుంది. కాని ఆ సెంట్రల్ టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌లోని లలనామణి పట్టించుకోదు. ఎనిమిది గంటలూ ఆవిడ కిదే పనా ఏమిటి? బాయ్ ఫ్రెండ్స్, గర్ల్ ఫ్రెండ్స్, గాసిప్, టాసిప్, వేరుశనక్కాయలు, నిన్నచూసిన సినిమాలు—ఇవన్నీ వుండగా మీ బోడి ఎంక్వైరీ ఎవరిక్కావాలి?

ఇంతకూ మీ బాధల్లా నిన్నటిదాక 65402 నెంబర్ ఫోన్‌మీద పలికిన మీఅప్పుడు అనంత పద్మనాభ రావ్‌తో మాట్లాడాలని మీరివాళ ఫోన్ చేస్తే, అటునుంచి జబ్బుచేసిన కుక్కపిల్లలా "కూంయ్ కూంయ్ " మని మూలుగు వినపడ్డంతో మీరు 197 కు ఫోన్‌చెసి, తమసోమా జ్యోతిర్గమయ—అని అడుగుదామనుకున్నారు.

ఎట్టకేలకు ఆ ఎలనాగ కటాక్షిస్తుంది. "ఎస్ టెలిఫోన్స్!"

మీ బాధను వివరించి——"దారిచూపవే పంకజనాభ సోదరీ—" అని వేడుకుంటారు.

'వన్ మినిట్ ప్లీజ్' అన్న ఆరో నిముషానికి ఆవిడ "అనంతరావు వున్నారు; పద్మనాభరావున్నారు. కాని అనంతపద్మనాభరావు ఎవరూ లేరు డైరెక్టరీలో—" అని స్పష్టంగా చెప్పి రాక్కున ఫోన్‌పెట్టేస్తుంది.

"ఇది ఘోరం. ఇది అన్యాయం—— అసత్యం—" అని అరిచి గీపెట్టి, వచన కవిత్వం రాసి పంచి పెడదామని వుంటుంది మీకు కాని మీరు సాయంకాలం ఆ మిత్రుడింటికి వెళ్ళి ఆయన నెంబర్ మారిందని తెలుసుకుని, పొద్దుటి సంఘటన తలచుకుని నవ్వేస్తారు.

చూశారా మరి? ఈ సాంఖ్యయోగంలో మొదట కష్టమే కాని చివరనంతా చిరునవ్వే!..

## సోషలిజం విస్తరణ ఇలా!

చచ్చిచెడి, అప్పులుచేసి, అడ్వాన్సులు పోసి ఓ ఇల్లు కట్టుకుంటారు. అప్పులు తీరేందుకోసం ఆ ఇంటిని ఏ ఆఫీసువారికో ఇస్తే బాగుంటుందని ఆ పనిచేస్తారు. రెంట్ కంట్రోలర్ వారొచ్చి అంతా పరిశీలించి... "ఈ ఇంటికి నెలకు నాలుగు వందల యాభై సబబయిన అద్దెగా నిర్ణయించడమైనది—" అని ఒక టైప్ చేసిన కాగితం మీ మొహాన పడేస్తాడు. కనీసం ఏడు వందలయినా వస్తుందని ఆశించిన మీకు ఆశాభంగం కలుగుతుంది. కాని బుద్ధుడేమన్నాడో గుర్తుకు తెచ్చుకోండి- "ఆశయే దుఃఖమునకు మూల కారణము—" అంచేత ఆశాభంగం అంటే అజ్ఞానభంగముగా భావించవలెను.

కాని కథ అక్కడితో ఆగదు. మీరు బ్రహ్మచారి అయినా, మీకు (పెళ్ళయ్యాకే) కూతుళ్ళు లేక పోయినా—జీవితంలో అడుగడుగున ఎదురయ్యే ఒక్కొక్క ప్రభుత్వోద్యోగీ మీకు—

అల్లుడిలాటివాడు. (మామగారి పాత్రమీకు నచ్చకపోతే వసుదేవుడి పాత్ర ధరించండి) మీ కొత్త ఇంటిమీద "ఇంటి పన్ను" నిర్ణయించడానికి కార్పొరేషన్ ప్రతినిధి వస్తాడు. 'మీరు ఇల్లు కట్టడమే క్షమించరానినేరం' అన్నట్లుగా మీవేపు చూచి— "ఈ ఇంటికి మార్కెట్ రేట్ ప్రకారం నెలకు వెయ్యి రూపాయలకన్న తక్కువ అద్దెరాదు—" అనిచెప్పి పన్నెండు వేల రూపాయల సాలినా ఆదాయంమీద పదహారు వందల రూపాయ్యల పన్ను విధించేసికంసుడిలానవ్వేసిపెళ్ళిపోతాడు.

"అవతల ఇదే ఇంటికి నెలకు రు 450 కన్న,ఎక్కువ అద్దె—అనవసరం అన్నవాడూ ప్రభుత్వమే! ఇవతల వెయ్యి కన్న తక్కువ రాదు అని చెప్పినవాడూ ప్రభుత్వమే." ఈ అడకత్తెరలో ఇరుక్కున్న మీరు 'ఇల్లు కట్టుకోవడమంత మూర్ఖత్వం లేదు 'అన్న జ్ఞానం కలిగినవారయి—"ఆస్తి హక్కు రద్దు" వుద్యమంలో చేరదామనుకుంటారు. సోషలిజం ఎలా విస్తరిస్తుందో నన్న గతితార్కిక గృహవాదం మీ అవగాహనలోకి వస్తుంది. మీరు చైతన్యవంతులవుతారు!

## ఆరోగ్యాన్నిచ్చే సిటీ బస్సులున్నాయి!

మీ ఇంటినుండి మార్కెట్ మీదుగా స్టేషన్ వెళ్ళే ఆరో నెంబర్ బస్ మీదే రోజూ ఆఫీసుకు వెళ్ళి వస్తుంటారు. ఒక సాయంత్రం ఆఫీసునుండి బయలుదేరుతూ, దారిలో మార్కెట్ లో కూరలు కొనుక్కువెళ్ళాలని ఆరో నెంబర్ బస్సెక్కుతారు. కాని ఆవేళ ఆ బస్ మార్కెట్ వైపు కాకుండా కలెక్టరాఫీసు వైపునుంచి వెళ్తుంది. దారి మారింది!

"ఏమిటిది?" అని అరుస్తారు మీరు.

"అదంతే! దిగితే దిగండి. లేపోతే ఇంకో పావలా ఇచ్చి పెర్మినస్ దాక టిక్కెట్టు కొనండి—" అని కండక్టర్ సలహా ఇస్తాడు.

అప్పటికే మార్కెటునుండి మైలుముందుకు వచ్చిన మీరు. నోరు మూసుకుని దిగుతారు. చకచకమని మార్కెటుకు నడుస్తారు. రక్త ప్రసరణం బాగా జరుగుతుంది. ఆకలి వేస్తుంది. ఇల్లుచేరి కడుపునిండా భోంచేసి హాయిగా నిద్రపోతారు. మీకు గుండె జబ్బులు రావు. బస్సు తన రూట్ మార్చడానికి, మీ గుండె ఆరోగ్యానికల కార్యకారణ సంబంధం తెలిసి మీరు స్థితప్రజ్ఞులవుతారు; తెలియకపోతే అనవసరంగా హైరానపడి అందరినీ అల్లరి పెడతారు

## రైల్వే ప్లాట్ ఫాంపై సత్యాన్వేషణ!

రైల్వేస్టేషన్ కు ఫోన్ చేసి కనుక్కుంటారు. గోదావరి ఎక్స్ ప్రెస్ రైట్ టైమ్ కే—ఎనిమిదింటికే వస్తుందని తెలుసుకుని హడావిడిగా ఆటో మీద స్టేషన్ చేరుతారు. సరిగ్గా ఎనిమిది కొడుతుంటుంది. ప్లాట్ ఫారం టిక్కెట్టు కొనుక్కుని లోపలికి వెళతారు. ఎక్స్ ప్రెస్ రాదు. పావు గంట తర్వాత పరిస్థితి అలాగేవుంటుంది. 'ఎంక్వైరీకి వెళ్ళి అడుగుతారు.

"ఎప్పుడొస్తుంది గోదావరి?"

"తెలియదు!" అంటాడా పూర్ణపురుషుడు. మీకు ఒళ్ళు మండిపోతుంది.

ఇంకోసారి ఇంకా గట్టిగా అడుగుతారు.

"స్టేషన్ మాస్టర్ ని అడగండి!" అన్న అతగాడి ఉచిత సలహామేరకు పరుగెడుతారు; గది వుంటుంది; కాని మేష్టారుండరు. యూనిఫారంలో కన్పడ్డ వారినెల్లా అడుగుతారు. అటు ఇటూ పరిగెడతారు. 'సత్యం' అన్నదాని అన్వేషణ ఎంత కష్టసాధ్యమైనదో తెలుస్తుంది; మీరు జ్ఞానవృద్ధులవుతారు ఈలోగా గోదావరి!

## ఎదిరించు, పోరాడు...లేదా .?

ఈ లీలలు అనంతం; కాశీ మజిలీలవలె వెయ్యేసి పుటల చొప్పున వంద పుస్తకాలు రాయవచ్చు .

కాని స్వతంత్ర భారత పౌరుడిగా పుట్టిన మీరు సహస్ర శీర్షాలతో, సహస్ర పాదాలతో ఎదురయ్యే ఈ అనాగరికతను, ఈ వికారాన్ని, ఈ కుసంస్కారాన్ని—ఎదిరించి పోరాడి, అలసి, రాజీపడి, జ్ఞానం సంపాదించేసరికి వానప్రస్థ దశ వస్తుంది.

హాయిగా అడవుల్లోకి వెళ్ళిపోయి,సింహాలు, పులులు, కొండ చిలువలు, ఖడ్గమృగాలువంటి మిత్రుల మధ్య నిశ్చింతగా కులాసాగా శేష జీవితాన్ని గడపాలనిపిస్తుంది.

అందుకే ఇది కర్మభూమి!

అందుకే మీరు కారణ జన్ములు! □

# దుర్గుణత్రయ విభాగయోగం

## మాటవరసకివి మూడు, మనిషి చావుకివి చాలు!

* అన్యాయం అజ్ఞానం అధికారం
ప్రస్తుతం భారతం భాగోతం

## సదా మీ సేవకుల దిగులు

* ఆ ఏడు వానలు లేక చెరువులూ నూతులూ ఎండిపోయాయని
మల మల మాడిపోయింది ఇల
కొళాయిలన్నవి రాక తాగడానికీ వాడకానికీ నీళ్ళు లేవని
గిజగిజ లాడిపోయింది ప్రజ
ఆ ఊళ్ళో అందరికన్న ఆ బాధ అనుభవించింది ఇద్దరు
ఒకరు పాలసప్లయిదారూ మరొకరు మందుల కంపెండరూ!

## మహాపతివ్రతల కథలు

* పది కాలాలపాటు తన పచ్చతాడు పదిలంగా ఉండాలని
వరహాలు పదహారు ఫలాలనోము మహరాజులా తీర్చుకుంది
అయిదోతనం నిలుపుకోడంకన్న ఆడదానికి పనేం ఉందని
లారీడు పసుపూ కుంకుమా సూరీడు వాడావాడా పంచింది
దీన్తో అప్పులపాలైన వీరి పతుల ప్రస్తుతస్థితి ఏమిటని?
బాగానే ఉన్నారు: ఒకరు జైల్లో, మరొకరు కాశీ వెళ్ళే రైల్లో!

## ప్రజా ప్రతినిధుల వ్యథలు

* చచ్చిన తమ పెద్దల గొప్పలు సవ్యంగా చాటదేమో అని
ఓ అమ్మ చరిత్రని గొయ్యితీసి పాతి పెట్టింది
పుట్టబోయే వాళ్ళకీ కట్టుకథ ఎక్కడ ఎక్కిపోతుందో అని
ఓ 'అయ్య' కొండనితవ్వి ఎలకని పట్టింది
బతికున్న వాళ్ళకిన్ని గంజినీళ్ళు ఇదే ఖర్చుతో పొయ్యొచ్చని
ఏ అమ్మకీ ఏ అయ్యకీ ఎప్పటికీ తట్టంది!

# పూలూ-ముళ్ళూ

ఈ వారం సీరియల్ ప్రారంభం!



ఐ.వి.యస్.
అచ్యుతవల్లి

చెఱుకు తోటల మధ్యనుంచి పరధ్యానంగా నడుస్తున్నాడు రామనాధం.

కాలవమీదనుండి చల్లటి గాలి వీస్తూ ఎంతో ఆహ్లాదంగా వుంది. పడమట అస్తమయ సూర్యకిరణాలు చెట్ల సందులనించి ఏటవాలుగా మీదపడి నులివెచ్చగా హాయిగా వుంది.

రామనాధం మనసు ప్రశాంతంగా లేదు. ఎంతోకాలం, చాలా జీవితకాలం శ్రమించి మలుచుకున్న అతని జీవితసౌధం బీటలు వారింది. దాన్ని ఎల్లా అతుక్కోవాలా అన్నది అతని మెదడుని అతలాకుతలం చేసేస్తోంది.

రామనాధం లాయర్‌గా ప్రాక్టీసు అయిదారేళ్లు చేసేడు. భూములు పాలికి ఇచ్చేస్తే పాడయిపోతున్నాయి.

"దున్నేవాడికే భూమి అనే నినాద దిక్కులు పిక్కటిల్లేలా మార్మోగుతున్నది. ఎంత నమ్మకస్థులైనా కాగితాలు ఎంత పకడ్బందీగా వ్రాసినా కౌలుదార్లు భూమికి ఆశపడరని నమ్మకం ఏమిటి! ఒక్కగా నొక్కడివి ఇల్లూ పొలాలూ వదిలి బల్లముందు గోళ్ళు గిల్లుకుంటూ 'ఎవళ్లు తన్నుకు ఛస్తారా! వ్యాజ్యం వేయమని సలహా ఇద్దామా'అని ఎదురుచూస్తూ కూర్చోవటం దేనికి" అంటూ తల్లి సతాయించగా పట్నంవదిలి స్వంత వూరువచ్చి వ్యవసాయం ప్రారంభించాడు రామనాధం.

భార్య శాంతకు పల్లెలో పడివుండటం ఏ మాత్రం ఇష్టంలేదు. దగ్గర దగ్గర కాన్పులతో శాంతకు కూర్చుంటే నీరసం నించుంటే ఆయాసంగా వుండేది. నలుగురు ఆడపిల్లల తర్వాత ఇంటికి దీపంలా వారసుడు శ్రీనివాసు పుట్టాడు. వాడికి అస్తమానూ జలుబు, జ్వరం వస్తూవుండేవి. చీటికి మాటికి శాంత హడావిడి పడి రామనాధాన్ని హైరాను పెట్టేది. ఎంత నలభయ్ మైళ్ళేఅయినా,బస్సు వాళ్ళు గౌరవంగా చూసినా పట్నంవెళ్ళి రావాలంటే వేసటగా వుండేది. పల్లెటూళ్ళల్లో సరిఅయిన వైద్య సౌకర్యం వుండదు. పిల్లలకు చదువులు చెప్పించాలంటే అయిదో క్లాసుదాటి స్కూలు లేదు. చిన్న తాటాకు పాక స్కూల్లో 'భక్త' గారి అమ్మాయిలు చదువుకోవటం శాంతకు నచ్చేది కాదు. "ఎప్పటికయినా పిల్లల చదువుల కయినా బస్తీ జేరాల్సిందే. ఇప్పట్నించే మంచి పునాది వేయకపోతే పిల్లలు పల్లెటూరి బైతుల్లా తయారు అవుతారు'' అంటూ రామనాధానికి చెవిలో ఇల్లు కట్టుకుని వీలయినప్పుడల్లా చెప్తూవుండేది.

రామనాధం తాత ముత్తాతలంతా ఇక్కడ్నే వున్నారు. తల్లి భూదేవిని నమ్ముకున్నారు. ఎకరాన్ని పదెకరాలు చేసారు. పదెకరాల్ని పాతిక. పాతిక ఎకరాల్ని యాభయ్—వంద. అల్లా తరతరానికి భూమిని ఎక్కువ చేసుకొన్నారు. తమ మనుమలు మనుమరాండ్రు వంశ పారంపర్యంగా 'దేహి' అని ఒకర్ని యాచించ నవసరం లేకుండా అనుభవించాలనీ తరతరాలుగా ఎన్నో విధాల శ్రమించి కుంచెడు భూమిని ఎకరాలు ఎకరాలుగా తమ చీమూ నెత్తురూ ధారపోసి కూడబెట్టారు.

"తల్లిని నమ్మినా భూదేవిని నమ్మినా ఎవ్వరూ చెడిపోరురా!" అనేది తల్లి. తల్లిని లాగే భూదేవినికూడా ఆత్మీయతతో కంటికి రెప్పగా చూసుకొన్నాడు. ఇన్నాళ్ళూ భూదేవి ఎన్నడూ రామనాధాన్ని సవతి కొడుకుగా చూడ లేదు. భూదేవిని నమ్ముకున్నందుకు విచారించ వలసిన పరిస్థితి రామనాధాని కెన్నడూ రాలేదు.

ఇప్పుడు పిల్లలంతా ఎదుగుతున్నారు. అవసరాలు ఎక్కువయ్యాయి. గవర్నమెంటు ధర్మమా అని విచారపడవలసిన అవసరం వస్తోంది. ఒకప్పుడు కాంగ్రెసు అంటే దాస్య విముక్తి కలిగించిన సంస్థ అని ఎంతో అభిమానించేవాడు. ఒక్క పెద్ద అమ్మాయికి మటుకు పెళ్ళి చేయగలిగాడు. రెండోది మెట్రిక్కువరకు చదివి మానేసింది. పెద్దమ్మాయి సావిత్రి వినయం, వివేకం కలది. రెండోది రాధ. కొంచెం గడుగ్గాయి. సినిమాలూ షికార్లూ అంటే ఇష్టం. ఎప్పుడూ పెద్ద పెద్ద అంతస్థులు కోరుకుంటుంది. మూడో అమ్మాయి సుమన. పట్నంలో మేనమామ ఇంట్లోవుండి బి.ఎ. చదువుతోంది. నాలుగో అమ్మాయి వినత. కొంచెం నెమ్మదైనది. పల్లెలో తల్లి వెనకాతల తిరుగుతూ వుంటుంది. చదువు అంటటంలేదు. రాధకు సంబంధాలు చూస్తున్నారు. ఎన్ని సంబంధాలు చూస్తున్నా రాధకు నచ్చటంలేదు. రాధకు నచ్చిన సంబంధం

వాళ్ళనిరామనాథం ఖరీదుచేయలేకపోతున్నాడు. ఇంతలో మిన్ను విరిగిమీద పడ్డట్లుగా భూకమతాల గరిష్ఠ పరిమితి నిర్ణయిస్తూ ఆర్డినెన్స్ వచ్చింది. తన సంతానంలో వాసు తర్వాత ప్రేమగా చూసేది సుమననే; దానికి చదువు అంటే ఇష్టంవుంది. స్వతహాగా తెలివయినది. మంచి మార్కులతో ప్రతి పరీక్ష ప్యాసవుతోంది. ఆడ పిల్లలు పెద్దవాళ్ళు—చిన్నవాడు మగ పిల్లవాడు ఎట్లారా అని సతమతమయి పోతున్నాడు.

తను జూదమాడలేదు. తాగలేదు. స్త్రీ లోలుడుకాదు. వస్తూన్న పొలంమీది అయివేజుతో అక్కలనీ చెల్లెళ్ళనీ సమాదరించేడు. ఒక్క ఎకరం పొలమన్నా అమ్మకుండా వస్తూన్న ఆదాయంతో ఇల్లునీ ఇల్లాలినీ జమీందారీ ఫాయాలో నడిపించుకొని వచ్చేడు. ఇప్పుడు ఇరవయి ఎకరాలు తప్ప మిగతా భూమి అంతా గవర్నమెంట్‌కి సరెండర్ చేయాలని తాకీదు వచ్చింది. గవర్నమెంట్‌తో లావాదేవీలు ఒక కొలిక్కివస్తే కాని భూమి కొనటానికి ఎవరూరారు. రాధకి పెళ్ళి చేయాలంటే కనీసం పాతిక వేలు కట్నం, పాతిక వేలు ఖర్చు. సుమన చదువు అవ్వాలి. వినత ఎద్దుమొద్దు స్వరూపం. దానిని ఒక దారికి తేవాలి. శ్రీనివాసు భవిష్యత్తుకి సోపానాలు వేయాలి! ఇదంతా ఎలా? ఎలా సాధించాలి? శాంతకు ఎల్లా సమాధానం చెప్పాలి! అనే వ్యగ్రతతో బాధపడసాగేడు రామనాథం.

అతను ఇల్లు చేరేసరికి అందరూ కాఫీలు తాగుతున్నారు. సెలవలు అవడంవల్ల రామనాథం అక్కచెల్లెళ్ళ పిల్లలుకూడా వచ్చేరు.

"అదుగో మామయ్య వచ్చేశారు" అన్నాడు శ్రీకాంత్. అతను కలకత్తాలో వుంటున్నాడు. రామనాథం పెద్దక్కకూతురు కొడుకు. తల్లి మామయ్య అని పిలవటంతో శ్రీకాంత్‌కూడా మామయ్యనే పిలుస్తాడు.

"ఏమిటి విశేషం నారాక కోసరం ఎదురు చూస్తున్నారు!" అన్నాడు గడప దగ్గరగా కూర్చుంటూ. శాంత కాఫీకప్పు తెచ్చిఇచ్చింది.

"ఏంలేదు నాన్నగారూ! మేమంతా పట్నం వెళ్ళి సినిమా చూడాలనుకుంటున్నాం. మీ పర్మిషన్ కావాలంటోంది సుమన" అందిరాధ. సుమనవేపు మెప్పుదలగా చూసేడు రామనాథం.

"ఆఖరిబస్సు ఆరుగంటలకే వెళ్ళిపోతుంది. మీరంతా తయారయినారా!" అన్నాడు రామనాథం.

"ఏమిటి మామయ్యా! ఇంకా బస్సు బస్సు అంటూ కూర్చుంటావు? తెల్లవారిలేస్తే ఇంటిల్లిపాదికీ పట్నం పోవాల్సిన పనివుండనేవుంటుంది. దుమ్ము కొట్టుకుంటూ ఆ లేబరాళ్ళమధ్యన చెమటకంపు కొట్టుకుంటూ ప్రయాణం చేయాల్సిన గతి ఏమిటి? చిన్న ప్లిమత్ కొనిపడేయకూడదూ! అసలు కారు వుండటం స్టేటస్‌కి సింబల్" అన్నాడు శ్రీకాంత్. అతని తండ్రి ఒక ఆటోమొబైల్ కంపెనీలో పనిచేస్తున్నాడు. ఎక్కడికి వెళ్ళాల్సినా తండ్రి కంపెనీకి వెళ్ళి ఏదో వెహికల్ తీసుకుని వెళ్ళటం అతనికి అలవాటు.

"అవును నాన్నగారూ! ఏదో ఒక కారుకొని పడెయ్యండి. ఎక్కడికి వెళ్ళాల్సివచ్చినా బలే ఇబ్బందిగా వుంది" అంది రాధ.

"హుం. కారు కొనాలంటే ఇన్ని రోజులా. శ్రీనివాసు పుటకలకు చెప్పాను. ఏదో ఒక కారు కొనండి అని. వింటేనా! ఎప్పుడూ డొక్కు డొక్కుమనుకుంటూ బస్సుల్లోపడి చావటమే!" అంది విసుగ్గా శాంత.

"ఇప్పుడు నాకు కారు వుండాల్సినంత స్టేటస్ లేదురా శ్రీ! ఒకప్పుడు వుండేది. కాని అవసరంలేక కొనలేదు. ఇప్పుడు అవసరం వచ్చింది. కొనేందుకు స్తోమతులేదు" అన్నాడు రామనాథం.

"అవసరంవున్నా స్తోమతు లేదనటం ఒక అలవాటు మీకు! ఇప్పుడు అంత బీదరికం ఏం ముంచుకొచ్చిందేం!" అంది రాధ.

"ఏం ముంచుకు రావటంలేదు. ఒకటి రెండు సంవత్సరాలలో మనమంతా యిరవయి యెకరాల పంటను సంవత్సరమంతా ఖర్చుచేస్తూ జీవించాలి, గవర్నమెంట్ ఎనభయ్యెకరాల

శుభకార్యాలలో
ఆనందాన్నిచ్చే
అందమైన వస్త్రాలకు!

మా

# న్యూక్లాత్ షోరూమ్

కు
దయచేయండి



**చల్లా బులిశివయ్య
అండ్ కో.,**
భీమవరం - 534201
ఫోన్: 227

నవీనమైన వస్త్రాలు
నమ్మకమైన ధరలు

పొలం మనకు ఎక్కువవున్నట్లుఖాయపరిచింది'' అన్నాడు రామనాధం. వెంకటలక్ష్మి రామ నాధం పెద్ద అక్క. శ్రీకాంత్‌కు అమ్మమ్మ అవుతుంది. ఆవిడ అంది. "ఖాయపరచారా! మా బాగాచేసారు. నీ గర్వం అణచారు. నలుగురు అక్కలకీ ఇద్దరు చెల్లెళ్ళకీ తలా ఒకపది ఎకరాలు ఇస్తే ఏమగును, అరవయి ఎకరాలు మనకుటుంబాలవాళ్ళే అనుభవించుదురు. ఆడ వాళ్ళకి ఆస్తెందుకు వాళ్ళేం పండించుకుంటారా! అంటూ అంతా నీకే పట్టం కట్టారు నాన్నా అమ్మానూ. పోనీ మా తరం వాళ్ళకి ఇయ్యబుద్ధిపుట్టలేదు అనుకుందాం. నీకూతుళ్లు ఏమయ్యారు! పాతికేసి ఏళ్ళువచ్చాయి. నలుగురికీ నాలుగుపదులు వ్రాసి పడేస్తే ఏమగును! వాళ్ళపేరనేనా పడివుండును. అసలు శ్రీనిగాడు పుట్టినప్పుడే అనుకున్నాను జ్యేష్ట నక్షత్రం అని. ఇంక ఆస్తిపోకుండా ఏమవుతుంది." అంటూ విదిలించింది.

వందెకరాలసాగు అని పేరు, దానికెంత మదుపుపెట్టాలి! వ్యవసాయం ఖర్చులు రోజురోజుకీ పెరిగిపోతున్నాయి. మదుపుపోనూ, కుటుంబ ఖర్చులుపోనూ, మళ్ళీ వ్యవసాయం పెట్టుబడికి ఇల్లంతా తడుముకోవాల్సి వస్తోంది. అక్కచెల్లెళ్ళు ఏదో వంకన సంవత్సరం పొడుగునా కొడుకుల్నో కూతుళ్ళనో తీసుకు వస్తూవుంటూనే వుంటారు. పెద్దకమతం. పదిమంది పాలేర్లూ, పశువులూ. ఈ హంగూ ఆర్భాటం పైకి బాగనే వుంది. కుళ్ళిన గుమ్మడిపండులా వుంది తన సంసారం!

"నేను చెప్పినట్లు ఏనాడు విన్నారు. ముసలాళ్ళ మాటవిని ఆస్తుల్ని నమ్మవద్దు మొర్రో అన్నాను. ప్రాక్టీసు చేసుకొనివుంటే ఈపాటికి ఏ జడ్జియో అయివుండేవారు. నా నుదుట ఆ అదృష్టం లేందే మిమ్మల్ని అనుకోవటందేనికి! పుణ్యంకొద్దీ పురుషుడు! అన్నారు పెద్దవాళ్లు! ఏమన్నా అంటే కళ్ళు తెరవని పసివాడి నక్షత్రం వచ్చింది నోళ్ళల్లోకి! ఒక్కగానొక్క నలుసునిచూస్తే కళ్ళుకుట్టుకుంటారు'' అంది శాంత ఉక్రోషంగా.

"మాకెందుకు చూపోపని తనం! పెద్దవాళ్ళు అనుకున్నదేదో అంటాము. మాకులేరా పిల్లాపాపానూ! ఏదోవంకన నోరు పారేసుకుంటావు! నీబాబు సొమ్ము ఏంలేదు ఇందులో! నీమొగుడు ఆర్జన ఏం తినటానికి రాలా మేము! తండ్రి తాతల సొమ్ము. పుట్టి పెరిగి ఆడిపాడినవూరు. నాలుగు రోజులుంటే నీబాబు ముల్లె ఎవరెత్తుకుపోతారు" అంటూ తన పెద్ద ఆడబిడ్డతనం చూపించింది వెంకటలక్ష్మి!

"ప్రతి చిన్నమాటకి పెద్ద రాద్ధాంతం చేయకండి అమ్మమ్మా! ఏదో సరదాగా వచ్చేం. సరదాగా నాలుగురోజులుండి వెళ్ళతాం! ఎవళ్ళ కుటుంబ విషయాలు వాళ్ళవి! అంత పెద్దగా అరిచి యాగీ చేయటమెందుకు?'' అన్నాడు శ్రీకాంత్. సుమన కళ్ళు మెరిశాయి. పూర్వతరం వాళ్ళకున్న ఈర్ష్యాసూయలు, పెట్టుపోతల మీది మమకారం నవతరం వాళ్ళకుండటం లేదు. 'శ్రీకాంత్ ఇరవై సంవత్సరాలు నిండని వాడయినా-మనుషుల్లో వుండాల్సినది స్నేహం, మమతానుబంధం కాని ఆర్థికబంధం కారాదని గ్రహించాడు' అనుకొంది సుమన.

"ఇంతకీ ప్రజెంట్ ప్రాబ్లం ఏమిటి! సినిమాకు వెళ్ళాలికదా! దానికి వాహనం కావాలా" అంది వాతావరణాన్ని తేలిగ్గా తీసుకొంటూన్నట్లుగా.

"ఆ! ఆ!" అన్నారు రాధ, శ్రీకాంత్ చెల్లెలు వినోద.

"నాన్నగారూ! నేను జగన్నాధరావుగార్ని కారు అడుగుతాను. మన శ్రీకాంత్ డ్రయివ్ చేస్తాడు. వచ్చేప్పుడు మళ్ళీ ఫుల్‌గా పెట్రోల్ కొట్టించి, వాళ్ళకారు వాళ్ళకి రిటర్న్ చేసేస్తాను" అంది సుమన.

"యూ బ్రేవో! సుమ్మీ! నీకుకూడా బుర్ర చురుగ్గా పనిచేస్తూందే! వెళ్ళు వెళ్ళు. చప్పున వెళ్ళు. టయిమయిపోతూంది" అంది రాధ.

"ఫరవాలేదు, వెన్నెల రోజులు. రెండో ఆటకు పోదాం. ఈలోగా భోజనాలుకూడా చేసెయ్యవచ్చును." అంది వినోద.

"వెన్నెల్లో కారులో తారురోడ్డు మీద ప్రయాణం బలేమత్తుగా, గమ్మత్తుగా వుంటుంది. వెంటనే వెళ్ళి కారు ఏర్పాటుచేయి" అన్నాడు శ్రీకాంత్.

"వెళ్ళనా నాన్నగారూ!" అంది సుమన.

రామనాథానికి అనవసరం వాటికి ఇతర్ల సహాయం స్వీకరించటం అంత ఇష్టంగా వుండదు, మరీ ప్రాణావసరమైతే తప్ప. పిల్లలు అల్లరి షికార్లకి కారు అడగటం ఏం బాగుంటుంది! అల్లా అని వద్దంటే పిల్లల వుత్సాహానికి అడ్డువచ్చినట్లు అవుతుంది.

"అడుగు . దానికేం! కాని చాలా జాగ్రత్తగా వాళ్ళ కారును వాళ్ళకు అప్పజెప్పాలి.శ్రీనువ్వు చాలా జాగ్రత్తగా డ్రయివ్ చేయాలి, రాత్రిళ్ళు జి. టి. రోడ్డుమీద లారీల ట్రాఫిక్ ఎక్కువగా వుంటుంది" అన్నాడు.

"ఆ భయం నీకొద్దు మామయ్యా! అభయం ఇస్తున్నాను" అన్నాడు శ్రీకాంత్ సుమన వినోద, రాధల వైపుచూసి.

* * *

లక్ష్మి చంచలమైనది. ఎవరివద్ద నిలవదు అన్నమాట జగన్నాధరావుగారిపట్ల అబద్ధం అయినది. నాలుగు తరాలనుంచీ వాళ్ళ ఆస్తి పెరగటమే కాని తరగటంలేదు. వూరిచివరగా పెద్ద తోటలాంటి ఆవరణలో వుంది జగన్నాధ రావుగారి మేడ. రామనాధంకు జగన్నాధరావుకీ బీరకాయపీచు సంబంధంవున్నా, ఆ సంబంధం మాటమాటకు ఎత్తిపూసుకు తిరగటం రామ నాధంకు మనస్కరించదు. వూరి మొత్తంమీదనే కాక చుట్టుపక్కల పది పన్నెండు పల్లెలకు జగన్నాధం మేటి ఆస్తిపరుడు. జగన్నాధంబాగా చదువుకొన్నాడు. ఎవరికి ఏ సహాయంకావాలన్నా చేసిపెట్టే సహృదయుడు. రామనాధంది అభి జాత్యం అహంకారం కల ప్రకృతి. ఎల్లాగో తను జగన్నాధంతో సాటివాడుగా నిలబడాలనే తప్ప, అతనితో రాసుకు పూసుకు తిరిగితే, ఎక్కడ హంగుదారుగా పేరుపడతానో అని లోపల్లోపల భయం. మనిషికి సంఘంలో గుర్తింపు వుండాలనే తాపత్రయం సహజంగా వుంటుంది. కొంతమంది సంఘంలో ఘరానాగా తిరిగే పెద్దమనుష్యులతో కూడాకూడా తిరుగుతూ తామూ గొప్పవారమనే భ్రమ ఇతరులకు కలిగించామనుకుని తమలోని గుర్తింపు కాంక్షని తృప్తిపరుచుకొంటారు. కొందరు ఘరానా వ్యక్తులకు యెదురుగా వారిని లెక్క చేయనట్లు నటించి తమలో తాము మధన పడుతూ ఎల్లాగో అల్లా వారి దృష్టిలో పడి "అబ్బో అతను ఎవర్నీ లక్ష్యపెట్టడు!" అనిపించుకుని తమ అహాన్ని తృప్తిపరుచుకుంటారు. రెండో వర్గానికి చెందుతాడు రామనాధం. అందువల్లనే రామనాధం నిబ్బరమైన వ్యక్తి అని అనిపించుకోగలిగాడు. జగన్నాధ రావుగారికి కూడా రామనాధం అంటే గౌరవం వుంది. వినోద సుమన కబుర్లు చెప్పుకుంటూ జగన్నాధరావుగారి మేడ చేరేసరికి ఏడుగంటలు కావచ్చింది. మేడ క్రింద హాలులో జగన్నాధ రావుగారి భార్య నళిని సోఫాలో కూర్చుంది. ఎదురుగ్గావున్న సోఫాలలో ఆడామగా ఏడెనిమిది మంది కూర్చుని వున్నారు.

"ఒక పనిమీద వచ్చేను." అంది వెళ్తూనే సుమన.

"ఊరకరారు మహాత్ములు అంటారు. చీకటిపడ్డాక బయలుదేరారేం!" అంది నళిని.

"ఇది మా మేనత్త మనమరాలు. కలకత్తాలో చదువుతూంది."

"ఐసీ. మనకున్న నాలుగడుగులు ముందే వుంటుందన్నమాట! ఏం చదువుతున్నావు!"

"హైస్కూల్ చదువు అయింది. ఆర్టు నేర్చుకుంటున్నాను. డిప్లొమా కోర్సు!" అంది వినోద.

"బాగుంది. మీ ధర్మమా అంటూ సుమన గారు మా ఇల్లు పావనం చేసారు. కాస్త చదువుకున్న దానివి. ఒకసారి మా ఇంటికివస్తే నేరమా! ఒక్కదాన్ని బోర్ కొట్టిపోతూ వుంటుంది" అంది నళిని.

"నేనున్నదేది! సెలవులకేగా వస్తూ వుంటాను. అప్పుడు ఇంట్లో వాళ్ళతోనే సరిపోతుంది. ఇంక ఎక్కడికీ రావటానికి తీరదు.

"ఈ ఏడాదితో సరే కదా!"

"ఆc. ఎల్లాగో గట్టెక్కి పోయాను."

"ఏం పోస్టు గ్రాడ్యుయేట్ అవ్వాలనిలేదా!"

"ప్చ్! నాకింక చదువు కోవాలనిలేదు."

"పెళ్ళి చేసుకోవాలని వుందా!" అంది నళిని. అందరూ ఆ మాటకు ఫక్కుమని నవ్వారు.

ఆ మాటలో అంత విరగబడి నవ్వాల్సిన విషయం ఏముందో సుమనకు అర్థంకాలేదు. వినోద కళ్ళు పెద్దవి చేసుకొని ఆఇంటి అలంకరణను ఐశ్వర్యాన్ని చూస్తూ మనస్సులో గుణింతాలు చేసుకుంటోంది. అంచేత వీళ్ళు ఏమి హాస్యమాడుకున్నారో ఆ అమ్మాయి చెవికి ఎక్కలేదు.

"ఏమిటి" అంది పరధ్యానంగా. వంట మనిషి రాజమ్మ కాపీలు ఫలహారాలు పట్టుకు వచ్చింది సుమనకూ వినోదకూ.

"ఎటూ కాని వేళ కాఫీఫలహారా లెందుకు!" అంది సుమన.

"ఎటూ కాని వేళ మీరు పెత్తనానికి రాగా లేంది నేను ఆతిథ్యం ఇవ్వటం అసంబద్ధంగా వున్నదా! కానివ్వండి. ఇంటికి వచ్చిన వాళ్ళకి ఏదో ఒకటి ఇయ్యాల్సిన గృహిణీ ధర్మం వున్నది కదా!" అంది నళిని.

"మరి మీరంతా!" అంది వినోద.

"మేమంతా రెండేసిసార్లు తీసుకోవటం అయింది. మూడోసారి తీసుకుందుకు రెడీయే కాని ఇంక రాజమ్మగారు మాకు పర్మిషన్ ఈయరు" అంది నళిని.

జీడి పప్పు పకోడీలూ, రసగుల్లా. బ్రూ కాఫీతో కడుపు నిండిపోయింది ఇద్దరికీ. "ఇంక భోజనం అక్కర్లేదు." అంది వినోద.

"ఈ మాత్రానికేనా! చాలా లైట్ టిఫిన్ కదా!" అంటూనే సుమనవైపు చూస్తూ —

"ఇంతకీ అసలు విషయం ఏమిటి!" అంది నళిని.

"మీ కారు ఒకసారి కావాలి. మావాళ్ళంతా వచ్చేరు. పట్నం వెళ్లుదామని సరదా పడుతున్నారు. అడుగుదామని వచ్చేము.

"పట్నమా! మధ్యాహ్నమే ఒక ట్రిప్పు వెళ్ళివచ్చింది. ఇప్పుడు భోజనాలయినాక ఈ బాచ్ అంతా వెళ్ళాలనుకుంటున్నారు. ఎల్లాగ!" అంది నళిని.

"పోనీ మనమంతా కలిసి వెళ్ళుదాం" అన్నారు నళిని స్నేహితులు.

"అదెల్లాగ మేముకూడా అయిదారుగురం వుంటాం!" అంది సుమన.

"ఎల్లాగో అల్లా ఎడ్జస్టు అవుదాం. దారిలో డ్రాపు అయ్యేవాళ్ళు ఇద్దరు ముగ్గురువుంటారు" అన్నారు అందులో ఒకరు.

"మమ్మల్ని వుండనిస్తే ఈ పూటకు వుండి పోతాంలే." అన్నారు ఇద్దరు ముగ్గురు.

"వుండ నియ్యకపోవట మనేదిలేదు. మీకే బోర్ కొట్టుంది అంటూ నన్ను బోర్ చేస్తారు. మీ ఇష్టం వచ్చినన్ని రోజులు వుండవచ్చును" అంది నళిని. నలుగురయిదుగురు ఆ రాత్రికి నళిని దగ్గర వుండటానికి సిద్ధపడటంతో అయిదారుగురు మగవాళ్ళు మటుకు వెళ్లిపోవటానికి రెడీ అయినారు.

"సరే అయితే వెంటనే బయలుదేరండి." అంటూ కారు తాళాలు సుమనకిచ్చింది నళిని. సుమన వెనకాతలే వినోద బయలుదేరింది. తోట చివర్నవుంది కారు షెడ్డు. సుమన వినోద వెన్నెల్లో కారు షెడ్డుకి వెళ్ళే సన్నని కాలిబాట వెంబడి నిటారుగా అయిదారడుగుల ఎత్తున నించున్న విరబూసిన పారిజాతపు చెట్లని చూస్తూ నడిచారు. ఎదురుగ్గా చేయెత్తు మనిషి నడిచి రావటం వాళ్ళు చూసుకోలేదు. ఏదో ఆలోచిస్తూ పరాగ్గా నడుస్తున్న జగన్నాధానికి మృదువయిన ఎత్తులతో వున్న లేతశరీరం ఎదురుగ్గా హత్తుకోవటంతో నరాలన్నీ జివ్వుమని వళ్ళంతా విపరీతమయిన సంచలనం కలిగింది. ముందుకు తప్పుకోలేక బలంగా భుజాలని గుచ్చిపట్టుకుని "ఎవరది!"అన్నాడు. సుమన శరీరం గాలిలో తేలిపోయింది. సినిమాల్లో చూసిన దృశ్యాలు, నవలల్లో చదివిన సంఘటనలుకన్నా మిన్నగా ఏదో ఏదో తెలియని వింత అనుభూతి కలిగి హాయి అనిపించింది.

"నేనే. నేనే!" అస్పష్టంగా గొణిగింది. వెనకాతల పుత్తడి బొమ్మలా వినోద నించుండిపోయింది.

"నేనంటే!" ఆశ్చర్యంగా చూస్తున్నాడు. అతని అరచేతులు గుండ్రని భుజాలని నిమురుతున్నాయి. ఆ విద్యుత్తువల్ల కలిగే హాయి అతను ఇంతకుముందెన్నడూ ఊహించుకోలేనిది. పడుచుతనంలోని వేడి ఇంత ఉద్రిక్త పరుస్తుందని ఎవరయినా నోటిమాటగా చెప్పితే అతను తేలిగ్గా కొట్టి పారవేస్తాడు. కాని అతనికి ఇప్పుడు ఈ వింత కదలిక అనుభవంలోకి వచ్చింది.

"రామనాధంగారి అమ్మాయిని!" వెనకాతల వినోద వున్నదన్న స్మృతే లేకపోతే సుమన గట్టిగా జగన్నాధాన్ని వాటేసుకుని వుండును.

"ఆ! " చప్పున జగన్నాధం చేతులు తోట కూర కాడల్లా వేలబడిపోయేయి.

"కారు కోసమని " అంది సుమన.

"తాళాలు ఆవిడవద్ద. " అన్నాడు జగన్నాధం.

"తీసుకున్నాము." ప్రక్కకు తొలిగాడు. పారిజాతం చెట్టు తగిలింది. చెట్టు ఊగింది. సన్నని మృదుపరిమళాలు వ్యాపించాయి. సుమన వినోద కారు షెడ్డుకు వెళ్ళారు.

"అతనెవరే!" అంది వినోద.

"ఆయనే జగన్నాధరావుగారు!" అంది సుమన.

"ఛఛ!" అంది వినోద.

"అదేమిటే!" ఆశ్చర్యపోయింది సుమన.

"అంత పొడుగ్గా జగన్నాధరావుగారు అంటూంటే నేను మన మామయ్యలా వుంటారనుకున్నాను. ఇదేమిటే సినిమా హీరోలా

వున్నాడు? ఎంత బాగున్నాడు! ఆ ఎత్తూ లావూ! చక్కని పసిమి ఛాయా! అబ్బ! నళిని ఎంత అదృష్టవంతురాలు!'' అంది వినోద.

''అదా! ఆయన చిన్నవాడే! మహావుంటే ముప్ఫయ్ ఆరు ముప్ఫయ్ ఏడు ఏళ్ళు వుంటాయి. అయినా ధనవంతుడు కనుక అందరూ జగన్నాధరావుగారు అని మర్యాదగా పిలుస్తారు'' అంది సుమన.

''అదేం బాగులేదు. ఏ చంద్రశేఖరో రాజగోపాలో అయివుంటే బాగుండేది. ఒసే సుమీ్మ! నువ్వు కనుక అల్లా బిక్కచచ్చి పోయేవు కాని అదే నేనయితేనా!'' అంది. వినోద.

''నువ్వయితే? ఏం చేసేదానివి?''

''గట్టిగా కావలించుకునే దానిని అవకాశం వృధా పోనీయకుండా!''

నవ్వేసింది సుమన. కాని తన మనసూ ఆ కోరికేకోరిందని వెనకా తల వినోద వుండటం నించి తను బేలతనం కావాలని కొని తెచ్చుకొని నటించిందని ఎల్లా చెబుతుంది.

* * *

రాత్రి పన్నెండు దాటినా పందిర పట్టి మంచంమీద అటూ ఇటూ కదుల్తున్న భర్తని చూసింది నళిని. తన మంచం మీద నుంచిలేచి వచ్చి భర్త మంచంమీద కూర్చుంది. మృదువుగా భుజంమీద చేయివేసి — ''నిద్ర రావటం లేదా!'' అంది. జగన్నాధం మాట్లాడలేదు. నెమ్మదిగా ప్రక్కన వ తిగిల్లి అతని వీపుకి తన ముఖం రుద్దుతూ ''ఏమిటో అంత సంఘర్షణ! నాతో చెప్పకూడదా!'' లాలనగా అడిగింది. జగన్నాధం నళిని వెంపు తిరిగాడు.

లేత నీలి రంగు కాంతి పల్చని వెన్నెలలా గది అంతా పరుచుకునివుంది. గదిలో ఎదురెదురుగా ఇద్దరి పందిర పట్టెమంచాలు పల్చని దోమ తెరలతో అలంకరించి వున్నాయి. గది మధ్యన చిన్న టీపాయ్ చుట్టూ నాలుగు చిన్న చిన్న కుషన్ కుర్చీలు వున్నాయి. గోడకు ఒకవారగా డ్రస్సింగ్ టేబుల్ వుంది.

లేత పచ్చని చీరలో వున్న నళిని పల్చని శరీరం నళిని బట్టలు కట్టుకుందా లేదా అనే భ్రమ కలిగింపచేస్తోంది. సన్నగా కొసలు తేరిన సోగకళ్ళు జగన్నాధం కళ్ళలోకి చూస్తున్నాయి. ఆ నల్లని చారెడు కళ్ళలోని కాంతికి జగన్నాధం మనస్సు ముడుచుకు పోయింది. నళిని అందమయినది. అంటే చాలదు. చాలా అందమయినది. ఎంతో అనురాగవతి. విద్యావతి. ఆమె చదువుకునే రోజుల్లో కాలేజీలో ఆడామగా కూడా ఆమె స్నేహం కోసం ఆమె చుట్టూ తిరిగేవారు. ఒక వింత ఆకర్షణతో అందర్నీ ఆకట్టుకునేది. జగన్నాధం సంబంధం గురించి మొదట తండ్రి నళినితో చెప్పినప్పుడు, నళినే కాక నళిని స్నేహవర్గం అంతాకూడా నిరసనవెలిబుచ్చారు.

''అతడు చదువుకోని మూర్ఖుడు కాడు. చాలా ఆస్తి పరుడు. ఉద్యోగం చేయాల్సిన అవసరం లేక అతను ఉద్యోగస్థుడు కాలేదు. అయినా ఒకసారి. చూస్తే ఏంపోయింది!'' అన్నాడు తండ్రి. ఎంతో బలవంతం తల్లి తండ్రులు చేయగా పెళ్ళి చూపులకు అంగీకరించింది. జగన్నాధాన్ని చూసి మెరుపుకొట్టినట్లు అయ్యింది. వెంటనే తన అంగీకారం తల్లికి తెలిపింది. నళినిది కళాత్మక హృదయం. పల్లె జీవనం గురించి పుస్తకాలల్లో తెగ చదివింది. పల్లీయులు కల్లాకపటమెరుగని అమాయకులు అనుకుంది. తను ఆదర్శవనితగా వుండాలి. వాళ్ళని సంస్కారవంతుల్ని చేయాలి. శుభ్రత మప్పాలి. తన భర్తకు బాగ డబ్బున్నదిట. దానిని సద్వినియోగం చేయాలి. ఎన్నెన్నో ఆశలు! ఆశయాలు! కలలు! కలవరం! జగన్నాధంతో ఆమె పెళ్ళి ఆమె జీవితంలో ఒక మధురాతి మధురమయిన ఘట్టంగా నిలిచిపోయింది. అతని ప్రక్కన వుంటే ఆమె తనువంతా పులకరించి మైమరిచిపోతుంది. జగన్నాధం నళిని భుజాలను తన అరచేతులతో రుద్దాడు. కాని కాని ఆ పులకరింత ఆ మైమరపు ఆ అనుభూతి ప్ప్''కల్గగలేదు.

"ఏమిటలా వున్నారు!" అంది, లేత గులాబీరేకల వంటి పెదాలు జగన్నాథం చెంపల్ని మృదువుగా తాకాయి.

"ఏం లేదు." మనస్సులో ఒక తెర. ఒక దాపరికం' అర్ధాంగానికి తెలియనీయకుండా ఒక ఉపన' దాచుకోవాలనే ఆరాటం! "నాకు చెప్పకూడదా!" అంది, మృదువుగా గుండెల్లో ముఖం దాచుకుంటూ. అప్సరసలను తలదన్నే అందం. అమృత హృదయం. చదువు సంస్కారం తాళికట్టి తన దాన్ని చేసుకున్న సౌందర్యం తన స్వంతం. తనకి స్పందన కలిగించలేక పోతోందేమిటి? పాలరాతి బొమ్మని చూస్తారు. అందంగా వుందని మెచ్చుకుంటారు. అంతవరకూ ప్రతి మనిషి చేస్తాడు. కాని ఆ సజీవ ప్రతిమలోని ప్రతి ఒంపు సొంపులనూ రసైకానుభూతితో స్పృశించలేరు. జగన్నాథం నళినిని పెళ్లి కూతురుగా పెళ్లి చూపులలో చూసేడు. తనకన్న ఆస్తి పరులు. రావు బహద్దూరు బిరుదుని త్యజించి తమ దేశభక్తినీ నీజాయతీనీ చాటుకున్నారు నళిని తండ్రి సోమనాథం. ఘరానా వంశస్థులు. నళిని అన్నలు అమెరికాలో స్థిరపడినారు. కుటుంబంలో కడసారి పిల్ల నళిని. వీరితో వైవాహిక బంధంవల్ల తమ కుటుంబానికి డబ్బువల్లనే కాక సాంప్రదాయికంగా సాంస్కారికంగా ఇంకొక ఉన్నత సోపానము ఎక్కిన ఘనత వస్తుంది. అక్కలు బావగారు పెద తండ్రులు పిన తండ్రులు అందరూ ఏకగ్రీవంగా అంగీకరించిన సంబంధం. నళినిని చూసిన జగన్నాథం పాలరాతి శిల్పాన్ని చూసిన అనుభూతిని పొందినాడు. ఇరువురికీ నచ్చినది. బంధం పడినది. ఎన్నెన్నో జన్మలతపస్సులా మొదటి రాత్రి నళిని మనస్సు పరవశం చెందింది.

జగన్నాథం అనుకున్నాడు 'ఇంత అందమయిన అమ్మాయిని పూ రి కే చూడాలనిపిస్తోంది తప్ప, భార్యగా ప్రేయసిగా ఏవేదో చేయాలని అన్పించటం లేదేమిటి. ఈ అశక్తత ఎవరితో చెప్పుకోగలను! మన స్సులో ఆరాటం, పొంగే కోరికల ఉధృతాన్ని నళిని ఎలా తట్టుకోగలదు!' తనని విపరీతమైన కాంక్షతో పాములా పెనవేసుకు పోయిన నళినిని వీపుమీద మృదువుగా ప్రేమగా తల్లి పసిపిల్లను లాలించినట్లు లాలించుతూ

"ముట్టుకుంటే మాసిపోయేలా వున్నావు నళినీ' ఇంత సుకుమారం, సౌందర్యం భగవంతుడు నీకిచ్చిన అపురూపవరం'' అన్నాడు. నళిని అతని ముఖంలో ముఖంపెట్టి చూసింది ఏదో వెతుకుతున్నట్లు.

"దేముడు నాకిచ్చిన అపురూపవరం. ఈ సుందర రూపం కానేకాదు."

"మరేమిటి!"

"మీరే! ముందు పల్లెటూరి సంబంధం అని భయపడినాను. కాని మిమ్మల్ని చూసిన మరుక్షణమే, మీరు ఎక్కడుండేదీ మర్చిపోయాను. సీత రామునివెంట రాజభోగాలని వదలి అడవికి వెళ్ళిపోటానికి ఎందుకు సిద్ధపడిందో, నాకు మిమ్మల్నిచూసిన మరుక్షణమే అర్ధమైంది" నళిని అరమోడ్పుగా కన్నులుపెట్టి మాట్లాడుతుంటే జగన్నాథానికి నవ్వువచ్చింది.

"ఇంకా " అన్నాడు.

"మీకు నామాట నమ్మకం లేనట్లుంది" అంది మూతి ముడుచుకుని.

"ఎందుకు వుండదు? మనమధ్య వుండాల్సినది ముందు ముఖ్యంగా నమ్మకమే!"

"నాకు నమ్మకంలేదు బాబూ "

"అదేం!"

"ఈ అందాల రాముడికోసం శూర్పణఖలు వలలు వేస్తూవుంటారు "

"అయ్యబాబోయ్! అపరంజి బొమ్మలాంటి నీవు పక్కనవుండగా శూర్పణఖలు నన్నేమి చేయగలరు?"

"ఊఁ ఊఁ కవిత్వం వచ్చేస్తోంది "

"ఆమాత్రం కవిత్వం నేర్చుకోకపోతే నన్ను పల్లెటూరి బడుద్దాయిక్రింద జమకట్టేయవా!" అన్నాడు. ఏవేవో అర్ధం పర్థం లేని మాటలు ఎన్నిరోజులనుంచో తెలిసున్న స్నేహితుల్లా మాట్లాడుకున్నారు. ఎన్నిసార్లో ఆమెని

పొందాలనే ఆరాటం. పొందలేని అశక్తత! చెప్పుకోలేని ఉద్విగ్నతతో కాలం గడుస్తోంది. నళిని భర్త మనసులో ఏదో గూడుకట్టు కుంటూన్న బాధని అంచనా వేయగలిగింది. ఎన్ని విధాలుగానో అతనితో తన బంధం పటిష్ఠం చేసుకోవాలని తాపత్రయపడింది. ఈ రోజు చాలా కొత్తగా కన్పించాడు జగన్నాథం. అతనిలో తను పదేళ్ళల్లోనూ చూడలేని వాడి తనం కన్పించింది. వేడిగావున్న అతని కౌగిలిలో గువ్వలా ఒదిగి నిద్రపోయింది నళిని. జగన్నాథం ఆలోచనలో పడినాడు. నళినికేమి లోటు. పదేళ్ళ సాహచర్యం! అగ్నిసాక్షిగా తాళికట్టిన భార్య! ఆ సుమన ఏం బాగుంటుంది. చామన చాయ. సన్నగా పొడుగ్గా వుంటుంది. పెద్దరూపసి క్రింద లెక్కరాదు. పాతికేళ్ళ వయస్సు తప్ప ఆమెలో ఇంకేమీ ఆకర్షణ లేదు. అయినా ఆమెని తాకినంతనే తన నర నరాల్లో విద్యుత్తు ప్రవహించింది. ఆమెని ఆ క్షణంలో అనుభవించేయాలన్నంత ఆవేశం కలిగింది. ఆ ఉద్రిక్తత, సర్వాలంకార భూషితయై సన్నజాజి మాలలా తన ఒడిలో చేరిన నళినివల్ల మొదటిరాత్రికూడా కలగలేదు. కారణం ఏమిటి! చెప్పలేనిది. చెప్పరానిది. శారీరక తృప్తి నళిని పొందగలిగిందో లేదో తనకు తెలియదు కాని తనకు మటుకు నళినితో వాంఛ తీర్చుకోవటం తప్పనిసరి మొక్కుబడి లానే వుంటోంది. ఒక్కొక్కప్పుడు నళిని మీద విపరీతమయిన జాలి కలుగుతుంది. ఒకొక్కప్పుడు నళినిమీద కోపంకూడా వస్తుంది, ఇన్నాళ్ళ సాహచర్యంలో నళిని తన స్వభావం గుర్తించదేమిటా అని! గుర్తించినా ఏం చేయగలదు! బలమయిన త్రాడు ఆమె మెడను చుట్టివుంది. పైగా ఆమెకు తనంటే విపరీతమయిన అభిమానముంది. అభిమాన మనే గొలుసుతో తనను తనే కట్టేసుకుంది. పాపం నళిని!

*   *   *

"ఏమిటే అంత దీర్ఘాలోచనలో వున్నావ్!" అంది రాధ.

"కలలు కంటోందిలావుంది" అందివినోద.

"ఛ. ఛ నాకేంకలలు!" అంది సుమన.

అది మేడమీద గది. దీర్ఘచతురస్రాకారంగా వుంటుంది ఆ గది. నవ్వారుపట్టెనేసిన మంచాలు నాలుగయిదు వున్నాయి గోడకు ఒకవారగా. రోజ్‌వుడ్‌తో చేసిన పాతకాలపు బట్టలబీరువాకు నిలువుటద్దం బిగించి వుంది. విశాలమైన డ్రాయరుకూడా వుంది. దానిమీద తలనూనె, పౌడరు మొదలయిన టాయిలెట్ సామానులు వున్నాయి.

"నీకు కలలురావటం నామర్దాయా!" అంది వినోద.

"కలలు రావటంకూడా ఒక అదృష్టమే!" అంది రాధ.

"నీకింక కలలుకనే ఛాన్సు పోయినట్లే!" అంది వినోద రాధని చిలిపిగా చూస్తూ.

"అదేం!"

"ఇంకెందుకు! తాటిపాడు వాళ్ళసంబంధం సెటిల్ చేసేసారుకదా మామయ్య."

"ఎవరూ! ఆ పోతురాజు కా!" అంది సుమన. తాటిపాడు ఒకచిన్న అగ్రహారం. వాళ్ళకి ఒక్కడే అబ్బాయి సత్యవరప్రసాద రావు. మంచి విగ్రహపుష్టి వుంది. చదువుంది ఆస్తివుంది. కాని అమ్మకూచి. తల్లి యెంత చెప్పితే అంతా. తిండికి తిమ్మరాజు, పనికి పోతరాజు అని సుమన, వినత వేళాకోళం చేస్తారు. ముందు కట్నం ముప్ఫయ్‌వేలు అడిగటంతో వెనకంజ వేసినా చివరికి తెగించి ఒక పిల్ల ఇంటినుంచి వెళ్ళినా వెళ్ళగలగటమే అని ఆరోజు ఉదయమే వెళ్ళి ఒప్పందం చేసుకొని వచ్చేడు రామనాధం.

"మాటలు మీరకు! బావగారు అయిపోతు న్నారు" అంది వినోద.

"ఇంతకీనీకు మనసారా నచ్చినట్లేనా రాధా!"

"అతను అంత నచ్చలేదుకాని అతని వెనక వున్న ఆస్తి నచ్చింది."

"ఇంక నీదేనే నెక్స్ట్‌ఛాన్స్!" అంది వినోద.

"నేను పెళ్ళి చేసుకోను."

"ఓయబ్బో! అయితే ఏం చేస్తావు?"

"ఉద్యోగం చేస్తాను."

"నీబోడి బియ్యేకు ఎవరిస్తారే ఉద్యోగం! డబల్ ఎం. ఏలకు దిక్కులేదు కాని."

"ఫలానా ఉద్యోగం కావాలంటే దొరకదు కాని దొరికినదేదయినా చేస్తే ఏదో ఒక ఉద్యోగం దొరక్కపోదు."

"నాన్న ఒప్పుకోవద్దూ?"

"నేను అడిగితే కాదనరు" అంది సుమన.

"పోనీలే. నీ ఆశయమే నెరవేర్చుకో!" అంది రాధ.

"అంత డీలా పడిపోయావేమే! నీ ఆశయాలేమీ నెరవేరటం లేదా!" అంది వినోద.

"దానికి అందాల రాజకుమారుడ్ని పెళ్ళి చేసుకోవాలని వుండేది" అంది సుమన.

"పోతురాజు అందగాడేనే పాపం!" అంది వినోద.

"పాపమేం ఖర్మ! ముప్ఫయ్ వేలతో ముద్దులగుమ్మ ఒళ్ళోవచ్చి వాలుతుంటేనూ!" అంది సుమన.

"నేను భర్తే కట్నం తీసుకున్న వాడ్ని చేసుకోను" అంది ప్రతిజ్ఞ పట్టినట్లుగా వినోద.

"కట్నం నువ్వు ఈయవు. మీ నాన్న ఇస్తాడు. ఇంక పెళ్ళి అంటావా! మనం చేసుకోము. మనల్ని వాళ్ళే చేసుకుంటారు!"

"నేను ప్రేమించి చేసుకుంటాను పెళ్ళి!"

"యూ నాటీగర్ల్! మీ టీనేజ్‌వాళ్ళ కలలు అవి. ప్రేమించు. అది మన అందరి జన్మ హక్కు! ఎవరూ వద్దనరు. కాని పెళ్ళి ప్రస్తావన తీసుకురాకు! పెళ్ళి అనే మంత్రం పఠిస్తే ప్రేమ అనే దయ్యం దూరంగా పారిపోతుంది."

"ప్రేమించినవాడ్ని పెళ్ళిచేసుకుంటే లైఫ్ పరమబోర్‌గా వుంటుంది." అంది రాధ.

"అదేమిటేవ్! కొత్తసూత్రం చెప్తున్నావ్" అంది సుమన.

"నిజమేనే! ప్రేమికుడే భర్త అవుతాడనుకో! నిరంతరం మనచుట్టూ ప్రదక్షిణాలు చేస్తూ కూర్చుంటాడు. కొన్ని రోజులకు అతనంటే విసుగుపుట్టుంది."

"ఛ ఛ! భర్త అంటే భార్యకు విసుగు పుట్టటమా. నువ్వు పుట్టి పెరిగింది తెలుగు దేశంలో అని మర్చిపోతున్నావా!" అంది వినోద.

"ఎక్కడ పుట్టినా ఎక్కడ పెరిగినా మన చుట్టూ తిరిగే వారంటే మనకు ఆకర్షణ ఆత్మీయత కలగదు. కొంతమందికి పైకి చెప్పుకోవటం నామర్దాగా వుంటుంది. లోపల్లోపల స్వయం పాకాలు పిండుకుంటూ వుంటారు! కొంతమంది పైకి తేలిపోతారు. వారికి లోపల ఒకలాగా పైకి ఒకలాగా ప్రవర్తించటంచేత కాదు." అంది రాధ.

"ఇంతకీ నువ్వు నచ్చని మెచ్చని పోతురాజుని ఎందుకు పెళ్లి చేసుకుంటున్నావు!" అంది సుమన.

"చెప్పానుగా! ఆస్తివుంది. పైగా అతనికి తల్లి చెప్పినట్లు వినటం అలవాటుండేది. ఆడపెత్తనం సహించే మగవాడయితే మనకెంతో లాభం. మనం చెప్పినట్లు వినటంలో అతను సందేహించడు."

"మరి అస్తమానూ నీ చుట్టుతిరుగుతూంటే నీకు విసుగు పుడుతుంది అన్నావు కదే!"

"అన్నాను. కాని అతన్ని ప్రేమించలేదు కదా! అరిచేత అతన్ని తప్పించుకుని తిరగటం చాలా సులభం!"

"అదేమిటే బాబూ!"

"అదంతే! మనం ఎక్కువ ప్రేమించిన వ్యక్తి మనకు దూరదూరంగా వుంటే మన మనస్సు ఎల్లప్పుడూ వాళ్ళ గురించే ఆలోచించుతూ వాళ్ళ యోగక్షేమాల కోసమే పరితపిస్తూ వుంటుంది. మన ఆత్మీయతని కనిపెట్టి వాళ్లెప్పుడయితే మనకు చేరువయ్యారో వాళ్ళంటే మనకు అప్పుడే లోకువ ఏర్పడుతుంది. వదిలిపెట్టలేని ప్రేమవుంటుంది. వాళ్ళ మెతకదనానికి అసహనం కలుగుతుంది. ఒక విధమైన చిరాకు కలుగుతుంది."

"బాగుంది. చాలా బాగుంది."

"అవును నాకు పోతురాజుమీద ప్రేమ గౌరవం అభిమానం ఏమీలేవు. తాళికట్టాడు. భర్త అవుతాడు. అతని డబ్బులో భాగస్వామ్యం

వస్తుంది. అతను మంచి వాడయినా చెడ్డవాడయినా నా మనస్సుకి ఏమీ స్పందన కలగదు. ఎవరి సరదాలు వాళ్ళవిగా జీవించకలము. వాళ్ళని కనుక మనము ప్రేమించటం మొదలు పెట్టామంటే వాళ్ళు మన సరదాలని కోరికలని అనుకరించాలనే తహతహ మొదలవుతుంది. అల్లానే వాళ్ళు మనల్ని ప్రేమించినా మనం వాళ్ళ అభిరుచుల్ని గౌరవించాలనే తాపత్రయ్య పడుతారు. అల్లా లేకుండా ఎవరి జీవితాలు వాళ్ళు జీవించ కలగటమే నాకు బాగుంటుంది." అంది రాధ.

"సరే రాధక్క అభిప్రాయం విన్నాం. వినోదా! నువ్వేం చేస్తావే!"

"మొదటే చెప్పాగా ప్రేమ వివాహం!" అంది వినోద తలగడదిండు ఒడిలో వేసుకొని మోచేతులతో నొక్కుతూ.

"అయితే! నీమాటేమిటే! నెక్ట్స్ ఛాన్స్ నీదే!" అంది రాధ. సుమన కళ్ళు అర మోడ్చింది.

"నేను నీ అంత అందగత్తెను కాను."

"ఫస్టు పాయింట్!"

"చదువు కొంచెం వచ్చింది. కాని ఇంకా చదివే ఓపిక లేదు."

"సెకండ్ పాయింట్!"

"ప్రేమించటానికి నేను రెడీయేగాని నన్ను ప్రేమించటానికి ఎవరూ ముందుకు రాలేదు."

"థర్డ్ పాయింట్!"

"పెళ్లి చేసుకుందామన్నా, ఇంక అయి దారేళ్ళవరకూ నాన్న నాకు మొగుణ్ని కొనగల తాహతులోకి రారు."

"ఫోర్త్ పాయింట్"

"అంచేత అమ్మ వెనకాతలవుంటూ ఇంటి పనిలో గృహోపయోగకరమగు విషయాలలో ట్రయినింగు అవుతూ ఈ పంచవర్ష ప్రణాళిక కాలాన్ని గెంటటానికి ప్రయత్నించుతాను."

"ఫిఫ్త్ పాయింట్! చాలా బాగా చెప్పావు సుమనా. కానీ మరీ అంత పెసిమిజం పనికి రాదు. బీ ఛీర్‌ఫుల్! పల్లె వాసులకు బస్తీ పిల్లలకు ఆలోచనా విధానంలోనే తేడావుంది. నేనెప్పుడూ అందరితోనూ చనువుగా స్నేహంగా వుంటాను. ఒకరిద్దరు నన్ను అపార్థం చేసుకున్నారు. కొంతమంది నా శరీరాన్ని కూడా కోరారు. అల్లాంటి వాళ్ళకు నేను ఒక్కమాట చెప్పాను. నేను స్నేహంగా చనువుగా వున్నంత మాత్రాన్న ఇలాంటి అవివేకానికి ఒడిగట్టు తానని ఎలా అంచనా వేసారు! అయినా నా మనస్సుకునచ్చిన పురుషుడయితే అతను కోరినా నేను ఊరుకుందును. మీరెవ్వరూ నాకు నచ్చలేదు. అంచేత మీకోరిక నేను తీర్చలేను."

"అంత బ్లంట్‌గా చెప్పేస్తే వాళ్ళకు కోపం రాలేదూ!" ఆశ్చర్యంగా అంది సుమన.

"కోపం వచ్చిన వాళ్ళు, స్నేహం మానుకున్నారు. కోరిక కన్న స్నేహానికి ఎక్కువ విలువ ఇచ్చిన వాళ్ళు స్నేహం చేస్తున్నారు." అంది వినోద.

నిండా పద్దెనిమిది ఏళ్లులేని వినోద ఎంత ధైర్యవంతురాలు! కలకత్తా నగర జీవితం వాళ్ళకు వంట పట్టింది. జీవితంలో ఎంత ముఖ్యమయిన సంఘటన జరిగినా వాళ్లు దాన్ని తేల్తిగ్గా తీసుకుని మర్చిపోగలరు. తనకి పాతికేళ్లు దాటుతున్నాయి. శృతిచేసిన వీణలావుంది తన శరీరం. పట్నంలో బి. ఎ. చదివినా మేనమామ ఇంటిలో వుంటం మూలంగా ఎక్కువ స్నేహితులు పెరగలేదు. ఒకరిద్దరు తన వైపు ఆకలిగా చూసినా తను ఆ చూపులకు చలించలేదు. కాని నిన్న నిన్న జగన్నాధరావు స్పర్శ తనకి తగలగానే వళ్ళంతా పువ్వు రేకలు విచ్చుకున్నట్లు తేలిపోయింది. తనకి జగన్నాధరావు గారు కొత్తకాదు; పదేళ్ళ క్రితం వారి పెళ్ళి అయి గృహప్రవేశంకు వచ్చినప్పుడు మూడు రోజులూ జగన్నాధరావుగారి మేడలోనే వుంది. పదిహేనేళ్ళు నిండనిదయినా పరికిణీ వోణీలు వేసుకుని పెళ్లి సందడిలో ఎవరికి ఏమి కావాలన్నా అందిస్తూ చలాకీగా తిరిగింది. నళినికి కూడా సుమన నిర్భీతితనం నచ్చింది.

(సశేషం)

# శ్రీనివాసా క్లాత్ ఎంపోరియం

ఫోన్స్
హెడ్డాఫీస్ 409
నివాసం 755
బ్రాంచి 355

హోల్ సేల్ & రిటైల్ కట్ పీసెస్ క్లాత్ మర్చంట్స్

మేనేజింగ్ పార్ట్నర్ **కచ్చాల అప్పారావు**

హెడ్ ఆఫీస్:
భీమవరం-2

బ్రాంచి
ముస్లింవారి వీధి,
అమలాపురం.



చౌకధరలకు
నాణ్యమైన బట్టలు.

వివాహాది
శుభకార్యములకు,
రోజువారి వాడుకకు
అన్నిరకముల
మిల్లువస్త్రములు
సరసమైన
మిల్లుధరలకు
టోకుగాను
చిల్లరగాను
లభించును.

మా
షోరూం
సందర్శించండి!

పెద్దకథ



# ఎదురీత

చెళ్లూరి సీతారాజేశ్వరరావు

మధ్యాన్నం రెండు గంటలయింది. దివాకర్ లంచ్‌కి లేవకుండా మేనేజింగ్ డైరక్టర్ టూర్ డైరీ పరిశీలిస్తున్నాడు. ఇంతలో ఫోన్ మ్రోగింది. కొంచెం తాత్సారం చేసి చిరాగ్గా అందుకున్నాడు.

"యస్. దివాకర్ స్పీకింగ్."

భార్య మాట్లాడుతోందని తెలియగానే అతడి విసుగు మరింత అధికమైంది. తీరికగా కూర్చుని ఫోన్ చేస్తూంటుంది. ఇక్కడ తన పరిస్థితి గమనించదు.

"సారీ ఛాయా ...లంచ్‌కి రావడం కుదరదు "

"అదికాదు మహానుభావా. మరో ముఖ్య విషయం."

"తొందరగా చెప్పాలి."

"మీఅమ్మ, చెల్లాయి, తమ్ముడు వచ్చారు."

దివాకర్ బాంబు పడ్డట్లు వులిక్కిపడ్డాడు.

తనేం పొరపాటు వినలేదు కదా! రెట్టించాడు. తను విన్నది నిజం.

"ఎందుకట!" నిరుత్సాహంగా అడిగాడు.

"మిమ్మల్ని చూడాలనిపించిందేమో!"

ఆమె కంఠంలో హేళన వినిపించింది. దివాకర్ చిరాకు మటుమాయమైంది. దాని స్థానంలో బాధ ఆక్రమించింది. తనవాళ్ళ రాక సంతోషాన్ని కలిగించడం లేదు. అవమానాన్ని రెచ్చగొడుతోంది. వాళ్ళ స్థానం ఎంత అల్ప మైనదో తనకి తెలియనిది కాదు. వాళ్ళు బహిష్కృతులు. తమ మధ్యకి రావడం వికసించిన పువ్వులలో నిన్నటి పువ్వులు కలపడమే.

వాళ్ళనుంచి బయటపడి సరిహద్దు ఏర్పరుచుకుని ఛాయతో బొమ్మరిల్లు నిర్మించుకున్నాడు. వారి యమపపాదాలకి తన అద్దాల మేడ బీటలు తీస్తుంది. వేకువ అసురసంధ్య అవుతుంది.

"వెళ్ళిపొమ్మని చెప్పలేక పోయావా?"

"మనుషులపై మాటలు పనికివస్తాయి."

"నేను వచ్చేసరికి వెళ్ళిపోవాలని చెప్పు."

"అంత సులభంగా కదిలేలా లేరు. హాస్పిటల్‌కి వచ్చారుట."

"డర్టీ హెల్" దివాకర్ ఫోన్ పెట్టేశాడు.

సిగరెట్ వెలిగించి డెస్క్‌మీద కాళ్ళు జాపి బద్ధకంగా కూర్చున్నాడు. చెయ్యవల్సిన పని చాలా వుంది. చెయ్యాలనిపించడం లేదు.

ఫోన్లో విన్న విషయాన్ని మరిచి పనిలో జొరబడదామన్నా వీలులేకుండా వుంది. అంత రంగమంతా ఇటుక బట్టీలు వెలిగించిన పొగలా వ్యాపించింది. తన దగ్గరకి రావద్దని చాలాసార్లు ఉత్తరాలు రాశాడు. సున్నితంగా చెబితే వినే మనుషులు కాదు వాళ్ళు. వాళ్ళ జీవిత విధానం తనకి సరిపడక, నచ్చక ఛేధించుకుని బయట పడ్డాడు. వాళ్ళనికూడా తనలా మారమన్నాడు. కోరాడు, బ్రతిమాలాడు, ప్రార్థించాడు.

వారసత్వాన్ని వదలడానికి వాళ్ళు సుముఖులుకారు. పురోగమనంలోని కొత్తని వాళ్లు హర్షించలేరు. బురదలో దొర్లుతున్నా ఘనంగా కనిపిస్తుంది గతం. తను చేసింది వాళ్ళదృష్టిలో తిరగబాటు.

"పొగర బోత్తనంరా. .." అన్నారు తన యింట్లో వాళ్ళేకాదు, బయట వాళ్ళుకూడా.

డిగ్రీ తీసుకున్నాక, నిరుద్యోగ పర్వాలలో తన జాతిని మేల్కొలుపుదామని కళావంతుల సంస్కరణ సమావేశాలు సభలు ఏర్పాటుచేసి భోగం మేళాలు నిషేధించమని విజ్ఞప్తిచేశాడు.

ఉపన్యాసాలకి మనుషులు మారిపోరని తనకీ తెలుసు. సానుభూతి చూపేవారు తక్కువయినా శ్రమించాడు.

"వీరేశలింగం బయలుదేరాడయ్యా!" హేళన చేశారు.

ఆ మహానుభావుడితో తను సరిపోడు. సూర్యుడి ముందు కొవ్వొత్తిలాంటివాడు. ఆయనే ఎన్నో ఎదురు దెబ్బలు తిన్నాడు. తనెంత?

తమ చుట్టూ పేరుకున్న చీకట్ని పోగొట్టడానికి తను ఉద్యమం లేవదీశాడు. రాత్రికి రాణుల్లా తయారై, రూపాయిలకి శరీరాలని అమ్ముకుంటూ 'మేళాలంటూ' వీధుల్లో బూతు నాట్యాలు చేస్తూ కొవ్వొత్తిలా తొందరగా ఆరిపోయే కళావంతుల కుటుంబాలు. బయట పడాలని పట్టుదలగా ప్రతిఘటించాడు. తన వాళ్ళే తనకి శత్రువులు. బయటివారు శత్రువులు కావడానికి ఎంతేముంది?

ఎన్నో బాధలు కలిగాయి. తిట్టారు. కొట్టారు. వూరినుంచి పంపించెయ్యాలని చూశారు. ఆ ఎదురు దెబ్బలకి తనకీ నైరాశ్యం ముంచుకొచ్చింది. అలాంటి సన్నివేశంలో పార్వతీశం వెన్ను తట్టేవాడు.

"మనం కొండ మీదకిరాయిని ఎక్కిస్తున్నాం దివా! దానికి ఎంతో ఓర్పువుండాలి. సంస్కర్త వెనుకంజ వేస్తే జాతేం బాగుపడుతుంది?"

తన కృషి యింత పెద్ద సమస్యకి సరిపోతుందా? సముద్రంలో చిన్న డింగీమీద పయనిస్తున్నాడు. జలరాశిని దాటుకుంటూ రేవు సమీపిస్తాడా? లేదా కెరటాలు బలిపీఠం ఎక్కిస్తాయా?



పార్వతీశానికి తెల్సిన యస్. ఐ. ఆ ప్రాంతానికి వచ్చాడు. పార్వతీశం, తను ఆయన దర్శనం చేసుకున్నారు.

"తప్పక సాయం చేస్తాను," అన్నాడా యన.

దాంతో తనకి కొండంత ఉత్సాహంవచ్చింది. ఇన్నాళ్ళు పోలీసు శాఖ తనకి అందుబాటులో లేదు. మేళం విషయంలో రిపోర్టు యిచ్చినా అవతలి వైపున మేసి పట్టించుకునేవారు కాదు.

బయట కాలింగ్‌బెల్ మ్రోగడంతో దివాకర్ ఆలోచనలనుండి వీడిపోతూ 'కమిన్' అన్నాడు నిటారుగా కూర్చుని.

సుషమ టైపుచేసిన కాగితాలు డెస్క్‌మీద పెట్టింది. వాటిమీద హడావిడిగా సంతకాలు పెడ్తూ "వెంటనే డిస్పాచ్ చేసెయ్యి" అన్నాడు.

సుషమ వాటిని అందుకుంటూ తలూపింది.

"ఈ ఫైలు రాజశేఖరం గారికియ్యి. ఆయన డ్రాఫ్ట్ చేశాక అన్ని బ్రాంచీలకు నోటీస్ పెయ్యి."

"యస్సార్" సుషమ వెళ్లిపోయింది.

రెండున్నరయింది. భోజనానికి వెళ్ళ బుద్ధి కాలేదు. ప్యూన్‌చేత టిఫిన్ తెప్పించుకున్నాడు. ఆకలి శాంతించింది.

ఆలోచనలు తిరోగమించాయి.

తనుచేస్తున్నదంతా అడవిగాచిన వెన్నెలగా వుండేది. ప్రత్యర్థులదే పై చెయ్యిగావుండేది. "నువ్వెట్రా మమ్మల్ని శాసించేది?"అని మీసం తిప్పేవారు.

అవును మరి వారికి డబ్బుంది. పలుకుబడి వుంది. అంతస్థువుంది. వారిని తను ఢీకొట్టడం ఏనుగమీదకి కుక్క వెళ్ళడమే!

వారసత్వంనుంచి వచ్చిన ఆస్థితో జీవించే బడుద్ధాయిలూ, ప్రజాసేవ ముసుగులో సింహాసనం ఎక్కే ప్రముఖులూ, వ్యాపారంలో రెండు చేతులా సంపాదించే పెద్దలూ, ఇంట్లో వున్నది తగలేసుకునే మధ్య తరగతి వాళ్ళూ చీకటి పడేసరికి తమ పేటలో ప్రత్యక్షం. వాళ్ళ సరదాలకి తను అడ్డుగోడయ్యాడు.

తన కులంవాళ్ళే వారితో చెయ్యి కలిసారు.

మేళాలు జరుగుతున్నప్పుడల్లా తనకి శల్య వేదనగానే వుండేది. ఏమీ చెయ్యలేని అసమర్థత. ఏదో చెయ్యాలన్న తపన. ఈ మేళాల వల్ల తమవారి సంపాదన ఎలావున్నా, కావలసినంత ప్రచారం. 'ఆసాని యిలా వుంటుంది.' 'ఈసాని యిలా వుంటుం'దన్న — ప్రచారం

లభించి వ్యాపారం జరుగుతుంది.

దాన్ని అరికడితే . .

సగం సమస్య తీరుతుంది.

నలుగురిలో శరీరాన్ని అందులోని లావణ్యాన్ని వీలైనంత పచ్చిగా ప్రదర్శితం చేస్తూ, అసహ్యంగా బూతులతో విమర్శింపబడుతూ 'కులవృత్తి' పేరుతో శిథిలమైపోతున్న కళావంతుల కుటుంబాలు ఎప్పుడు బాగుపడతాయి? ఈ దారి రాజమార్గం కాదని తను చెప్పడం గుడ్డివాడికి అద్దమిచ్చినట్లే అయింది.

ఇది తిమిరంతో సమరం. ఒక్క అడుగు ప్రగతి వెయ్యడానికి వేయి అడుగుల పాత సంస్కృతిని దూకి రావాలి.

ఇటువంటి పరిస్థితిలో యిన్స్పెక్టర్ భాస్కరంగారు రావడం కొంచెం ధైర్యమిచ్చింది. పైగా తన స్నేహితులు కొందరు వారి ప్రాంతాలలో వుద్యమం ప్రారంభించారు. వుద్యమం వ్యక్తినుంచి వ్యవస్థకి ప్రాకింది.

మేళంమీద రిపోర్టు యివ్వగానే తన స్క్వాడ్తో భాస్కరంగారువచ్చి వ్రాలేవారు. రైడ్స్ జరగడంతో మేళాలు ఆడేవారికి, ఏర్పాటుచేసేవారికి భయం పట్టుకుంది. దండం దశ గుణం భవత్.

యస్. ఐకి లంచాలు చూపించారు.

భాస్కరంగారు మనిషికాదు. మానవత్వమున్న మనిషి. ఈ ఎరలకి ఆయనలొంగలేదు.

దివాకర్ సత్తా నలుగురికీ తెలిసింది. దారి బంధింపబడటంతో అవతలివారు పిచ్చెక్కిపోయారు. సవాళ్లు విసిరినవారు సంధికివచ్చారు. కులంలోని పెద్దలు, యితరులు తనకీ లంచాలు చూపించారు.

ఎటువంటి బలహీనతలకీ తను లొంగే రకంకాదు. అందరికీ తనమీద కసిగావుంది. ఇంటా బయటా శత్రువులే!

ఒకసారి ఛయిర్మన్గారి దగ్గర్నుంచి కబురు వచ్చింది. ఆహ్వానం తనకి ఆశ్చర్యంగానే వుంది. ఇదో ఎత్తుకాదు కదా!

ఛయిర్మన్ బసవరాజుగారు సాదరంగా ఆహ్వానించారు. కుశల ప్రశ్నలువేశారు. టిఫిన్ కాఫీ తెప్పించారు. తనువద్దన్నాడు.

"కుర్రాళ్లు తినాలోయ్. తీసుకో" ఆయన ముఖమాటం పెట్టారు.

అకారణమైన దయ దేనికి ప్రాతిపదికో?

"ఇంకా వుద్యోగం రాలేదా?"

"లేదండీ నాలాంటి సామాన్యుడ్ని ఎవరు చూస్తారు?"

ఆయన భుజం తట్టారు. "అలా నిరుత్సాహ పడకోయ్ నీలాంటి తెలివైనవాడు ఖాళీగా వుండకూడదు. మన మున్సిపాలిటీలో ఖాళీలు వస్తున్నాయి. అప్లికేషన్ పెట్టు. పోస్టింగ్ యిస్తాను."

బసవరాజుగారు రాజకీయవంశంలో పుట్టాడు. చిన్నప్పటినుంచి పదవులు తెచ్చే రాజకీయాల్లో తిరుగుతున్నాడు. ఉత్తపుణ్యానికి ఆయన సాయం చేసేరకంకాదు. గతంలో తను వుద్యోగం నిమిత్తం రెండుసార్లు సిఫార్సులతో ఆయన దర్శనం చేసుకున్నాడు.

"చూద్దాం అవకాశాలు రానీ!" బుజ్జగించి పంపించాడు.

అవకాశాలు వచ్చినా, అవి తనదాకారాలేదు. తను విసిగి ఆయన దగ్గరకి మరి పోలేదు: ఈనాడు చిటారికొమ్మన వుండే మిఠాయి పొట్లం చేతిలో వుంది.

బసవరాజుగారి ప్రవర్తన సంశయాస్పదంగా వుంది. ఏదోచెప్పాలని తంటాలుపడుతున్నాడు. ఇంకేదయినా వుందా?

"చూడు దివాకర్! యిచ్చి పుచ్చుకోవడం మన సంప్రదాయం. నీకు వుద్యోగం కావాలి. యిస్తాను. మేళాల విషయంలో నీ పట్టుదల సడలించుకో. ఉత్సవాలకి, పెళ్ళిళ్ళకి మేళాలు ఆడటం రివాజే కదా!"

క్లూ తెలిసిపోయింది. స్పష్టంగా తను అనుమానించినదే నిజమైంది. బసవరాజుగారు చేప వుందని తెలిస్తేనే ఎర చూపిస్తారు. వుద్యోగం విషయానికి మరో సందర్భంలో అయితే ఎగిరి గంతేసేవారు. ఉద్యోగం తనకి నేడు ముఖ్యావసరం. తన కాళ్ళమీద నిలబడవచ్చు. ఎవరి దయా అక్కరలేదు.

ఒకవైపు బ్రతుకు తెరువు... మరొకవైపు ఆశయం.

దేన్ని కోరుకోవాలి? దేన్ని విసర్జించాలి? అటా? ఇటా? ఇంత సమరం సాగించి బ్రతుకు తెరువుకి బలిచేయడమా?

"నువ్వు చేస్తున్న కృషి మంచిదే. నీవు వేసిన బీజం ఫలించడానికి చాలాకాలం పడుతుంది. మార్పు అన్నది క్రమంగా రావాలి. ఒక్కసారి రాదు. అందరి కోసం నీ జీవితాన్ని ఖరాబు చేసుకుంటావా? మేళాలు ప్రదర్శించడం ఈనాటిదా? మానేస్తే వారికి మాత్రం మరో దారేముందోయ్!" ఆయన తీయగా నచ్చ చెప్పసాగేరు.

"క్షమించాలి. మేళాల విషయంలో నేను రాజీపడలేను. వాటిని నిషేధించడానికి మీలాంటి నాయకుల అండదండలు ఆశించాను. మేళాలను ఎందుకు ప్రోత్సహించాలి ?వాళ్ళు వేసే తింగర గంతులు కళ అందామా? ఇంతకంటె బాగా వినోదాన్నిచ్చే సంగీత విద్వాంసులు, కూచిపూడి నాట్యకారులు వున్నారు. వాటిని ఏర్పాటు చేస్తే వారికీ, మనకీ లాభం."

తన మాటలు ఆయనకి కోపాన్ని రప్పించాయి. "నిన్ను వుపన్యాసాలు యివ్వడానికి పిలవలేదు. ఉద్యోగం కావాలంటే ."

"మేళం జరుపుకో నివ్వాలి."

"కరెక్ట్. ఏం కావాలో కోరుకో."

"మీకు పనికి వచ్చేలా మాత్రం కోరుకోను."

"నీ ఖర్మ .."

"షరతులతో మీరు చేసే సాయం నా కవసరం లేదు! సెలవ్!" తను విసురుగా బయటకి వచ్చేశాడు.

జరిగింది రాగానే పార్వతీశంతో చెప్పాడు.

"ఇలా నీ అడ్డు తీర్చుకోవాలను కున్నాడు. బాగా చెప్పావ్." పార్వతీశం భుజం తట్టాడు. అతడే ఆ రోజుల్లో కొండంత అండ. ప్రతీ చిన్న విషయానికీ అతడే ఆధారం. తను నిరుత్సాహ పడితే, పార్వతీశం వెన్ను తట్టి నిలబెట్టేవాడు.

గతానికి వర్తమానానికి ఒక నిరంతర పోరాటం జరుగుతూంటుంది. గతం ఒక విజయాన్ని సాధిస్తే ఉద్యమాన్ని పునాదులనుంచీ నిర్మించాలి. వర్తమానం సాధించే విజయం కొత్త వూపిరిపోస్తుంది.

వ్యక్తులయొక్క ఉమ్మడిశక్తి సమాజం. ప్రాతినిధ్యం వహించిన వ్యక్తులతో ఏర్పడిన సమాజం భిన్న భిన్న వర్గాలతో వేర్వేరు అభిరుచులతో వుండి సమిష్టి రూపం అన్నివేళలా అద్దంలోని ప్రతిబింబంలా స్పష్టంగా కనిపించదు. సంఘం వ్యక్తిని వేటాడుతుంది. వ్యక్తి సమాజాన్ని వుపయోగించుకుంటూనే బానిసగా లొంగ దీసుకోవాలని ఆత్రపడతాడు.

తను సాగించే సమరం స్వల్పమైనది కాదు.

---

(వి) చిత్ర విజ్ఞానం



టోక్యో యూనివర్సిటీలోని డాక్టర్ టోమోసో బ్యూరోఒగాటా నలభై యేళ్ళుగా హార్మోనుల మీద పరిశోధనలు చేశారు. ముద్దు పెట్టుకుంటున్నప్పుడు నోటిలో లాలాజలంలో ఒక హార్మోను కలుస్తుందట. ఈ హార్మోను దేహాన్ని శక్తివంతంగానూ, ఆరోగ్యవంతంగానూ వుంచడమే గాకుండా, ముసలితనం వెంటనేరాకుండా కాపాడుతుందట! అందువల్ల ముద్దులో యౌవనాన్ని కాపాడే మహత్య ముందంటున్నారు ఒగాటా. కొందరికి పదేపదే ఉమ్మివేసే అలవాటుంది. వీరు లాలాజలాన్ని వృధాచేస్తూ దానిలోని హార్మోనులను పోగొట్టుకుంటారు. ఇలాంటి వాళ్ళకి 45 ఏండ్లకే ముసలితనం ప్రాప్తిస్తుందని కూడా అంటున్నారు డాక్టర్ ఒగాటా!!

ఒక అరణ్యాన్ని నరికి సాగు చెయ్యాలంటే ఎంత శ్రమపడాలో దానికి రెట్టింపు పడాలి.

పార్వతీశం జబ్బుపడటం, యిన్‌స్పెక్టరు మారిపోవడంతో తన సమస్య మొదటికి వచ్చింది. కొత్త యస్. ఐ. రూపాయల మనిషి.

తిరిగి మేళాలు ప్రారంభమైనాయి. తనకి ఏడుపు ముంచుకొచ్చింది. ఆ రోజు ఎలా గయినా ఆపాలని మేళాలకి బళ్ళు బయలు దేరుతూంటే రోడ్డుకి అడ్డంగా పడుకున్నాడు.

"నా మీదనుంచి వెళ్ళండి."

మైనర్ రాజు అక్కడే వున్నాడు.

"అంత పనీ జరుగుతుందిరా వెధవా . లే " అంటూ బూటుతో గుండెల మీద తన్నాడు.

తను తిరగబడటంతో అతడి మనుషులు కర్రలతో మీద పడ్డారు. తనకి తెలివి వచ్చేసరికి గాయాలతో రామాలయం అరుగు మీద వున్నాడు.

ఎవరూ తనకోసం రాలేదు.

గాయాల బాధ! శీతకాలం చలి. రెండ్రోజుల పాటు అక్కడే నరకాన్ని చూశాడు.

ఇది ప్రగతియిచ్చిన ప్రతిఫలం. సంస్కరణ యిచ్చిన బహుమతి. ఎవరికోసం తను శిధిలమై పోతున్నాడో, వారే తరిమి తరిమి కొడు తున్నారు.

ఎడారిలో ఏరువాక కోసం తపన.

శాంతికోసం అశాంతితో పోరాటమిది.

యుగ యుగాలకీ తీరని ఆరాటమిది.

భాస్కరంగారు వచ్చారని తెల్సి ఓపిక చేసుకుని వెళ్ళాడు. తనని చూసి ఎంతో యిదయ్యాడాయన.

"ఎవరో చెప్పు దివా? క్రిమినల్ కేసు ఫైలు చేస్తా."

"ఏం వద్దు సార్! నన్నీ నరకంనుంచి బయటకి తీసుకుపొండి. మీ దగ్గర నౌకరుగా నయినా వుంటాను." ఆయన పాదాల మీద పడ్డాడు.

భాస్కరంగారు ఓదార్చి తనతో తీసుకు వెళ్ళారు. ఒక ప్రయివేటు నర్సింగ్ హోంలో చేర్పించారు. నెల రోజుల్లో మామూలు మని షయ్యాడు.

ఉద్యోగ ప్రయత్నం కూడ ఆయనే చేశారు. రెండువేలు ఖర్చుపెట్టి ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం యిప్పించాడు.

జీవితం మలుపు తిరిగింది. పాత వాతావరణం, ఆ మనుషులని మరచిపోయే ప్రయత్నం చేశాడు. పరాజయంతో పలాయనం చెయ్యడం అప్పుడప్పుడు తనకి గుర్తు వస్తున్నా . . కుక్క తోకని సరి చెయ్యడం ఎవరితరం?

ఆపదలు స్వీకరిస్తూ అందరి బాగుకోసం ఏడ్చేకంటె, తనబాగుచూసుకోవడమేన్యాయం. అదే చేశాడు.

ఈనాడు మానేజర్ అయ్యాడు.

గడియారం అయిదు కొట్టింది.

దివాకర్ లేచాడు.

## 2

దివాకర్‌కి యింటికి వెళ్లాలనిపించలేదు. కారుని నేరుగా బీచ్‌కి పోనిచ్చాడు.

జనానికి దూరంగా కెరటాలకి దగ్గరగా కూర్చున్నాడు. సాయంత్రం చల్లగానేవుంది. అతడి మనసు మాత్రం వేడిగా వుంది.

తన వాళ్ళని ఎలా వదిలించుకోవాలో ఆలోచిస్తున్నాడు. ఛీ సిగ్గులేని మనుషులు? ఎవరు పిలిచారని వచ్చారు? తనకీ వారికీ మధ్య ఏ సంబంధంలేదు.

ఛాయ ఏమనుకుంటోందో? వాళ్ళని బట్టి తననికూడ అల్పంగా చూస్తుందా?. అది తను భరించలేదు.

రెండేళ్ళ క్రితం తను స్టెనోగా తన ఆఫీసుకి వచ్చింది. వేళా విశేషం వల్ల తమ మధ్య పరిచయం ప్రేమకి దారితీసింది.

"పెళ్లి చేసుకుందాం... " అంది.

అది తనకి యిష్టమే కాని భయపడ్డాడు. కులాంతర వివాహం. తన వైపునుంచి ప్రతిఘటన లేకపోయినా, ఆమె తరపు వాళ్ళు అంగీకరిస్తారా?

"మా నాన్నగార్కి కులాభిమానం వుంది.




బ్రాహ్మణులలోనే మంచి సంబంధం తెచ్చి చెయ్యాలని గత నాలుగేళ్ళుగా ప్రయత్నిస్తున్నారు. కట్నాలు వేలమీద ఆయన యివ్వలేరు. ఇంతలో రిటైరయ్యారు. ఆయన సంపాదించినది అక్కయ్య పెళ్ళి అప్పులు తీర్చడానికి సరిపోయింది. నాపెళ్ళి గురించి ఆయన దిగులు పడుతున్నారు. ఈ పరిస్థితులలో మన పెళ్ళికి ఆయన అభ్యంతర పెట్టరు." అన్నది తను.

ఆమె అన్నది నిజం. సదాశివంగారు రాజీ పడినట్లు కనిపించినా, ఎంతో వుత్సాహంగా మా పెళ్లి జరిపించారు.

ఏకాకిగా కుమిలిపోతున్న వేళలో ఛాయ స్నేహం కొండంత బలమిచ్చింది. సుఖానుభూతి స్వప్నాలు అనుభవంలోకి వచ్చాయి. ప్రభాతం వుందని తెలిస్తే అంధకారాన్నీ, తిరిగి కలుసుకోవడముంటే వియోగాన్నీ భరించవచ్చు. కుటుంబం, దాని చల్లని నీడ, ఛాయ అనురాగం రోజులని క్షణాల్లో పెడుతున్నాయి. అమృతం కురుస్తున్న వేళలో హాలాహలంలా, వంట మీదవున్న వరిచేనుపై పడే మిడతల దండులా వీళ్ళు వచ్చి పడ్డారు.

ఎనిమిదిన్నరకి దివాకర్ యింటికి వచ్చాడు. ఛాయ కారిడార్‌లో పాపని ఆడిస్తూ కనిపించింది. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. 'వాళ్ళు వెళ్ళిపోయారేమో' అనుకుంటూ ఆమె ప్రక్కగా సోఫాలో కూర్చున్నాడు.

"మీకోసం రెండుసార్లు ఫోన్ చేశాను."

దివాకర్ తలూపాడు.

"అలావున్నారేం?" ఛాయ అనుమానంగా అడిగింది.

ఆమెలో ఏదయినా మార్పు కనిపిస్తుందేమోనని పరీక్షగా చూశాడు. ఆశించినది కనిపించలేదు.

"అన్నం వడ్డించెయ్."

ఛాయ పాపనితీసుకుని లోపలకి వెళ్లిపోయింది. దివాకర్ ఒక్కనిముషం సోఫాలో అటు ఇటు తిరిగి లేచాడు. పోలయ్య గారేజ్ తాళాలు తెచ్చి యిచ్చాడు.

"ఔట్ హవుస్ దగ్గిర వాట లెవరు?"

"బంధువులు "

దివాకర్‌కి అర్థమైంది. చిరాగ్గా లోపలికి నడిచాడు. స్నానం చెయ్యాలనిపించలేదు. లుంగీ చుట్టుకుని భోజనానికి కూర్చున్నాడు.

"మిమ్మల్ని కలుసుకుని కాని వెళ్ళరట!" వడ్డిస్తూ చెప్పింది.

"డబ్బుకోసం వచ్చారేమో. పడేసి పొమ్మన లేకపోయావా?"

"ఆమాట మీరు చెప్పాలి."

దివాకర్ వేగిరం భోజనం పూర్తిచేసి, పాన్ నములుతూ హాల్లో కూర్చున్నాడు. "ఛీ దరిద్రులు వచ్చిపడి మనశ్శాంతి లేకుండా చేశారు."

జీవితం ఎంత తియ్యగా కనిపిస్తుందో అప్పు డప్పుడు రెట్టింపు చేదుగాకూడ కనిపిస్తుంది. సుఖదుఃఖాల మధ్య సమాన నిష్పత్తి ఎప్పుడూ వుండదు. పీడనం ఎక్కువయితే తులాదండం వంగుతుంది. దూరంగా కనిపించే ఇంద్ర ధనస్సుపై మమకారం రేగుతుంది.

"దివా?"

పిలుపుకి తల ఎత్తాడు. తనతల్లి. రంగా జమ్మ. యాభైకే మనిషి వంగిపోయింది. లావణ్యం మాసిపోయి, వయసు యింకిపోయి పాదున మాడిపోయిన ఆనపకాయలావుంది. తనతల్లి అని భావించడానికి సిగ్గువేసింది.

"ఎందుకొచ్చావ్?" కరకుగా అడిగాడు.

రంగాజమ్మ నిలబడలేక, కుర్చీపై కూర్చో డానికి భయపడి, నేలమీద చతికిలపడింది. "ఎక్కడున్నావో మాకో వుత్తరం ముక్క రాస్తే యేంరా? ఏమైపోయావోనని హడిలి పోయాం."

"ఎందుకు రాయాలి మీకు?"

రంగాజమ్మ ఖిన్నురాలైంది. "ఆరోజు దెబ్బలతో నిన్ను యింటికి తీసుకువద్దామను కున్నాము. కులంవాళ్ళు వెలివేస్తారని భయ పెట్టారు. భాస్కరంగారితో వెళ్ళావని తెలిసి వూపిరి పీల్చుకున్నాం."

దివాకర్ ఆసంజాయిషీ నమ్మలేదు. "మీరు పిలవలేదని నేనేం ఏడవలేదు. మీరు యిక్క డికి ఏ ధైర్యంతో వచ్చారో అర్థం కావడం లేదు. నేను పెళ్ళిచేసుకున్నాను. గౌరవంగా బ్రతుకుతున్నాను. శరీరాన్ని అమ్ముకు బ్రతికే వాళ్లు యిక్కడికి రాకూడదు. మీకెలాగూ లేదు పరువు, నాదికూడ పాడుచెయ్యకండి."

కొడుకు నిర్మోగమాటానికి రంగాజమ్మ విస్తుపోయింది. బాధపడింది. 'మారిపోయాడు' అనుకుంది. దూరంగా వంటింట్లోంచి ఛాయ కనిపిస్తోంది. 'ఈ మహాతల్లి దయ' అనుకుంది. వ్యథగా. ఎదిగిన కొడుకుని ఏమంటుంది? "మేం నీకేం కాకపోవచ్చు. కాని నువ్వుమాకు అన్నీ. సరోజకి కడుపు నెప్పి పట్టుకుంది. డాక్టర్లు ఆప్రేషను చెయ్యాలన్నారు. మమ్మల్ని కాపాడవల్సింది నువ్వే."

దివాకర్ మరో సిగరెట్ వెలిగించాడు.

"రెండు నెలలనుంచి ఘోరమైన యిబ్బం దులు పడుతున్నాం. ఉన్న సొమ్ము దాని వైద్యానికి సరిపోయింది. అది సంపాదించక పోతే సంసారం ఎలా నడుస్తుంది? ప్రకాశం ఏ పనికీ ఆసరాకాడు. వాళ్ళనీ వీళ్ళనీ పట్టుకుని చిన్న వుద్యోగం వేయిస్తే ఆఫీసు సొమ్ము వాడేసి పీకలమీదకి తెచ్చాడు. ఇదంతా నా ప్రాణానికి వచ్చింది."

దివాకర్ వికటంగా నవ్వాడు. "మీరు డబ్బు మనుషులు. రోగాలతో పుచ్చిపోయిన వెధవ వచ్చి డబ్బు విసరగానే వళ్ళు అప్ప గిస్తారు. డబ్బు! డబ్బు! చేసుకున్నందుకు అనుభవించాలి.!"

కన్నెరికంనుంచి ఎన్నో ఒడిదుడుకులు చూసింది రంగాజమ్మ. వేటికీ ఆమె చలించి పోలేదు. ఈనాడు ఎదిగిన కొడుకు అప హాస్యం చేస్తూంటే కన్నీళ్ళువచ్చాయి. ఎందు కొచ్చిన బ్రతుకనిపించింది. ఇంకేం మాట్లాడినా వ్యర్థమే అనిపించింది.

"నువ్వు కొండమీద వున్నావు. మేం కోనల్లో వున్నాం. నీ కళ్ళకి పురుగుల్లా కని పిస్తాం. మేం నలుగురిచేత చివాట్లుతినే వాళ్ళమే బాబూ."

వెక్కి వెక్కి ఏడుస్తూ వెళ్ళిపోయింది.

దివాకర్ విస్తుపోయాడు. ఆ రాత్రి నిద్ర కూడ కరువైంది. పెంచుకున్న అంతస్థు తరిమి వేస్తోంది. మానవత్వం ఆదరించ మంటోంది.

తెల్లవారింది మామూలుగా. పాప కబుర్లు వింటూ వరండాలో కాఫీ త్రాగుతున్నాడు.

"అన్నయ్యా" అంటూ ప్రకాశం వచ్చాడు.

"ఏం?" కళ్లెగరేస్తూ చూశాడు.

ప్రకాశం బాగా ఎదిగాడు. హిప్పీలా జుట్టు పెంచాడు. మాసిపోయిన నీలం లుంగిమీద ఎర్ర పువ్వుల చొక్కా వేసుకున్నాడు. కొత్త వాతావరణంలోని బెరుకు ముఖంలో కని పిస్తోంది.

"అమ్మ వెళ్లిపోదామంటోంది?"

"డబ్బు కావాలా?"

ప్రకాశం తలూపాడు.

"బ్యాంకు తెరవనీ. .యింట్లో వుందను కున్నావా?" గర్జిస్తూ చెప్పాడు.

ప్రకాశం భయంగా నించున్నాడు. చిన్న ప్పటినుంచి ఎరిగిన అన్నయ్య కాదనిపించింది.

దివాకర్ వెలిగించుకునే సిగరెట్ క్రింద పడింది. ప్రకాశం తీసి అందించాడు. "క్రింద పడ్డ సిగరెట్ కాలుస్తానా? వుంచుకో... 555 సిగరెట్ నీ ముఖం ఎప్పుడూ కాల్చివుండదు." గర్వంగా అన్నాడు.

"నాన్నాలూ . ఎవలూ " పాప అడుగు తోంది.

ప్రకాశం దృష్టి పాపమీద పడింది. వేకువ లోని మందారంలా స్వచ్ఛంగావుంది ఆ పిల్ల.

అన్నయ్య ఏం చెబుతాడాని ప్రకాశం ఆశగా ఎదురుచూస్తున్నాడు. 'బాబాయి' అని తనే చెబుదామనుకుని, భయంతో ఆగిపోయాడు.

దివాకర్ పాపకేసి రుషగా చూశాడు. పాప కళ్ళు ఆడించింది. 'నీకెందుకురా?' అన్నట్లు చిరాగ్గా చూశాడు. ఇది ఎవరయినా తనకోసం వచ్చే సమయం. వీడ్ని గురించి అడిగితే తన కెంత తలవంపు?

దివాకర్ తమ్ముడ్ని తనని పరీక్షగా చూసు కున్నాడు. తన వైభవం చూసి వాడికి కళ్ళు కుడుతున్నాయి. ఈ దశకి రావడం వీడి తరం కాదు. వాడున్న పరిస్థితులు పగ్గాలువేసి మరింత క్రిందకి లాగుతాయి. బ్రోకర్‌గా మనుషుల్ని తీసుకువస్తూ, రెండు వైపులా కమీషన్ తీసు కుని జూదాలు ఆడుతుంటూ మరింత పతన మవుతాడు.

"పోరా. . .ఇడియట్. . రాగానే పంపిస్తా" గట్టిగా కసురుకున్నాడు.

ప్రకాశం ముఖం నల్లగా మాడిపోయింది. దిగాలుగా బోట్ హవుస్‌కి వచ్చాడు. రంగా జమ్మ గుమ్మాలమీద కూర్చుంది. "ఏమైం దిరా?" అనడిగింది. ప్రకాశం మాట్లాడలేదు. లోపలికెళ్ళి బెడ్డింగ్ మీద కూర్చున్నాడు.

"వాడికెంత పొగరుగా వుంది. మనం వెధ వల క్రింద కనిపిస్తున్నాం. వాడికి కళ్ళునెత్తి మీద వున్నాయి. ఆయన పంపించే దాకా ఆగాలట."

"అవసరం మనది బాబూ" రంగాజమ్మ ఓదార్పుగా అంది.

క్రమంగా ఎండవచ్చింది. పొగమంచు కరిగి పోతున్నది. చెట్లమీదనుంచి ముత్యాల్లా రాలు తున్నాయి మంచు బిందువులు. ప్రక్కగానున్న బూరదకాల్వపైనుంచి దోమలు జుమ్మంటూ ఎగురుతున్నాయి.

"సరోజా . లే పొద్దెక్కింది." రంగా జమ్మ తట్టిలేపింది.

సరోజ బద్ధకంగా లేచి కూర్చుంది. "అప్పుడే తెల్లారిందే ."

"ఆ ..లేచి బట్టలు సర్దు పోదాం "

---

(వి) చిత్ర విజ్ఞానం





ఇది అరబ్ అక్షరాలతో లిఖించబడిన వాక్యం. దీని అర్థం "సర్వాంతర్యామి, సకలశక్తి సంపన్నుడైన భగవంతుడి ముందు ఏ శక్తీ ఏ బలమూ ఆగదు" అని. ఈ వాక్యంలో నాలుగు మీనారు లతో కూడుకొన్న ఒక మసీదు దాగివుంది! అక్షరాలను అర్థవంత మైన వాక్యాలుగా పొందుపరచి వాటిని వస్తురూపంలో వ్రాయడాన్ని "కాల్లిగ్రఫీ" అంటారు!

సరోజ దగ్గర చురుకులేదు. తల్లి పోరు పెడుతున్నా ఆమె తెమిలేసరికి తొమ్మిదిన్న రయింది. అప్పటిదాకా కాఫీ పడకపోవడం ఆమెకి పిచ్చెక్కినట్లుంది.

"కాఫీ తెచ్చి పెట్రా ప్రకాశీ."

రంగాజమ్మ, ప్రకాశం డబ్బుకోసం ఎదురు చూస్తూ కూర్చున్నారు. వాస్తవానికి వాళ్ళూ కాఫీ తాగలేదు. జరిగిన అవమానం యిద్దర్నీ కలచి వేస్తోంది.

"ఎవడు తెస్తాడే నీ మొగుడు? ఒక్కపూట త్రాగకపోతే కొంపలంటుకోవులే! ఏకంగా వెళ్లేటప్పుడు బజార్లో త్రాగుదాం " రంగా జమ్మ మందలించింది.

సరోజకి యిక ఆగడం దుర్భరంగాతోచింది. వానిటీ బ్యాగ్‌లోనుంచి చవక రకం సెంటు తీసి పూసుకుని "ఓసారి వదినగార్ని చూసివస్తాను." అని చెప్పులేసుకుంది.

"ఎందుకు వెధవ తిరగడం—ఆ మహారాణి నిన్ను పల్కరిస్తుందీ చివాట్లు లేవనా వెళ్ళడం? కావల్సిన వాడికేలేదు—దాని కుంటుందా?"

తల్లిని లెక్కచెయ్యలేదు సరోజ. బంగళా లోకి వచ్చింది. హాల్లో ఎవరూ కనిపించలేదు. రేడియోలో సినిమా పాటలు వస్తున్నాయి.

"వదినగారూ!" బిగ్గరగా రెండు మూడు సార్లు పిలిచింది.

ఛాయ వంటింట్లో వుంది. లోపలకి వస్తున్న సరోజని చికాకుగా చూసింది. అలా చొరవగా ఆమె రావడం యిష్టంలేదు. 'రావద్దు' అని చెప్పలేకపోయింది. స్టూలుతెచ్చి గుమ్మంలో వేసింది నవ్వుతూ.

"మీ యింటికి వచ్చినందుకు వుపవాసాలు చేయిస్తారా ఏమిటీ? కాఫీ పడకపోతే నాకు మతిపోతుంది. అప్పుడే మీరు రెండు మను షల క్రింద కనిపిస్తున్నారు."

సరోజ మాటలకి ఛాయ నవ్వింది. అతిథి ధర్మం మరచిపోయినందుకు నొచ్చుకుంది. గ్యాస్‌మీద కాఫీ నీళ్ళు పడేసింది.

"ఇల్లు బాగుందండి వదినగారూ అద్దిదా? కొన్నారా? అన్నట్లు పాప ఏది? అన్నయ్యా ఆఫీసుకి వెళ్ళిపోయాడేమిటి?" తన ధోరణిలో మాట్లాడేస్తోంది ఆమె.

కొత్తలేకుండా గలగలా మాట్లాడే సరోజ ముందు బెట్టు చేయలేకపోయింది ఛాయ. ఆత్మీయం లేకపోయినా స్నేహంగా మాట్లా డింది.

కాఫీయిస్తూ "వాళ్ళకికూడ యివ్వు" అంది.

"భలేవారే వదినగారూ.. మిమ్మల్ని వదలి వెళ్ళాలనిలేదు. వాళ్ళు కాఫీ ప్రాణులేం కాదు లెండి."

ఛాయకి ఆమె బోళా మనిషిలా కనిపిం చింది. గులాబీ రంగు షిఫాన్ చీరలో అతిగా చేసుకున్న అలంకరణలో సరోజ అందంగా కనిపిస్తోంది.

"అన్నయ్యకి మామీద కోపం ఎందుకు చెప్పండి. మమ్మల్ని కాస్తచూస్తే ఏం పోయింది? గోదావరిలో ఓ బిందెడు నీళ్ళు తీసు కుంటే నష్టమా నదికి?"

బురదలో పడిపోయిన విలువైన వస్తువుగా కనిపించింది సరోజ. ఛాయ బెట్టుతనం మాని కుశల ప్రశ్నలు వేసింది.

"మీరు అదృష్టవంతులు వదినగారూ! దేనికీ లోటులేదు. నవ్వులు కురిపించే పాపవుంది. ఆపిల్లే కొండంత వెలుగు. నాలుగేళ్ళనుంచి బిడ్డలకోసం ఆరాటపడుతున్నాను. ప్రతిసారీ అబార్షనే. మా బ్రతుకుల్లో నాది అని చెప్పుకో డానికి ఏమీ వుండదు వదినగారూ!"

ఛాయ సానుభూతిగా చూసింది.

"అందాన్ని కరిగించుకొని కోట్లు సంపా దించినా మాలోచి వరికేం మిగలదు వదినగారూ! సంపాదన అందం వున్నదాకే. తర్వాత రాబడి వుండదు. వెనుకటి ఆడంబరాలు మాత్రం పోవు. సంపాదించినది వాటికి తగలేస్తాం."

"నీకయినా మీవాళ్ళు పెళ్లిచెయ్యవలసింది సరోజా!"

"ముందర మాఅమ్మ అనుకుంది.కానీ.. "

"ఏం?"

"అన్నయ్య చదువుకోసం ఆగిపోయింది.

## (వి) చిత్ర విజ్ఞానం



ఇది నాసా (NASA) నిర్మించిన అంగారక శకటం! ఈ బండి ఒక్క నీటి మీదతప్ప, మరెటువంటి ప్రదేశం మీదయినా అతి సునాయాసంగా "నడవ" గలుగుతుంది! బ్యాట్రీ విద్యుచ్ఛక్తితో యీ బండిని నడపడం అతిసులభం కూడా. ఎడ్వర్డ్ రైన్ విక్కి అనే వ్యోమ శాస్త్రజ్ఞుడు ఈ బండిని నిర్మించాడు!

---

నాకు పెళ్ళిచేస్తే సంసారమెలా గడుస్తుంది?"

ఛాయ హీనస్వరంతో అడిగింది. "యిది మీ అన్నయ్య కిష్టమా?"

"ఏం చేస్తాడు? చదువు ఆగిపోతుందని భయపడి వుంటాడు."

ఛాయకి రంగులరాట్నం తిరుగుతున్నట్లు వుంది. శరీరం కంపించింది. వారిద్వారా పైకి వచ్చి వాళ్ళనే తప్పుపడుతున్నాడు. వాళ్ళు . ఆ చరిత్రహీనులు. ..తనకి రాజమార్గంవేశారు. హారతిపట్టారు.

సరోజ మాట్లాడుతున్నా ఛాయ పరాకుగా వుంది. సరోజ ఆపి యిక లేచింది. "వస్తాను వదినగారూ" ఛాయ లోపలికి వెళ్ళింది. తను పండగకి కొన్న కొత్తచీర, భర్త పంపిన వెయ్యికి తన దగ్గరున్న వెయ్యి కలిపి సరోజ కిచ్చింది.

"అవసరమైతే రాయి సరోజా! పంపిస్తాను. "కడుపునొప్పి పెద్ద జబ్బుకాదు. మంచిమందులు వాడితే సరి!"

వదినగారి వాత్సల్యానికి ఆమె కరిగి పోయింది. పాదాభివందనం చేసింది.

"లే ఈ కాస్తదానికేనా? . ఉత్తరం రాయండి వెళ్ళగానే." వీధిగుమ్మం దాకా వచ్చి సాగనంపింది వదిన-ఆడబిడ్డను.

సరోజకి పువ్వుల బాటపై నడుస్తున్నట్లే వుంది. బొట్‌హౌస్ కొంచెం దూరమైనా ఆమెకి ఎంతో భారంగా కనిపించింది. తను సాధించిన విజయపరంపర తన వాళ్ళతో చెప్పాలి.

ఇన్నాళ్ళు తాము 'వదిన్ని' శత్రువుగా అంచనా వేసుకున్నారు. అన్నయ్యకు రాసిన వుత్తరాలకు జవాబు రాకపోవటానికి 'వదినే' కారణమనితూర్పార పట్టారు. తిట్టారు. సరోజకి తగని సిగ్గుగావుంది. తామే దుర్మార్గులుగా కనిపించారు. 'వదిన' అన్నయ్యకంటే ఎంతో మంచిది.

"ఎక్కడ చచ్చావే ముండా. . "రంగాజమ్మ దూర్నాన్నుంచే కూతుర్ని తిట్టింది. కొడుకు డబ్బు పంపకపోవటం ఆమెకి పిచ్చిగావుంది.

ప్రకాశం గణాచారిలా గంతేశాడు. "ఎవడి దగ్గర పడుకున్నావే ముండా? ఇంతసేపు ఏం చేస్తున్నావక్కడ?"

సరోజ రెండువేలు తల్లికిచ్చింది. అంత డబ్బు చూడగానే రంగాజమ్మకి గుక్కతిరగ లేదు. దివాకర్ రెండువందలో, మూడొందలో సాయం చేస్తాడనుకుంది! కొడుకుమీద ప్రేమ వుప్పొంగింది.

"మాటల్లో కరుస్తాడు కానీ వెన్నమనసు పిచ్చితండ్రిది."

"చాల్లే అన్నయ్య కనిపించలేదు. వదినే యిచ్చింది. ఇంకా కావలిస్తే రాయమంది. నాకు చీర, బొట్టు యిచ్చింది." సరోజ గర్వంగా చెప్పింది.

ప్రకాశం, రంగాజమ్మ ముఖాలు చూసు

కున్నారు.

సరోజ వదిన్ని స్తోత్రం చేస్తూనేవుంది.

డబ్బు! ప్రాణంలేకపోయినా ప్రాణమిస్తుంది. వ్యక్తులమధ్య ఆకర్షణరేపే అయస్కాంతం!

"ఆవిడకయినా మనమీదకి దయవచ్చింది." రంగాజమ్మ వితర్కించుకుంటూ అంది.

ఒకమంచి భావం పెంచుకుని వాళ్ళు కదలి వెళ్ళారు.

# 3

ఛాయకి భోజనం చెయ్యాలనిపించలేదు. పాపకి తినిపించి మంచంమీద వాలిపోయింది. మనస్సునుంచి ఆవిరులు వస్తున్నాయి. చెడ్డ వారు మంచిపని చేస్తే హర్షిస్తారు. మంచివారు చెడ్డపనిచేస్తే ఖిన్నులవుతారు. ఛాయ అదే అవస్థలోవుంది. భర్తయొక్క గతాన్ని అతని నోటినుంచే విన్నది. అతడి ఆవేదన గుర్తించింది. తమ కులంవారికోసం చేసిన నిర్మాణాత్మక కార్యక్రమాలు విని హర్షించింది. మరి అదంతా బొమ్మ. నేడు సరోజద్వారా బొరుసు తెలిసింది. భర్త చేసింది, సరోజ చేసిన త్యాగంలో ఎన్నోవంతు? తన జీవితాన్ని కాల్చుకుని తన అన్న జీవితాన్ని వుద్ధరించింది. భర్త దగాకోరులా కనిపించాడు.

గడియారం రెండుకొట్టింది. దివాకర్‌కి లంచ్ టైం. ఇంటికి వస్తాడు. భర్తనిచూడ బుద్ధికాలేదు. పాపనిలేపి బయటకి వచ్చింది. పోలయ్య పోర్టికోలో కునికిపాట్లు పడుతున్నాడు. ఛాయనుచూసి లేచాడు. "నేను బయటికి వెళుతున్నాను."

సిటీబస్‌లకోసం వెయిట్ చెయ్యడం అవస్థగానేవుంది. టి. నగర్ వెళ్ళి వచ్చేసరికి ఏడు అయింది. దివాకర్ ఇంటికి రాలేదు.

"మిమ్మల్ని అడిగారండి అయ్యగారు మధ్యాహ్నం" పోలయ్య చెప్పాడు.

"సర్లే!"

కాఫీ తాగుతుండగా ఆటో ఆగింది. ఛాయ తొంగిచూసింది. సదాశివం లోపలికి వస్తున్నాడు. తండ్రిని చూడగానే ఆమె దిగులు కాస్తతగ్గింది. నవ్వుతూ ఎదురు వెళ్ళింది.

"ఉత్తరం రాస్తే స్టేషన్‌కి వచ్చేదాన్నికదా నాన్నగారూ!"

"ఎందుకమ్మా" అంటూ మనవరాల్ని అందుకున్నారు.

రాత్రి భోజనాలదగ్గర సదాశివం తను వచ్చిన పని అల్లుడితోనూ, కూతురుతోనూ చెప్పాడు.

"సంక్రాంతి వస్తోంది కదమ్మా. బొంబాయి నుంచి అక్కా, బావ వస్తున్నారు. మీరుఒక్క పండక్కీ రాలేదు. ఈసారి తప్పదు."

"దానికి మీరు శ్రమపడి రావాలా? ఉత్తరం రాస్తే సరిపోదూ!" దివాకర్ నొచ్చుకున్నాడు.

ఆ సంస్కారం వెనుక ఛాయకి కృత్రిమం కనిపించింది. ఇదివరకు భర్తని వదలి వెళ్ళాలనిపించేదికాదు. ఇప్పుడు పారిపోవాలని అనిపిస్తోంది.

"రేపుదయం బయల్దేరుదాం నాన్నగారూ!"

దివాకర్ భార్యకేసి విస్మయంగా చూసి, "రెండ్రోజులాగి వెళదాం! నించున్న పాటున సెలవు దొరుకుతుందా?" అన్నాడు.

"పీలుంటే వస్తాం నాన్నగారూ," అంది ఛాయ ముఖం మాడ్చుకుని.

పొద్దుపోయేదాకా తండ్రితో మాట్లాడుతూ కూర్చుంది. దివాకర్ రమ్మంటూ దగ్గుతున్నాడు. ఛాయ లెక్కపెట్టలేదు. సదాశివం అది గమనించి "పొద్దు పోయింది. పడుకోమ్మా" అన్నాడు.

ఛాయ గదిలోకి వచ్చింది. దివాకర్ నిద్ర నటిస్తున్నాడు. తన మంచం దూరంగా జరుపుకుని పడుకుంది.

"విశేషముంది" అనిపించింది దివాకర్‌కి. నెమ్మదిగా లేచాడు. ఛాయ గోడవైపుకి తిరిగి పడుకుంది. పాపని తన మంచంమీద పడుకోబెట్టి ఛాయపక్క పడుకున్నాడు. కాలితో కితకితలు పెట్టాడు.

"బాగుంది మేళం.నాకు వంట్లో బాగాలేదు." అంది మరింత ముడుచుకుని దూరంగా జరుగుతూ.

"మనసు బాగాలేదని నాకూ తెల్సింది. ఏం జరిగింది?"

ఛాయ మాట్లాడలేదు.

"ప్రయాణంవద్దన్నానని కోపమా? పోనీ రేపు నువ్వు మీ నాన్నగారితో వెళ్ళు. నేను తర్వాత వస్తాను" ఆమెను దగ్గరగా లాక్కున్నాడు.

ఛాయకి అతని స్పర్శ మంటగావుంది. లేచి వెళ్ళి ఎదురుగావున్న మంచంపై పడుకుంది.

ఛాయ మర్నాడు తండ్రితో ప్రయాణమైంది.

ఇంటికి వచ్చినా ఛాయకి మనశ్శాంతి లేదు. పండగ వాతావరణంలో ఏమాత్రం వుత్సాహం చూపించలేకపోయింది.

"రావే ముగ్గులు పెడదాం!" సరస్వతి చెల్లాయిని పిలిచింది.

"నువ్వు పెట్టేయి అక్కా! నేను అన్నీ మరచిపోయాను." ఛాయకి నిరుత్సాహంగా వుంది.

సరస్వతి నిర్ఘాంతపోయింది. "బాగుందే, బొంబాయిలోవున్న నాకు జ్ఞాపకం వున్నాయి. నువ్వు మరచిపోయావా?.. లే. లే"

సరస్వతి పెరట్లోకి లాక్కెళ్ళింది. ఛాయ అయిష్టంగా ముగ్గుబుట్ట అందుకుంది. వీధంతా సంక్రాంతి సంబరంలో వుంది. తుడిచేవారూ, నీళ్ళుచల్లేవారూ, ముగ్గులుపెట్టేవారూ! ఛాయ దీర్ఘంగా ఆలోచిస్తూనే ముగ్గుపెడుతోంది.

సరస్వతి దగ్గరకొచ్చింది. "అరగంటయినా నీ ముగ్గు తెమలలేదేమిటే ఛాయా. అవతల అమ్మ పేరంటానికి పిలుస్తోంది."

"అయిపోయిందక్కా."

"అలా వున్నావేం? ఒంట్లో బాగాలేదా?"

"భలేదానివే. నిక్షేపంగా వున్నాను." జీవంలేకుండా నవ్వింది ఛాయ.

"వచ్చినప్పటినుంచి చూస్తున్నాను. చాలా డల్‌గా వున్నావు. దివాకర్ యెందుకురాలేదు?"

"రేపు వస్తారు."

"మరది మీ బావలాగే చిరచిరల మనిషా?"

సరస్వతి చెల్లెలి పెళ్లికి రాలేకపోయింది భర్తకి సెలవులేక. ఛాయది కులాంతర వివాహమని తెలియగానే చెల్లెలికి వుత్తరం రాసింది. ఛాయ అక్క భయానికి నవ్వి వూరుకుంది. ఉత్తరానికి సమాధానం రాయలేదు.

"కాదులే!" నిర్లిప్తంగా అంది ఛాయ.

సరస్వతికి సంతృప్తి కలగలేదు. ప్రేమించి చేసుకున్న పెళ్ళి గురించి, సంసారం గురించి ఏ ఆడదయినా ఘనంగాచెప్పుకుంటుంది. ఛాయ మౌనంగావుంది. అంటే యిద్దరిమధ్యా కీచులాటలు వచ్చాయా? సరస్వతి నేరుగా అడగలేక పోయింది.

"ఈ దశలో తప్పుచేశావన్న భావన రాకూడదు ఛాయా? నిన్ను అర్థం చేసుకోవడంలేదని బాధపడటం కన్న, ఎదరవార్ని అర్థం చేసుకోవడానికి నువ్వే ప్రయత్నించాలి. అలా జరిగితే సమస్యే వుండదు."

తరాల పరవడివల్ల ఏర్పడిన జీవిత విధానానికి, ఆ స్త్రీత్వానికి సరస్వతి ప్రతినిధి. ఒక సాంప్రదాయ సమాజాన్ని ఆశ్రయించుకొని పెనవేసుకుపోయి వారసత్వంగా వస్తున్న చరిత్రను కాదని పురోగమనంతో 'ఛాయ' కొత్త బాట తొక్కడం సరస్వతికి విప్లవంగా కనిపించింది. మార్పు ఏదయినా రాజీపడి తీరాలి! మధ్యతరగతి జీవితాలు రాజీ పడలేకపోతే మనుగడుండదు.

మర్నాడు భోగిపండుగ.

ఉదయమే దివాకర్ వచ్చాడు. వచ్చిన గంటకు కాని ఛాయ వెళ్లి కనిపించలేదు.

పొడిగా పలకరించింది.

"పండగ అలసటంతా నీ ముఖంలోనేవుంది ఛాయా?"

ఆమె చిన్నగానవ్వి, "స్నానం చెయ్యండి అమ్మకి వంటలో సాయం చెయ్యాలి!" అక్కడ్నుంచి తరుముకొస్తున్నట్లు నటించింది.

సీతమ్మకి యాభై దాటుతున్నా దారుఢ్యం తగ్గలేదు. ఆమె వంటల్లో ఒకర్ని ఆపేక్షించే మనిషికాదు. చిన్నకూతురు చొరవగా రావడం ఆమెకి సంతసంగావున్నా "నీ కెందుకమ్మా? అతడికేం కావాలోచూడు" అన్నది.

"టిఫిన్ అయిందిగా - ఇంకే మక్కర్లేదు" ఖాళీగా కూర్చుంటే భర్తతో మాట్లాడక తప్పదని వంటగదిలోకి వెళ్ళింది.

అల్లుళ్ళు యిద్దరూ లాంఛనంగా కలుసుకున్నారు. తమ గదుల్లోకిపోయి కూర్చున్నారు. రంగారావుకి తాను చిన్న వుద్యోగినని భయం. దివాకర్‌కి కులం గురించి భయం.

పన్నెండున్నరకి భోజనాలకి పిలుపువచ్చింది. సదాశివానికి, అల్లుళ్ళకి వడ్డించారు. సరస్వతి, ఛాయ వడ్డిస్తున్నారు. సీతమ్మ యింకా వంట పొయ్యి దగ్గరేవుంది.

"పండగ రోజున కూడ మైల కూడే. . సంధ్యావందనం చేసే నిష్ఠకుటుంబం మాది. తీసి ప్రక్కగా వడ్డించు." రంగారావు పెళ్ళానికి పురమాయించాడు. దివాకర్ ముందు తను అల్పజీవి కాదన్న విషయం రంగారావుకి రుజువు చేసుకోవాలని వుంది.

అక్కడున్న వాళ్ళంతా మ్రాన్పడిపోయారు. సరస్వతి గొడవ పెరక్కుండా ఎదురుగా వడ్డించింది.

"ఏ వూరన్నావు దివాకర్ మీదిః" రంగారావు అన్నం కలుపుకుంటూ అడిగాడు.

దివాకర్ చెప్పాడు.

"మీ నాన్నగారు ఏం చేస్తున్నారు"

దివాకర్ సిగ్గుపడుతూ చెప్పాడు.

"కళావంతులా.... ఐసీ . ఆ చెరువు గట్టు మీద యిల్లేనాః"

దివాకర్ గాలికి వూగే దిష్టిబొమ్మలా తల ఆడించాడు.

"సరోజ ఏమవుతుంది? చెల్లెలు కదూ! నిన్ను ఎక్కడో చూశానిదివరకు. ఒకటే పోలిక. ఆ పిల్ల దగ్గరికి రాజమండ్రిలో వున్నప్పుడు రెండు మూడుసార్లు వచ్చాను. ఎ సెక్సీ డెవిల్. ఓమారు మావూళ్ళో మేళం జరిగినపుడు రాయుడు దిగంబర నృత్యం చేసిన వాళ్ళకి రెండువేలు యిస్తానన్నాడు. ఎవరూ రాలేదు. సరోజ ముందు కొచ్చింది ఎ నైస్ ఫిగర్! ఆ తర్వాత మా వూరి వాళ్ళందరూ మీ యింట్లోనే మకాం పెట్టారు."

దివాకర్ అమావాస్య చంద్రుడయ్యాడు. అన్నం తినాలనిపించలేదు. చెయ్యి కడుక్కుని లేచిపోయాడు.

"మీ కసలు మతివుందాః" సరస్వతి

మొగుడ్ని అడిగింది.

సదాశివం, సీతమ్మపోయి బ్రతిమాలినా దివాకర్ రాలేదు. ఆఖర్ని ఛాయ వెళ్లింది. దివాకర్ బట్టలు సర్దుకుంటున్నాడు.

"మీ బావ మనిషేనా?" క్రోధంగా అడిగాడు.

"ఏం? తను చేసింది, చూసింది చెప్పాడు. అబద్ధమైతే ఖండించలేకపోయారా? మీవాళ్లు చేస్తున్నది రహస్యమైన పనా?" ఛాయకి మొగుడ్ని ఎదిరించడానికి రంగం ఏర్పడింది.

దివాకర్ బిగిసిపోయాడు.

"ఆపని మీరు పరువు తక్కువగా భావించి నప్పుడు సరోజకి పెళ్లి చేసి వుండవల్సింది. మీ అవసరాలు తీరాకా ఆదర్శాలు వల్లించడం కాదు."

దివాకర్ ఫట్టలేని ఆగ్రహంతో చెయ్యి ఎత్తాడు.

"చేతకాని వాళ్ళకి పౌరుషం ఎక్కువ."

దివాకర్ మంచంమీద కూలబడిపోయి "నన్ను చిత్రవధ చెయ్యకు ఛాయా" బిగ్గరగా అరిచాడు.

# 4

"మీ అసమర్థత వల్లే ఈ బ్రాంచి పాడై పోయింది. ఇన్ని లక్షల నష్టానికి మీరిచ్చే సంజాయిషీ నమ్మను. సంస్థ అభివృద్ధి దృష్ట్యా మిమ్మల్ని తీసివెయ్యడం తప్పని సరి. సారీ మిస్టర్ దివాకర్. యుకెన్‌గో."

యం. డి. రూమ్నుంచి దిగాలుగా బయటికి వచ్చాడు దివాకర్. సెక్రెటరీ ప్రక్కకి కేక వేశాడు. "మళ్ళారండి. బాస్‌కి నచ్చచెబుతా నీలోగా."

అది అంధకారంలో ఆశాకిరణం. లేని తప్పులు తనకి అంటగట్టి నోర్మూసారు. సుధీర్‌రాయ్ ప్రమోషన్‌కి తనని వెనక్కి నెట్టారా?

దివాకర్ ఆశగా ప్రయత్నిస్తునే వున్నాడు. సెక్రటరీకి పదివేలు యిచ్చాడు. వారానికి రెండుసార్లు బొంబాయివెళ్లి వస్తున్నాడు. అయినా ప్రగతి కనిపించలేదు. యం.డి.తో యింటర్వ్యూ దొరకలేదు.

"ఎన్నిసార్లు త్రిప్పుతారు సార్. ఉన్నదంతా తగలేసుకున్నాను. దఫాకి అయిదు వందలు ఖర్చవుతోంది. నాకేం ఆస్థిపాస్తులులేవు. రెక్కలమీద ఆధారపడ్డవాడ్ని." సెక్రటరీతో మొరపెట్టుకున్నాడు.

సెక్రటరీ అనునయించాడు. దివాకర్‌ని బార్‌కి తీసుకువెళ్ళాడు. రెండు వందలు వది లాకా," రాత్రే యం.డి. కాంటినెంటల్ టూర్‌కి వెళ్ళాడు. రెండున రండి. మీవిషయం సెటిల్ చేసేస్తాను" చల్లగా చెప్పాడు.

దివాకర్ గంగిరెద్దులా తలూపి రైలు ఎక్కాడు. సెంట్రల్లో దిగేసరికి పైసాలేదు. నడిచి యింటికి వెళ్ళాడు నిప్పులు చెరిగే యెండలో.

"వెళ్ళినపని ముఖంమీదే కనిపిస్తోందే!" ఛాయ అడిగింది.

దివాకర్ మంచినీళ్ళుతాగి మంచంపై కూర్చు న్నాడు.

"ఇంకా ఎందుకీ తిరిగడం? పాతికవేలు తగలేశారు? మరో వుద్యోగం చూసుకో కూడదూ?" ఛాయ విసురుగా అడిగింది.

"అదంత సులువా ఛాయా?"

• "ఇలా నాశనం చెయ్యడం సులువా?"

ఆమె విసుర్లు అతడికి అలవాటయి పోయాయి. మరోగ్లాసు మంచి నీళ్ళు త్రాగి కళ్ళుమూసుకున్నాడు.

ఉద్యోగం పోవడం, దానికి భర్తచేస్తున్న ప్రయత్నాలు ఛాయ గమనిస్తోంది. బ్యాంక్ బాలెన్స్, తన నగలు హుళక్కి. విలువైన ఫర్నిచర్ పోయింది. సంసారం దివాళాతీసింది. బంగళా ఖాళీచేసి వెస్టు మాంబళంలో అద్దె ఎనభై యిచ్చి చీకటి కొట్టులో ప్రవేశించారు.

"ముందర బియ్యం సరుకులు తీసుకరండి. మీరొస్తేగాని వంట చెయ్యడానికి వీలులేదు." ఛాయ సంచి మంచంమీదకు విసిరింది.

వెళ్ళాలని లేదు. ప్రయాణపు అలసట. మానసిక అశాంతి. కాని కాళికలా నించున్న ఛాయకి ఎదురు చెప్పలేక బలవంతంగాలేచాడు.

ఐశ్వర్యం అనుభవించి దారిద్ర్యాన్ని

పొందటంకంటే ఘోరమైన శిక్ష మరోటిలేదు. దరిద్రం భయంకరమైనది. ఆకలికేకలు ప్రాథమిక సమస్యకి చెందినవయినా అవి ఎటువంటి సంస్కారాన్నయినా దెబ్బకొడతాయి.

రోజులు భయంకరంగా గడుస్తున్నాయి. ఒకే కప్పుక్రింద వుంటున్నా ఇద్దరూ ఘోరంగా పోట్లాడుకుంటారు! అదే కాలక్షేపం.

ఒకటవ తారీఖు వచ్చింది. రేపు ప్రయాణానికి డబ్బుకావాలి. రూపాయలు తెచ్చే వస్తువులు ఇంట్లో ఏంలేవు.

ఛాయ వుల్లిపాయలు వలుస్తోంది. దివాకర్ మెల్లిగాపోయి ఆమె ప్రక్కన కూర్చుని "రేపు వెళ్ళాలి ఛాయా" అన్నాడు.

"నా దగ్గర డబ్బేంలేదు."

"తెలుసు. .మీ నాన్నగారికి వైరిచ్చి, ఓ వెయ్యి తెప్పించు: తర్వాత యిచ్చేద్దాం."

"ఆయన కుబేరుడేం కాదు."

"ఛీ, నీకు బుద్ధిలేదు. నా ఏడుపేమయినా పట్టుతోందా?"

"నేనుకూడా ఏడవనా?"

ఛాయతో పోట్లాడి దివాకర్ రోడ్డెక్కాడు. ఎక్కడికి పోవాలో తెలియదు. డబ్బు సంపాదించాలి. తెలిసిన ముఖంకోసం తడుముకుంటూ నడుస్తున్నాడు. చితికిపోయిన దివాకర్ పేరాశగా ప్రయత్నిస్తున్నాడు.

సాయంత్రందాకా నడచి, యిక ఓపికలేక మౌంట్‌రోడ్డులో ఓ దుకాణంముందు కూర్చున్నాడు నీర్సంగా. ఏం తినటానికి పైసలు లేవు.

"అన్నయ్యా!" తడుముకుంటూ ఓయువతి అతడి దగ్గరకి వచ్చింది. సరోజని తెలియగానే తలవంచుకున్నాడు.

"ఇలా అయిపోయావేం అన్నయ్యా?"

జరిగింది చెప్పాడు. "నీ వంట్లో యెలా వుంది?"

"ఇప్పుడు బాగానేవుంది. మైనర్‌రాజు సినిమా తీస్తున్నాడు. నన్ను హీరోయిన్‌గా బుక్ చేశాడు. నీకోసం పాతయింటికి వెళ్ళాం నిన్న. లేవన్నారు. అడ్రస్ యివ్వు. రేపు వస్తాను."

చితికిపోయిన అన్నగార్ని చూడగానే సరోజకి మనస్సు చలించిపోయింది. గుప్పెడు నోట్లు అతడి జేబులో పెట్టింది.

దివాకర్‌కి తల వాలిపోయింది. ఆరోజు తనవాళ్ళు తన గుమ్మంలోకివచ్చి ప్రాధేయపడితే, ఎదిగిపోయాననుకున్న అహంకారంతో విదిలించి కొట్టాడు. ఈనాడు బురదలోవున్న సరోజ తన సంస్కారాన్ని జయించింది.

దివాకర్ కంటినుండి కన్నీరు పెల్లుబికి సరోజ చేతులపై పడింది. ఆమె తన చీర కొంగుతో అతడిముఖం తుడిచింది.

"కష్టాలు వచ్చినప్పుడు కృంగిపోతే ఎలాగరా అన్నయ్యా! ఏం బాధ పడకు. మేమంతా లేమా?"

"ఈ వెధవపై జాలి చూపకమ్మా. నా లాంటి రాక్షసుడ్నికూడా క్షమించి ఆదరించారంటే మీరు మనుషులుకారు దేవతలు."

అంతలో ఓ యువకుడు అక్కడికివచ్చి, "సరోజా! నాన్ వెళ్లికిళమై వరువేన్" అన్నాడు. సరోజ తలూపింది.

"వస్తానమ్మా . . రేపు తప్పకుండారా. ." దివాకర్ ముందుకెళ్లి పోయాడు.

## 5

"శ్రీ దివాకర్!

భర్తగా పిలవటానికి నాకు సిగ్గుగావుంది. నీ భవిష్యత్తుకోసం నా జీవితంతో జూదం ఆడావు. ప్రతీసారి బొంబాయినుంచి నిరాశగా వచ్చేవాడివి. ఈసారి నీ ఆనందంచూసి పొంగిపోయాను. నువ్వు తెచ్చిన నగలు, చీరలు చూసి మళ్ళా మంచిరోజులు వచ్చాయనుకున్నాను.

"యం.డి.ని డిన్నర్‌కి పిలిచాను. ఆయన్ని ప్లీజ్ చేస్తే మన పనయి పోతుందన్నావు." గృహిణిగా ఆతిథ్యాన్ని ఏర్పాటుచేశాను. మంచి నీళ్ళకి పిలిస్తే తీసుకువెళ్ళాను! ఆ రోగ్ నా చీర లాగేడు.

కెవ్వున అరిచాను. నువ్వెక్కడుంటావ్? నాటకంలో నీపాత్ర యిక వుండకూడదు.

పెళ్ళాన్ని తార్చడంతో నీపని పూర్తయ్యింది. ఇది పథకం ప్రకారం వేసిన వల. ఇదే విషయం బొంబాయినుంచి రాగానే నాతో చెప్పి వుంటే, నీతో కాపురం చేసినందుకు, శరీరాన్ని అతనికి అప్పగించి యెండ్రిన్ తాగేదాన్ని తర్వాత. ఇప్పుడు నన్ను మోసం చేశావు.!

నీకంటే ఎన్నోరెట్లు నీ వాళ్ళునయం. కుల వృత్తి ప్రకారం వ్యభిచారం చేసుకుంటున్నారు. వృత్తికోసం నువ్వు వ్యభిచారం చేయించావు. నీ ఆదర్శాలు కేవలం గాలిబుడగలు. రాజకీయ నినాదాల్లా తెచ్చిపెట్టుకున్నవి. ఆత్మగౌరవమే వుంటే కూలిపని చేసుకునయినా సరే, సరోజకి పెళ్ళి చేసేవాడివి. నీది ద్వంద్వనీతి. వాళ్ళ పతనంలో, ఆ బురదలో పెరిగి అవసరాలు తీరాక అసహ్యించుకున్నావు.

చదువుకోసం చెల్లెలుపయోగపడింది. ఉద్యోగానికి పెళ్ళాం వుపయోగించింది. శభాష్ ఇప్పుడు చెప్పు సుభాషితాలు. పైకి రావడానికి ఆశయాలు ఒక ఎత్తు, ఒక వల, ఒక ఎర! ఇలాంటి యువకిశోరాలే రేపటి మన సంస్కృతికి వైతాళికులు!

ఇంకా నీలాంటి వ్యాపారిని 'మొగుడు' అని మురిసిపోయే ఆడమనసు నాకులేదు. 'అందుకే డైవోర్సుకి అప్లయ్ చేస్తున్నాను. మిగతా విషయాలు నా లాయర్ వచ్చి మాట్లాడుతారు. రెండు పడవల్లో చెరో కాలుపెట్టి పయనించడం మంచిది కాదని కాలమే నీకు చెబుతుంది.

మన పెళ్ళి, సంసారం ఒక పీడకల నా జీవితంలో. నువ్వు సంపాదించే అధికారము, ఐశ్వర్యం శవాలంకరణ వంటివి. పాప బాధ్యత ఏమయినా నీకు యిచ్చేదిలేదు. మరో పదేళ్ళు పెంచితే ముసలితనం హాయిగా గడపడానికి దానిచేత 'కంపెనీ' పెట్టించగలవ్. నువ్వు నడుస్తున్నది పాకుడురాళ్ళమీద! పతనం ప్రతి క్షణం నీ దాపులోనే వున్నది. వుంటుంది. వుండాలి!

సెలవ్!

ఛాయ."

దివాకర్ కుర్చీలో కూలబడి పోయాడు. □

పి.వి.ఆర్.శివకుమార్

# జ్ఞాన సుందరం




జ్ఞానసుందరం మా సెక్షన్లో జాయినయిన రోజు అతడిని చూసి అవహేళనగా నవ్వుకున్న వాళ్ళలో నేనూ ఒకణ్ణి. క్రమంగా రోజులు గడిచిన కొద్దీ అతడికి నే నెందుకు అంతలా సన్నిహితుణ్ణయ్యానో నా కిప్పుడు స్పష్టంగా గుర్తులేదు. అయితే మా సెక్షన్లోనే కాదు—మా ఆఫీసు మొత్తంమీద జ్ఞానసుందరంతో స్నేహం చేసిన వాళ్ళలో నేనే మొదటివాణ్ని. నేనే చివరివాణ్ని కూడా!

నాలుగే నాలు గడుగుల ఎత్తు. అడుగున్నర మించని చేతులు, కొద్దిగా పొడుగ్గా కనిపించే తల నాలుగు రోజులు పోతే నలుపులో కలిసిపోయేటట్టున్న రంగు—ఇదీ జ్ఞానసుందరం రూపం. అతడి పేరే చెబుతోంది అతను జ్ఞానంలో తప్ప దేహంలో ఎలాంటి సౌందర్యమూ లేనివాడని!

సుందరం ఓర్పు ఎదటి వాళ్ళ అపహాస్యాలని కూడా స్పోర్టివ్‌గా తీసుకుని, తనని హేళన చేసే వాళ్ళని కూడా మన్నించే గుణం అవే — బహుశః అతన్లో నన్ను ఆకర్షించిన గుణాలను కుంటాను. అంద వికారంగా వున్నా అతన్లో ఆత్మవిశ్వాసం వుంది. చిన్నప్పటి నుంచీ చుట్టుపక్కలవాళ్ళ అవహేళనలు అలవాటైపోబట్టి అతని మనసు రాటుదేలిపోయి, వాటిని లక్ష్యపెట్టటం మానేసిందని అనుకునేవాణ్ని.

నేను కథలు రాస్తానని అతనికి తెలిసిన మొదటి రోజునే అతను నాతో పరిచయం చేసుకున్నాడు.

"నమస్తేసార్! ఈవారం ప్రభలో '— కథ మీరేనటగా రాసింది" అంటూ నా దగ్గరకు' వచ్చాడు ఆ సాయంత్రం ఆఫీసు వదిలేవేళ, సుందరం.

"అవునండీ" అన్నాను క్లుప్తంగా. ఆఫీసు వదిలేశాకకూడా నా వెనకేవచ్చి, కలిశాడు. ఇద్దరం పదడుగులు వేశాక, "కాఫీ తాగిపోదాం రండి" అంటూ నా జవాబు కోసం ఆగకుండానే 'ద్వారక' లోకి దారితీశాడు.

టిఫిన్ చేస్తుండగా నా కథగురించి మాట్లా

డాడు. బాగుందని పొగిడాడు. ఇది ప్రచురణ యిన నా దెబ్భయ్యో కథ. అందుకే నేనంతగా పొంగిపోలేదు. 'థాంక్స్' అని మాత్రము అన్నాను.

"గురూగారూ, నాకు థాట్స్ వస్తుంటా యండీ! కథా రూపంలో పెట్టటమే కుదరటం లేదు. కొన్ని రాశానుకూడా. కానీ, తిరిగి వచ్చేశాయి" అంటూ ఆగాడు.

ఇలాటి మాటలు వినడం అప్పుడప్పుడూ నాకు మామూలే. అందుకే నేనే అన్నాను— "అవి ఓసారి ఇవ్వండి. చూసి యిస్తాను!"

"అబ్బె! అవెందుకులెండి. అసలిప్పుడు నాకు కథలు రాయాలని కోరికకూడా లేదు. ఎందుకంటే నాకే తెలిసిపోయింది, నా బుర్ర ఆలోచించటానికే తప్ప రాయటానికి పనికి రాదని" అంటూ నవ్వేశాడు.

నాకొంచెం ఆశ్చర్యంగా అనిపించింది. సాధారణంగా ఇలాటివాళ్ళు, రచయితంటూ ఎవరన్నా కనిపించగానే, తమ కథల్ని దిద్ది పెట్టమనో, ఎలా రాయాలో సలహా చెప్పమనో వేధిస్తారుగానీ, ఇలా తమ అసమర్థతని ఒప్పు కుని, సహాయాన్ని తిరస్కరించరు.

"అలా ఎందుకనుకుంటారు? ప్రయత్నిస్తే మీరూ రాయగలుగుతారేమో" అన్నాను.

"వద్దులెండి గానీ, నాదో చిన్న రిక్వెస్టు వుంది. మీరు ఒప్పుకోవాలి" అన్నాడతను.

"చెప్పండి."

"ఇక్కడ కాదులెండి. నా రూమ్‌కి వెళ్లాక చెప్తాను. మీరిప్పుడు నా రూమ్‌కి రావాలి."

సుందరం గది ఆఫీసుకి దగ్గరే. పది నిము షాలు నడిచేక ఆ గది చేరుకున్నాం. రేకుల షెడ్‌లాగా వున్న ఆ చిన్నగదిలో అతనెలా వుండగలుగుతున్నాడో — ఆశ్చర్యం వేసింది. లోపల ఓ మంచం, దానికింద ఓ రేకుపెట్టె, గదిమూలగా వంటచేసుకోడానికి ఓ స్టవ్, నాలు గాయిదు గిన్నెలు— అంతే ఆ గదిలోవున్న సామాను.

మంచంమీదే కూర్చున్నాం. సుందరం పెట్టెలోంచి ఓ ఫైలుతీసి నాకు అందించాడు. కథలేమో అనుకుని తెరిచాను. కానీ అందులో వున్నవి కథలుకావు. చిత్రాలు! మామూలు తెల్లకాయితాలమీద వేయబడ్డ అపురూపమైన ప్రకృతి సౌందర్య దృశ్యాలు! సుందరం ఆర్టిస్టుకూడా నన్నమాట!

"చాలా బావున్నాయండీ" మనస్ఫూర్తిగా అన్నాను.

"ఇవే కాదండీ. నా హేండ్ రైటింగ్ కూడా బావుంటుంది. అదే నే చెప్పిన రిక్వెస్టు. మీ కథలు నన్ను ఫెయిర్ చెయ్యనిస్తారేమో అడగాలనే!" అన్నాడు సుందరం.

"ఛ .ఛ .భలేవారే! మీకెందుకూ ఆ శ్రమ!" అన్నాను.

"శ్రమేంకాదు. అదో ఉత్సాహం. నాకై నేను రాయలేక పోయినా, మీరు రాసేవన్నా ఫెయిర్ చెయ్యగలిగితే అదో తృప్తినాకు."

"సారీ! నా కథల్ని నేనే ఫెయిర్ చెయ్యాలి తప్ప, మరొకరు చెయ్యటం కుదరదు. ఎందు కంటే, ఫెయిర్ చేసేటప్పుడు నేను మార్పులు చాల్తా చేస్తూవుంటాను" అన్నాను. అది నిజం కూడా.

కాసేపు కూచున్నాక, మా అడ్రసుచెప్పి, ఎప్పుడన్నా రమ్మని నేను వాచ్చేశాను. అదే మా మొదటి పరిచయం.

* * *

కొన్నాళ్ళు గడిచేసరికి మా సెక్షన్లో పెద్ద చర్చనీయాంశ మయిపోయాడు సుందరం. అందుకు కారణం అతని రూపమొక్కటేకాదు.

నెలకి నాలుగొందలు పైగా వస్తుంది అత నికి జీతం. పెళ్ళికాలేదింకా. అంతకుమించి అతని పర్సనల్ మేటర్స్ ఎవరికీ తెలియవు. అతను ఎవరితోనూ చెప్పుకోలేదు.

ముప్ఫయి రూపాయల ఆ రేకులగదిలో ఎలా బతుకుతున్నాడో తెలియదు. ఆ గది లోనే, రెండుపూటలా వంటకూడా చేసు కుంటాడు. బయటెక్కడా కాఫీకూడా తాగడు. [అలాంటివాడు ఆరోజు నాకు హోటల్లో కాఫీ, టిఫిన్లు ఇప్పించాడంటే, రచయితలంటే అతని కున్న అడ్మిరేషన్ యెంతటిదో అనిపించింది

నాను.] కాటన్ బట్టలుమాత్రమే వాడతాడు. అవీ రెండు, మూడు జతలకన్న లేవు. సిగ రెట్లు కాల్చడు. సినిమాలు చూడడు. ఇంకె లాంటి దురలవాట్లులేవు. ఇంత జీతం వస్తుంది. అతని ఖర్చులుచూస్తే నెలకి నూటయాభై కన్న అయేలా లేవు. మరి మిగతాడబ్బంతా యేం చేస్తున్నట్టు? ఎందుకంత పిసినారిలా గడుపు తాడు? ఇదే ఆఫీసులో అందర్నీ పీడించే ప్రశ్న.

"ఏమో, అతనికి పామిలీ ప్రాబ్లమ్స్ ఏమున్నాయోలెండి" అని నేను సమర్థించినా ఎవరూ ఒప్పుకోలేదు. కుటుంబ సమస్యలే వుంటే, అంత వుత్సాహంగా వుండడం యే మనిషికీ తరంకాదని కొట్టిపారేశారు.

* * *

ఒకటి, రెండుసార్లు నాగదికి వచ్చాడు సుందరం. నెమ్మదిగా అతన్ని ప్రోత్సహించాను తన బొమ్మల్ని పత్రికలకు పంపమని.

"అవా? అవెవరు వేసుకుంటారండీ?" అనే శాడు మొదట్లో. కానీ, పోరగా పోరగా చివ రకి ఒప్పుకున్నాడు. అయితే,

"మీరో ప్రామిస్ చెయ్యాలి. వీటిని నేను కలం పేరుతోనే పంపుతాను. నేను బొమ్మలు వేస్తానని గానీ, ఈ కలం పేరు నాదనిగానీ మన ఆఫీసులో యెవరితోనూ చెప్పకూడదు" అన్నాడు చివరికి. అయితే కారణం మాత్రం చెప్పలేదు. "ఏంలేదు. నేను బొమ్మలు వేస్తా నని ఎవరికీ తెలియటం ఇష్టంలేదంతే"అన్నాడు. అతని కలంపేరు 'ఊహాసుందరి'.

అదే పేరుతో అతను పంపిన చిత్రాలు పత్రికల్లో అచ్చవసాగాయి. ఆ విషయం నేను ఎవరితోనూ చెప్పలేదు. పది కథలు పడగానే ఎంత అనామకుడికయినా ఓ పేరంటూవస్తుంది గానీ, పది బొమ్మలు పడినంత మాత్రాన ఈ ఆంధ్రదేశంలో ఏ చిత్రకారుడికి పెద్ద గుర్తింపు వస్తుంది గనక? అందుకే 'ఊహాసుందరి' అన్న ఆర్టిస్టు ఈమధ్య చాలా బొమ్మలు వేస్తు న్నాడన్న విషయమూ మా ఆఫీసులో ఎవరికీ పట్టలేదు.

* * *

దాదాపు ఏడాది దాటింది సుందరం మా ఆఫీసులో చేరి. ఈ ఏడాది కాలంలోనూ అతడి పిసినిగొట్టు స్వభావానికి అతన్ని అస హ్యించుకునే వాళ్లుకూడా అతని మాటల ధోర ణికి, కలివిడి తనానికి కట్టుబడిపోయి అత నంటే కాస్త చనువుగానే వుంటున్నారు.

మరో నెలరోజుల్లో నా పెళ్ళి! ఈవిషయం తెలియగానే ఎందుకో షాక్ తిన్నట్టు కనిపిం చాడు సుందరం. నాకు ఆశ్చర్యం అనిపించింది అతని ప్రవర్తన. కానీ, అరగంటన్నా కాక ముందే తేరుకున్నాడతను. నా కాబోయే శ్రీమ తిని గురించిన వివరాలన్నీ ఉత్సాహంగా అడి గాడు. అప్పట్నుంచీ పెళ్ళి ప్రయత్నాల్లో— వెడ్డింగ్ కార్డ్ డిజయిన్ దగ్గర్నుంచీ, నా బట్టల సెలక్షన్‌వరకూ అన్నిట్లో — చాలా ఉత్సాహంగా సహాయంచేశాడు.

"చాలా థాంక్స్ సుందరంగారూ, మీ పెళ్ళి క్కూడా అన్నిపనులూ నేనేచూసి పెడతాను" అన్నాన్నేను.

"థాంక్స్. కానీ, అలాంటి అవసరంమీకు రాదులెండి."

నవ్వుతూనే అన్నా ఆ మాటల వెనక దాగున్న విషాదం నన్ను కదిలించింది.

"అదేమిటి? మీకు పెళ్ళి కానేకాదా? భలే వారే, భూమిమీదపడ్డ ప్రతివారికీ ఆ బ్రహ్మ దేవుడు ఎవరో ఒకరిని జంట కూరుస్తూనే వుంటాడు. మీరు ఆ జంజాటమంతా తప్పిం చుకుని సుఖంగా బతికేద్దామనుకున్నా కుదర్దు" అన్నాను నవ్వు తెప్పించుకునే ప్రయత్నంచేస్తూ. ఏమీ జవాబివ్వలేదు సుందరం. మౌనంగా వూరుకుండి పోయాడు.

* * *

నా శ్రీమతి కాపురానికి వచ్చినప్పటినుంచీ మా యింటికి రావటం తగ్గించేశాడు సుందరం. కొత్తకాపురం మోజులో నేనూ అతడినిగురించి పట్టించుకోవటం తగ్గిపోయింది. ఆఫీసులో మాత్రం ఎప్పటిలాగే మాట్లాడుకుంటూ వుండే వాళ్ళం.

ఆరోజు రాత్రి సెకండ్‌షో చూసి, నేనూ, లక్ష్మి నడిచి వస్తున్నాం. పుచ్చపువ్వులాంటి



వెన్నెల్లో, నిర్మానుష్యంగావున్న హైద్రాబాద్ రోడ్ల మీద లక్ష్మిచేతిని పట్టుకు నడుస్తుంటే చెప్పలేనంత హాయిగా అనిపించింది. అయితే అంతలోనే నా మనసుని కలుషితం చేస్తూ కనిపించిందా దృశ్యం—రోడ్డు పక్కగావున్న బార్ లోంచి తూలుతూ వస్తున్నాడు సుందరం. అతని రూపం ఆ వెన్నెల వెలుగులో అంత స్పష్టంగా తెలియక పోయివుంటే, నేను నమ్మగలిగి వుండేవాడిని కాదు అతను సుందరమేనని. దగ్గరకు వెళ్ళి మాట్లాడించాలని, ఎందుకింత హఠాత్తుగా ఇలాంటి పనిచేశాడో తెలుసుకోవాలని అనిపించినా, లక్ష్మి దృష్టిలో కూడా అతన్ని చెడ్డవాణ్ని చెయ్యటం ఇష్టంలేక, ఆ వైపు దృష్టి అటు పడకుండా జాగ్రత్తపడుతూ ముందుకి నడిచాను.

ఇంటికి చేరాకకూడా నామనసు ఆ విషయం మీదే నిల్చిపోయింది. 'సిగరెట్ కూడా తాగని సుందరం ఇంత హఠాత్తుగా ఇలాటి స్థితికెలా దిగజారాడు?' ఎంత ఆలోచించినా జవాబు దొరక్క వూరుకున్నాను.

* * *

రాత్రి పదిగంటలకి వచ్చే ఎక్స్‌ప్రెస్‌లో మా అన్నయ్య వస్తున్నాట్ట. సాయంత్రమే టెలిగ్రామ్ వచ్చింది. స్టేషన్‌కి వెళ్ళాను. తీరా కనుక్కుంటే, ఎక్స్‌ప్రెస్ రెండుగంటలు లేటుట? ఏం చెయ్యాలో తోచక, హిగిన్ బాదమ్స్‌లో ఓ నవల కొనుక్కుని అక్కడే వెయిటింగ్ రూంలో కూర్చున్నాను. పన్నెండు గంటలయింది. మరో అరగంటలేటని ఎనౌన్స్ చేశారు. మరీ బోరుగా అనిపించింది. స్టేషన్ బయటికి నడిచాను. దగ్గరేవున్న ఇరానీ రెస్టారెంట్‌లోకి వెళ్లి 'చాయ్'కి ఆర్డరిచ్చాను. చాయ్ తాగుతూ యథాలాపంగా బయటకు చూసాను. రోడ్డుకి అవతలివైపున—దూరంగా తలవంచుకుని నడుస్తున్న వ్యక్తి—అవును సుందరమే! ఎడారిలో ఒయాసిస్సు కనిపించినట్లయింది. ఈ సుదీర్ఘ నిరీక్షణలో నాకు తోడుగా వుంటాడనిపించింది. బయటకివచ్చి, "సుందరం" అంటూ కేకేశాను. అతనికి వినిపించినట్టు లేదు. గబగబా అతడి దగ్గరగా నడిచాను. భుజంమీద చెయ్యి వేసేసరికి తలతిప్పి చూశాడు. అతని దగ్గర్నుంచి లిక్కర్ కంపుతోపాటు, యేదో చౌకబారు సెంటువాసనకూడా వస్తోంది. స్టన్ అయిపోయాను నేను—నలిగిపోయిన అతని బట్టలు, వాలకం చూసి! నన్ను చూస్తూనే, ఎవరో ఎరగని వ్యక్తిని చూసినట్టు చూసి గబగబా వెళ్ళిపోయాడతను.

అలాగే రెండు నిముషాలు నిలబడిపోయి,

నెమ్మదిగా రెస్టారెంట్‌లోకి నడిచాను. టీ చల్లబడిపోయింది. మరో టీకి ఆర్డరిచ్చి, సిగరెట్ వెలిగించుకు కూర్చున్నాను.

'ఈమధ్య సుందరంలో వస్తున్న ఈమార్పుకి కారణాలేమిటి? ఇప్పుడు అతను దర్శనమిచ్చిన వైఖరికి, మధ్యాహ్నం జరిగిన సంఘటన కూడా కారణమా?'

శ్రావణమాసం నోములంటూ పుట్టింటికి వెళ్లిన శ్రీమతి ఈవారంలో వస్తుందని అనుకుంటున్నాను గానీ—ఇవాళ ఉదయమే వస్తుందని వూహించలేదు. పొద్దున లేచేవేళకే ఆమె రావటంతో, హుషారుగా ఇవాళ ఆఫీసుకు శెలవు పడేసాను. మధ్యాహ్నం ఒంటిగంట వేళ—కాలింగ్‌బెల్ మోగటంతో, పోస్టుమాన్ అనుకుని ఆదరాబాదరా అనాచ్ఛాదితంగావున్న ఒంటిమీద టవల్ పడేసుకుని వెళ్ళి, తలుపు తీశాను—ఆ వచ్చింది సుందరం! తడబాటుగా "రండి, రండి" అంటూ లోపలి కాహ్వానించాను.

అతన్ని ముందు గదిలో కూర్చోబెట్టి, లోపలికి వెళ్లి బనీన్ వేసుకుని, లక్ష్మితో కాఫీ కలపమని చెప్పి బయటకి వచ్చాను.

"మీ మిసెస్ వచ్చారా?" అని అడిగాడు సుందరం.

తలూపాను, కొంచెం సిగ్గుపడుతూ.

నాకేసి చూసి నవ్వాడు సుందరం.

"సారీ, నిద్రపోతున్నట్టున్నారు. డిస్టర్బ్ చేశానా?"

ఇహ ఈ ప్రసక్తి ఆపుచేస్తే బాగుంటుందనిపించింది నాకు.

"సిక్ ఇంటిమేషన్ పంపాను. సెక్షన్లో అందిందా?" మాట మార్చాను.

"అందింది. అదిచూసే, యేమయిందో చూద్దామని లంచ్‌లో ఇటొచ్చాను" అన్నాడు అతను.

కాసేపు ఏదో మాట్లాడుకున్నాక, కాఫీతాగి సుందరం వెళ్లిపోయాడు. కానీ ఆ మాటల లోనే అతనిలో ఏదో కలవరం తడబాటు కనిపించాయి. అన్యమనస్కంగా వున్నట్టు కనిపించాడు.

ఈమధ్య నెలరోజులుగా గమనిస్తున్నాను. ఎప్పుడూ ఏదో ఓ పుస్తకం చదవటం అతనికి అలవాటే అయినా, ఈ మధ్యనే తెల్లని అట్టలు వేసిన పుస్తకాలు అతని చేతిలో ఒకటి, రెండు సార్లు చూశాను. వాళ్ళగదికి వెళ్ళినప్పుడు కూడా అంతవరకూ చదువుతున్న బుక్ తలగడ కిందికి తోసెయ్యటమూ గమనించినా, చూడనట్టే ఊరుకున్నాను.

ఇప్పుడు కనిపించిన అతని రూపానికి అవి అన్నీ భాష్యాలలాగా తోస్తున్నాయి నెమ్మదిగా ఆలోచిస్తే.

'ఛీ! ఏమిటీమనిషి? పెళ్ళెందుకు చెసుకోకూడదు? ఏం, ఆ మాత్రం ఆడపిల్లే దొరకదా అతను చేసుకోదలిస్తే? ఎందుకీ కక్కుర్తి.

'ఏమైనా, ఇకనుంచి సుందరంతో చనువు తగ్గించడం మంచిదన్న నిర్ణయానికి వచ్చాను. అతనితోబాటు నన్నూ నాలుగు రకాలుగా అనుకుంటారు అందరూ, ఇంకా ఇదివరకటిలాగే మెసిలితే'— అనుకుంటూ స్టేషన్‌వైపు నడిచాను.

మర్నాడు ఆఫీసులో ఏమీ జరగనట్టే ప్రవర్తించాడు సుందరం. నేనొకవేళ అడిగినా బహుశః నేను చూసింది అతడిని కాదని దబాయిస్తాడేమో అనిపించింది. నేనసలేమీ అడగదల్చుకోలేదు కూడా.

* * *

మూడు, నాలుగు నెలలు గడిచాయి. నాకూ సుందరానికీ మధ్య దూరం ఏర్పడింది. నాతోనే కాదు, మిగతా ఎవ్వరితోనూ మునుపటిల్లాగా ఉత్సాహంగా వుండటం లేదతను. ముభావంగా వుంటున్నాడు. మనిషికూడా చిక్కిపోతున్నట్లు కనిపిస్తున్నాడు.

ఆరోజు ఉదయం మామూలుగానే ఆఫీసుకు వచ్చిన సుందరం, పన్నెండుగంటలు కావస్తుండగా నా దగ్గరకు వచ్చాడు.

"ఎందుకో పావుగంటనించీ గుండెలో నొప్పిగా వుందండీ" అన్నాడు.

ఆదుర్దాగా లేచాను నేను. ఆఫీసు డాక్టర్‌కు

ఆ పాపం నా మనసులో రేపిన మంటలు ఏ మందుకీ, ఏ సెక్సు పుస్తకాలకీ చల్లారలేదు. అందుకే అందుకే మొదటిసారిగా రాత్రి డబ్బుతో సుఖం కొనుక్కున్నాను. డబ్బుకి దొరికే సుఖంలో సహజత్వం ఎలా వుంటుంది? అందుకే, నేను మధ్యాహ్నం వెళ్ళేసరికి సిగ్గుపడుతూ ఆహ్వానించిన శివరాం, రాత్రి అలాటి అవస్థలోనే వున్న నన్ను పలకరిస్తే- సిగ్గుతో తలెత్తుకోలేక పారిపోయి వచ్చాను.

ఆ సిగ్గుకీ, ఈ సిగ్గుకీ ఎంత తేడా! స్వర్గానికీ, నరకానికీ వున్నంత తేడా!'

నా మనసు మొద్దుబారి నట్టయింది. కాసేపు ఆగి మిగతా పేజీలు తిరగేశాను.

'తాగుడు మరీ ఎక్కువయి పోతోంది. తాగందే ఆగలేకపోతున్నాను. ఆగి యెవర్ని ఉద్ధరింగాలి? నెలనెల కడుపు కట్టుకు దాస్తున్న డబ్బు అమ్మ పేరనే వుంది. అంతకన్న నేనేం చెయ్యలేను.

ఆరోగ్యంకూడా పూర్తిగా చెడిపోతోందని పిస్తోంది. ఇదివరకున్న హార్ట్ కంప్లయింట్కి ఇదీ తోడు అవుతోందా? కానియ్ .చావే త్వరగా రానియ్ ఐ వెల్కం డెత్ .'

చేతుల్లోంచి పుస్తకం జారిపోయింది.

* * *

తెలతెలవారే వేళకి సుందరం తల్లి, ఇద్దరు కూతుళ్ళతో వచ్చింది. వాళ్ళిద్దర్నీ చూసేసరికి నాకు కళ్ళు తిరిగినట్లయింది. ముమ్మూర్తులా సుందరంలాగే వున్నారు ఇద్దరూ!

సుందరం మరణవార్త చెప్పాక, వాళ్ళని ఓదార్చటం నా తరం కాలేదు.

నే చెయ్యగలిగిన సహాయంతా చేసి, ఆఫీస్లో సుందరానికి రావలసిందంతా ఇప్పించేశాక మరిక నాకేపనీ మిగల్లేదు. సుందరం ఆలోచనలు మాత్రం నా మనసులో శాశ్వతంగా మిగిలిపోయాయి. 

ఖాన చశాం. ఆయన వచ్చేలోగానె సుందరం అక్కడున్న ఓ కుర్చీలో లుంగలు చుట్టుకు కూలబడ్డాడు. డాక్టర్ వచ్చి చూసి, హడావిడిగా అంబులెన్స్ తెప్పించాడు. నేనూ వెంటవుండి సుందరాన్ని హాస్పిటల్‌కి తీసుకువెళ్ళాను. కానీ లాభం లేకపోయింది. గంటా, గంటన్నరసేపు మృత్యువుతో పోరాడి, ఓడిపోయి, వెళ్ళి పోయాడు సుందరం.

'హార్ట్ ఎన్లార్జయింద'న్నారు డాక్టర్లు.

ఏదయితేనేం సుందరం మరిలేడు. కళ్ళలో నీళ్ళు తిరిగాయి. కానీ, కర్తవ్యం నిర్వహించక తప్పదు. అతని జేబులోంచి, గది తాళంచెవులు తీసుకున్నాను. అతన్ని అయిస్ రూంలో భద్ర పరచమని రిక్వెస్టుచేసి, ఆటోలో అతని గదికి చేరుకున్నాను.

అతని గదిలోకి వెళుతూనే సుందరం ఇంటి అడ్రస్‌కోసం వెతికాను. అతనికి తండ్రిలేని విషయం ఇదివరకే తెలుసు నాకు. రాశంవేయని పెట్టెలో కొన్ని ఉత్తరాలు దొరికాయి. వాటిలో వాళ్ళమ్మగారి అడ్రస్ దొరికింది. పక్కనేవున్న టెలి గ్రాఫ్ ఆఫీసుకు వెళ్ళి, వాళ్ళమ్మ గారి పేర ఒక టెలిగ్రాం యిచ్చి, మళ్ళీ గదికి వచ్చాను.

నా శ్రీమతి సంసారాన్ని పెద్దది చేయటం కోసం పుట్టిం టికి వెళ్ళింది, కొద్ది రోజుల క్రితమే. అందుకె, ఇంట్లో నాకోసం యెదురు చూసే వాళ్ళెవరూలేరు. ఏ తెల్లవారుఝామునకో సుందరం తల్లి, ఊరినుంచివస్తే ఈ గదిలో నేనుండటం అత్యవసరం. అందుకే, ఈరాత్రికి యిక్కడే పడుకోవాలని నిశ్చయించుకున్నాను.

నీరసంగా అక్కడున్న మంచంమీద వాలి పోయాను. నిన్నటిదాకా దీనిమీదే పడుకున్న సుందరం ఇవాళ మరిలేడు. నా కళ్ళలో మళ్ళీ నీళ్ళు తిరిగాయి. అలాగే నిద్ర పట్టేసింది. దాదాపు రెండుగంటల తర్వాత మెలకువొచ్చింది. కళ్ళు తెరిస్తే గదంతా చీకటిగావుంది. లేచి, లైటు వేశాను. తొమ్మిది గంటలవుతోంది. మధ్యాహ్నంకూడా భోజనం చెయ్యలేదేమో, అంతటి విషాదంలోనూ కడుపులో ఆకలి దహి స్తోంది. ఓపిక తెచ్చుకొని బయటకి వెళ్ళి, పక్కనే వున్న రెస్టారెంట్‌లో నాలుగు సమోసాలు తిని, టీ తాగి, తిరిగి గదికి వచ్చాను.

మళ్ళీ మంచం మీద పడుకున్నాను. నిద్ర పట్టటం లేదు. శవం ఇక్కడ లేక పోయినా, సుందరం రూపం ఆ గదంతా నిండివున్నట్టే అనిపిస్తోంది. ఈ రాత్రికి 'శవజాగారం!' తప్పదనిపిం చింది. లేచి మంచం మీదే కూర్చున్నాను.



కాసేపు సుందరం గీసిన బొమ్మలు చూడాలని పించింది. అతని పెట్టె తెరిచి, మంచంమీద పెట్టుకున్నాను. బట్టలుతీసి పక్కన పెట్టగానే ఆ ఫయిలు కనిపించింది. చేతిలోకి తీసు కున్నాను. ఆశ్చర్యం—ఆ ఫయిలుక్రింద—ఓ కాబినెట్ సైజు ఫోటో—ఎవరో అందమయిన అమ్మాయిఫోటోవుంది! చేతిలోకి తీసుకున్నాను. మరీ ఆశ్చర్యం కలిగింది. అది ఫోటోకాదు. సుందరం వేసిన చిత్రం! దూరాన్నించి చూస్తే అచ్చం ఫోటోలాగే వుంది!

ఆ ఫోటోక్రింద 'ఊహాసుందరి' అని రాసి వుంది.

'ఎవరీ సుందరి? సుందరం కలంపేరు ఈ అమ్మాయిదేనా?'

నాలో ఉత్కంఠ చెలరేగింది. ఇంకా వివ రాల కోసం ఆ పెట్టె వెతికాను. గత రెండు సంవత్సరాల డైరీలు అందులో వున్నాయి. ఆత్రంగా వాటిని చేతిలోకి తీసుకున్నాను. గబ గబ పేజీలు తిరగేశాను. ఆపేజీ చుట్టూ నల్లటి బార్డర్! ఆగాను

'ఇవేళ-ఊహ పెళ్లి. ఆ ఊహే భయం కరం నాకు. ఇహ వాస్తవాన్ని యెలా యెదు ర్కోను?

దేవుడు నాకే మరుగుజ్జుతనాన్ని ప్రసాదించి నందుకు నాకెప్పుడూ బాధ కలగలేదు. కానీ, కానీ ఊహను పెళ్ళిచేసుకోగల అదృష్టం ఈ కారణం వల్లే చెయ్యి జారిపోయి నందుకు మాత్రం దేవుణ్ని నేను క్షమించలేను.

ప్రపంచంలో ప్రతి యువకుడూ యెవరో ఒకర్ని ప్రేమిస్తాడు. చాలామంది ఆ ప్రియు రాలికి దూరమూ అవుతారు. కానీ, వాళ్ళకి కనీసం ఆ విషాదం మిత్రుల్తో పంచుకునే అదృష్టమయినా మిగులుస్తాడు దేవుడు.

కానీ నేను నేను ఊహని ప్రేమించానని ఎవరితోనన్నా చెప్పినా — అదో జోక్‌లాగా తీసుకుని నా మొహమ్మీదే నవ్వుతారు తప్ప ఎవరర్థం చేసుకుంటారు? వికారం నా రూపా నికే గానీ, మనసుకి లేదనీ — నా మనసూ అందరి మనసుల్లాగే అన్నిరకాల అనుభూతు లకీ లోనవుతుందని ఎవరూహిస్తారు?'

'ఈపాటికి ఊహ మరొకరి సొత్తయిపోయి వుంటుంది. రాత్రే ఆ అమృత ఘడియలు గడిచిపోయి వుంటాయి.

రాత్రంతా నేనూ స్వర్గంలోనే గడిపాను. ఆ క్లబ్ వాతావరణంలో—చేదయినా, వగరయినా అది అమృతమే నిజంగా! ఈ మందు యెవరు కనిపెట్టారోగానీ, దానికయినా కనీసం మరు గుజ్జులమీద సానుభూతి వుండటం నా అదృష్టమే!'

నాకు గుర్తొచ్చింది — ఆ వెన్నెలరాత్రి తూలుతూ నడుస్తున్న సుందరం రూపం.

మరికొన్ని పేజీల తరవాత నాపేరు కని పించింది!

'శివరాం పెళ్లి! ఎందుకు నాకు బాధ? తప్పు. నా సంకుచితత్వం నాలోనే వుండిపోవాలి. అందుకే నా కాంప్లెక్స్ నాలోనే దాచుకొని, అతనికి హెల్ప్ చేస్తున్నాను.

నా పెళ్ళికి సాయం చేస్తాట! అమాయ కుడు. నా పెళ్ళంటే ఎలాగో అలా జరగచ్చు. మరి అక్కయ్య పెళ్లి? చెల్లాయి పెళ్లి? మరు గుజ్జు మగాడికి పెళ్లాం దొరికినంత తేలిగ్గా— చదువు, సంధ్యలేని మరుగుజ్జు యువతులకి వరులెక్కడ దొరుకుతారు? వాళ్ళకి దొరకని సుఖాలు నాకూ వద్దు '

నా మనసు కలిచినట్లయింది. 'సుందరం అక్కా, చెల్లెలూ కూడా మరుగుజ్జులా? అందు కేనా ఒకటి, రెండు సార్లు వాళ్ళక్కయ్య పెళ్లిగురించి ప్రస్తావించినా, ఏదో సంబంధం సూచించబోయినా ముభావంగా వూరుకున్నాడు?

మళ్ళీ పేజీలు తిరగేశాను. మరోపేజీచుట్టూ నల్ల బోర్డర్ కనబడింది.

'నాలో పతనం ప్రారంభమయ్యింది.

నిన్న మధ్యాహ్నం లంచ్‌లో శివరాం ఇంటికి వెళ్ళాను. అతని శ్రీమతి వచ్చిందట. అతను ఆఫీస్‌కు రాలేదు. ఆ విషయం నాకు తెలిస్తే వెళ్ళేవాణ్నికాను. తీరా వెళ్ళేసరికి వాళ్ళ ఏకాంత సౌఖ్యానికి భంగం కలిగించిన పాపం నాకు చుట్టుకుంది.




# కుటుంబ సంక్షేమము

"నేటి మహిళలు సంఘ సంక్షేమము, ఉద్యోగముల వ్యామోహములలో పడి తమ కుటుంబ సంక్షేమమును పట్టించుకొన కున్నారు" అంటూ ఒక ప్రతిపాదన చేశారు మా బావగారు ఆరోజు.

కారణం?

ఆరోజు మేము వాళ్ళింటికి వెళ్ళాం. వాళ్ళ అమ్మాయి ఐదో తరగతిలోవుంది. రిపోర్ట్ కార్డ్ తెచ్చింది. రెండు సబ్జెక్టులలో ఫెయిలయ్యింది. అది చూశాక మా బావగారు మా అక్కయ్య వైపు ఓరగాచూసి ఆ స్టేట్ మెంట్ ఇచ్చారు.

వెంటనే నాకు కోపం వచ్చింది

"మా అక్కయ్యకి తీరికవుండదు. మరి మీకు ఆఫీసులోనూ యెక్కువపని వుండదు. ఇంటికి వచ్చాక అంతా తీరికే. చిటికి మీరు హోంవర్కు చేయించి, చదువెందుకు చెప్ప కూడదూ!" అన్నాను.

"రేడియో రిపేర్ చేస్తాను. కారుకూడ చెయ్యగలను. కావాలంటే ఇంటికి సున్నాలు కూడా వేస్తాను కానీ పిల్లలకి చదువు చెప్పటం మాత్రం నావల్లకాదు" అనేశారు బావగారు నవ్వుతూ.

"ఊరుకోవే. నిన్ను రెచ్చగొట్టడం మీ బావ గారికి సరదా" అంది అక్కయ్య.

"అక్కయ్యని అంటున్నారు మీరు. ఏ సమితులకి వెళ్ళకుండా ఉద్యోగం చెయ్యకుండా వుంటే వాళ్ళ పిల్లలందరూ ఫస్టు వచ్చేస్తున్నారా? ఎవరూ ఫెయిలవటం లేదా?" అన్నాన్నేను.

"ఆయనన్న మాటలో కొంత నిజంలేక పోలేదు. వేళకి సరైన భోజనం వుండదు ఇంటికి వచ్చేటప్పటికి మూసిన తలుపులకి తాళం వేలాడుతుంటే" అన్నారు మావారు.

"పాపం, ఎంత కష్టపడిపోతున్నారు! తాళం వేలాడుతుంటే, డూప్లికేట్ తో తాళంతీసి లోపల ప్రవేశించి, మీ వెనకే వస్తున్న మీ అర్ధాంగికి స్వాగతం పలకండి" అన్నాను.

వాళ్ళు ముగ్గురూ నవ్వారు బలవంతంగానే నేమో!

అక్కయ్య ఎ ఐ డబ్ల్యూ లో కమిటీ మెంబర్.

నేను మా ఇంటికి దగ్గరగావున్న నర్సరీ స్కూల్లో టీచర్ని.

*　*　*

ఆడవాళ్ళు ఉద్యోగం చెయ్యటం, సంఘ సంక్షేమ కార్యక్రమాల్లో పాల్గొనటమూ వ్యామోహమా?

వ్యామోహం అంటే ఏమిటి?

ఒక విషయం, లేదా ఒకవ్యక్తి ఆకర్షణలో పడిపోయి ఏ ఇతర విషయాల్ని పట్టించుకోక పోవటం.

ధర్మరాజు జూదం ఆకర్షణలోపడి తమ్ముల్ని, భార్యని, రాజ్యాన్నీ కోల్పోయాడు.

హరిశ్చంద్రుడు సత్య వ్రతంలోపడి భార్యనీ కొడుకునీ అమ్మేశాడు. శ్రీరాముడు ధర్మాచరణకోసం ధర్మపత్నిని అడవికి పంపాడు. మన ఆదర్శ పురుషులందరూ ఏదో ఒక వ్యామో

'అరవింద'

హంతో భార్యకి, పిల్లలకి అన్యాయం చేసిన వాళ్ళలాగే కన్పిస్తారు.

కానీ అటువంటి స్త్రీలు కనిపించరు, సాధారణంగా. ఎక్కడో ఒక మీరాతప్ప. భక్తిలో పడి మీరా సంసారం వదిలేసింది.

అటువంటి స్త్రీలు ఎందుకు లేరు?

స్త్రీ వ్యక్తిత్వాన్ని మన సమాజం అణచి వెయ్యటమే కారణం.

ఐనా లబ్ధప్రతిష్ఠులైన మహిళలు చాలామంది అటు సంసారాన్నికూడా చక్కగా నిర్వహించిన వారే. సరోజినీ నాయుడు, రుద్రమదేవి, కస్తూరిబా

ఈనాడుకూడా ఉన్నత పదవులలో వుండి, సంసారంలో ఏలోటూ లేకుండా చూసుకునే మహిళలు చాలామంది వున్నారు. పత్రికల వాళ్ళు ఇంటర్వ్యూచేసి తెలుసుకున్న దేమిటి అంటే-ఉద్యోగాలు గృహజీవితానికి ఆటంకం కాదని, కుటుంబ సభ్యులు సహకరిస్తే,కేవలం ఇంటి పనులేగాక ఇతర కార్యక్రమాల్ని చేపట్టటం ఆ స్త్రీలకి చెప్పలేనంత తృప్తి నిస్తుందని. అటువంటి ప్రోత్సాహం వున్న కుటుంబ సభ్యుల మధ్య ప్రేమాభిమానాలు ఇంకా పెరుగుతాయని!

స్త్రీలు ఇతర వ్యామోహాల్లోపడి కుటుంబ సంక్షేమాన్ని నిర్లక్ష్యం చేయటం మనం అరుదుగా చూస్తాం. సాధారణంగా స్త్రీలు కుటుంబ భద్రతకి ఆటంకం కలిగిస్తుందని తోచినపుడు వెంటనే తమంతట తామే ఆ ఆసక్తులనుంచి విరమించు కుంటారు. అట్లాకాక నిజంగా నిర్లక్ష్యం చేస్తున్నారూ అంటే అది యేదో వ్యామోహంకాదు, ప్రాథమిక సంసారాల్లో సంసార జీవితంలో ఏదో అసంతృప్తి వుందన్న మాట. ఈనాటి మహిళలు అవసరం కోసం ఉద్యోగాలు చేస్తున్నారనేది, సాగినంత వరకే సంక్షేమ కార్యక్రమాల్లో పాల్గొంటున్నారనేది వాస్తవం. వ్యామోహంతో చేస్తున్నారనేది దురభిప్రాయం.

ఈనాటి ఆర్థిక పరిస్థితులనుబట్టి, సాంఘిక పరిస్థితుల్నిబట్టి స్త్రీలుకూడా ఉద్యోగాలు చేస్తున్నారు. సరదాకి చేసేవారు తక్కువ. అవసరానికి చేసేవారు యెక్కువ. చదువుకున్న అవివాహిత యువతి తలిదండ్రులకి భారంగా, బాధ్యతారహితంగా ఊరికే ఇంట్లో కూర్చోలేదు. తనని తను పోషించుకోవాలని కోరుకుంటుంది. కట్నాలు కారణంగా పెళ్ళిళ్ళుఆలస్యంకావటం, స్త్రీలు ఉద్యోగాలు చెయ్యటానికి ప్రోత్సాహ కారణం అవుతోంది. వివాహిత యువతులు సాధారణంగా ఉద్యోగం చెయ్యటానికి యిష్టపడరు. ఎందుకంటే మన అలవాట్ల ప్రకారం ఇంటి పనులన్నీ గృహిణే చెయ్యాలి. ఇంటి పనులన్నీ పూర్తిగాచేస్తూ ఉద్యోగంకూడ నిర్వహించటం చాలా కష్టం. కనుక యెంతో డబ్బు ఇబ్బంది వున్న స్త్రీలు, ఇంట్లో సదుపాయం వున్న స్త్రీలు మాత్రమే ఉద్యోగాలు చేస్తున్నారు. అన్ని సదుపాయాలూ వుండే మధ్యతరగతి మహిళల సంఖ్య తక్కువేకదా!

గృహిణి ఉద్యోగం చెయ్యటంవలన కొంత వరకూ ఇంటి పనులకి లోటు యేర్పడుతుంది నిజమే. కానీ లేచింది మొదలుకొని పడుకునే దాకా భార్య భర్తకి పేస్టు, తువ్వాలు, మంచి నీళ్ళు, దువ్వెన, బూట్లు అందించడం కోసం ఉద్యోగం మానుకోవటం, అభిరుచులు వదలుకోటం, ప్రయోజన వంతమైన కార్యక్రమాల్లో పాల్గొనటం నుండి విరమించుకోవటం హాస్యాస్పదం. 'కుటుంబ సంక్షేమం' అనే పదానికి హద్దు, పరిమితి ఏమిటి? ఎక్కడ?

ఇల్లాలు వెట్టిచాకిరీ చేస్తున్నా భర్త, పిల్లలూ కూర్చుని సేవ అందుకుంటారు కానీ వద్దనరు. ఇక్కడే పురుషులుగానీ స్త్రీలుగానీ హద్దుల్ని తెలుసుకోవాలి. బానిసత్వానికి, బాధ్యతలకీ తేడా తెలుసుకోవాలి. పురుషులు స్త్రీల జీవిత రంగంలో వస్తున్న మార్పుల్ని అర్థం చేసుకోవాలి. కుటుంబ శాంతికి సౌఖ్యానికి స్త్రీపురుషులిద్దరూ కారకులే. ఒకరిలో మార్పు వస్తే రెండవవారు మారక తప్పదు. పురుషులు తమ పనులన్నింటికి భార్యమీద ఆధారపడక, తమ పనులు తాము చేసుకుంటూ గృహిణికి కొంచెం తీరుబడి కల్పించటం తప్పుకాదు, చిన్నతనం

అంతకంటే కాదు. పిల్లల బాధ్యత పూర్తిగా ఇల్లాలిదే అనుకోకూడదు. స్త్రీ పురుషులు సమానులు అంటే ఇద్దరి బరువు, ఎత్తు, రంగు ఒకటే అనికాదు. స్త్రీకికూడా అవకాశాలు రావాలి. తన తెలివికి, సమర్థతకి తగిన జీవితాన్ని చేపట్టే అవకాశం రావాలి!

దానికి సంఘంయొక్క, కుటుంబంయొక్క సహకారం లభించాలి. ఈనాటి స్త్రీ వికాసవంతమైన జీవితం కోరుకుంటోంది. కేవలం యిల్లు దిద్దటం, పిల్లల్ని కని పెంచటంతో తృప్తిపడ లేదు. పిల్లల్ని ప్రయోజకులుగా చెయ్యాలని, తన వ్యక్తిత్వానికి మెరుగు దిద్దుకోవాలని, సాంఘిక బాధ్యతల్ని నెరవేర్చాలనికూడా కోరుకుంటోంది. ఇది ఆరోగ్యలక్షణమే గానీ భయపడవలసిన మార్పు యెంతమాత్రం కాదు.

కానీ స్త్రీలలో వస్తున్న ఈ ప్రగతి పరిణామాన్ని పురుషులు అర్థంచేసుకోక తామేదో పదవిని, సుఖాల్ని కోల్పోయామనుకొని స్త్రీ జాతిని అణచజూస్తేమాత్రం అది ప్రమాదానికి, అవాంఛనీయమైన సంఘటనలకి దారి తీస్తుందని మాత్రం చెప్పక తప్పదు.

మనోవికాసం పొందుతున్న స్త్రీ మరలాగ, బానిసలాగ బ్రతకలేదు. తానొక వ్యక్తిగా గుర్తింపబడక పోతే ప్రేమ, గౌరవం లభించక పోతే అది ఆత్మహత్యలకి, అశాంతికి దారి తీస్తుంది. ఈ కారణంగా గడచిన కాలమే బాగుంది అనుకోవటం మాత్రం మన అజ్ఞానాన్నీ, వెనకబడిన తనాన్నే చాటి చెపుతుంది. విజ్ఞానం గ్రహాంతరల్లోకి పెరుగుతున్న యీ కాలంలో చదువుకున్న స్త్రీనిచూసి భయపడటం కాక, మనోవికాసం పొందిన స్త్రీనుండి సంసారసుఖం పొందటం ఎట్లాగో యీనాటి పురుషుడు తెలుసుకోవాలి.

అవకాశం ఉన్నంతలో తన వ్యక్తిత్వానికి మెరుగుదిద్దుకుంటూ భర్త, పిల్లల అవసరాలు తీరుస్తూ సాంఘిక - కార్యకలాపాల్లో పాల్గొనగలటం సార్థకమ ఈనాటి స్త్రీకి! స్త్రీకి భర్త నుండి, కుటుంబ సభ్యులనుండి సహకారం లభించటం, మన సాంఘిక పురోభివృద్ధికి

మొదటి మెట్టు:

ఒక గృహిణికి ఉద్యోగం చేయాల్సిన అవసరం లేదనుకుందాం. పిల్లలు పెద్దవాళ్ళయిన కొద్దీ ఇదివరకుటంతగా పిల్లల్ని కనిపెట్టుకుని ఉండాల్సిన అవసరం వుండదు. పిల్లలు తల్లి మీద ఆధారపడటం తగ్గిపోతుంది. భర్త ఉద్యోగం కారణంగా, పిల్లలు చదువులు కారణంగా ఆ గృహిణి ఒంటరిగా మిగిలిపోతుంది. జీవితం ఖాళీ గ్లాసులా కనబడుతుంది. అప్పుడా గృహిణి ఏం చెయ్యాలి?

ఈనాటి సదుపాయాలవల్ల ఇంటిపని చూసుకున్నాక కూడా చాలా తీరికవేళ మిగిలిపోతుంది గృహిణికి. అటువంటి సమయాన్ని వృథా చేయక తన అభిరుచుల కనుగుణంగా గడుపుకోవటం తెలుసుకుని ఉండాలి గృహిణి. ఈ సమస్యకి సమాధానం "మహిళా సమితి." తనకి వచ్చిన విద్యలు ప్రదర్శించటానికి, కొత్త విషయాలు నేర్చుకోటానికి, ఉన్నంతలో దానధర్మాలు చెయ్యటానికి అవకాశాలు కావాలి. ఈ అవసరాలు తీర్చడానికి మహిళా సమితులు చక్కని కేంద్రాలు కాగలవు. అక్కడ జరిగేవన్నీ వృథా ప్రసంగాలు అనీ, గొప్పలు ప్రదర్శించుకోవటమే అక్కడి కార్యక్రమమనీ, మహిళా సమితుల్ని గురించిన నిందా వాక్యాలు మనం తరచూ వింటూవుంటాం. కానీ అది నిర్వహణ లోపం! అంతే!

సమర్థులయిన స్త్రీల దర్శకత్వం క్రింద పటిష్టంగా, మార్గదర్శకంగా సాగుతున్న మహిళా సమాజాలు మనం చూస్తూనే ఉన్నాం. శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్, మదర్ థెరెసాల అడుగు జాడల్లో నడచినా చాలు ఊరికొక మహిళా సమితిని తేలికగా నిర్వహించవచ్చు. మహిళా సమితిలో చేరిన మహిళ కుటుంబాన్ని నిర్లక్ష్యం చెయ్యనవసరం లేదు. తన తీరికవేళలు ప్రయోజనవంతంగా గడపడం కోసమే మహిళా సమితులు ఉద్దేశింపబడ్డాయి. వాటిని నిర్వహించేధారం ఇంకా తీరిక, శక్తి, సామర్థ్యాలు ఉన్న స్త్రీలు వహిస్తారు. మనం వేసే ప్రతి అడుగూ మార్పుకి కారణమౌతుందని

మరచిపోకూడదు: మార్పుకోసం ఉడతాభక్తిగా నయినా ప్రయత్నించటం మానకూడదు.

మనం ఇచ్చిన పిడికెడు బియ్యం వందల మందికి అన్నం పెట్టగలదని, మనం వేసే ఒక్కొక్క అడుగు ఒక కల్యాణమందిరాన్ని నిర్మించగలదని దినదిన ప్రవర్థమానమవుతున్న ఆల్ ఇండియా విమెన్స్ కాన్ఫరెన్స్ విభాగం చేసే కృషిచూస్తే అనిపిస్తుంది. మెంబర్స్ కోసం కుకింగ్ డిమాన్‌స్ట్రేషన్, ఫాషన్ పెరేడ్ వంటి కాలక్షేపపు కార్యక్రమాలు ఏర్పాటు చేస్తుంటారు. కానీ కమిటీ మెంబర్స్ బాధ్యత వహించి నిర్వహిస్తున్న ఫామిలీ ప్లానింగ్ సెంటర్, బ్లడ్ బ్యాంక్, స్కూళ్ళు, స్లమ్ ఏరియా సంస్కరణ, అనాథల పోషణ ద్వారా నిజమైన సాంఘిక సంక్షేమం జరుగుతుంటుంది.

ప్రతి మహిళకి సంఘసేవ చేయడానికి తీరికా ఓపికా లేకపోవచ్చు కానీ అటువంటి తీరిక, ఆసక్తి ఉన్న మహిళలకి సంఘసేవ చేయగల అవకాశాన్ని ఎ. ఐ. డబ్ల్యు. సి. కల్పిస్తోంది. ఈనాడు ఇటువంటి మహిళా సమాజాలు దేశవ్యాప్తంగా ప్రతి ఊరులోనూ ఉంటున్నాయి.

అవి సక్రమంగా నడిచేట్లు చూడటం సంస్కారవంతులైన మహిళల బాధ్యత. అవసరాన్ని బట్టి గవర్నమెంట్ యొక్క సాయం కూడా తీసుకోవాలి.

అటు మహిళాసమితికి చెందక, యిటు ఉద్యోగమూ చెయ్యక కబుర్లలో, క్లబ్బులలో, సినిమాలతో కాలక్షేపచేసే స్త్రీలు ఉంటారు. క్లబ్బులూ, సినిమా, కబుర్లూ వ్యామోహం అనటం సమర్థనీయమే కానీ తమ సంసారం కోసం ఉద్యోగం చేసేవారిని, తోటి స్త్రీలమీద సానుభూతితోనో, సత్కాలక్షేపం కోరుతూనో మహిళా సంఘాల్లో పాల్గొనేవారినీ వ్యామోహ పీడితులనటం సమర్థనీయం కాదు.

ఇక 'సంఘసేవ' అనేది ఈ ఆధునిక యుగంలో కనుగొన్న నూతన విషయమేమీ కాదు. సంఘజీవితం అనాదిగా వస్తోంది. మానవుడు సంఘజీవి. పూర్వకాలంలో నిర్వహించబడిన యజ్ఞయాగాదులు చాలామటుకు సామాజిక శ్రేయస్సునాశించి చేయబడిన సాంఘిక కార్యకలాపాలే. వీటన్నిటిలో స్త్రీలు పాల్గొనేవారు. అతిథి మర్యాదలకి భారతీయులది పెట్టింది పేరు. అతిధి దేవుడు అనడం ఆ మర్యాదకి హద్దులు లేవని తెలియజేస్తుంది. అప్పుడా బాధ్యతంతా గృహిణిదేకదా. ఆనాడు సంఘసేవ ఆ విధంగా జరిగింది. అది ఒక వ్యామోహంగా హద్దుమీరిపోయిన కేసులు కూడా మనకి తెలుసు. డొక్కా సీతమ్మకథలు తెలియని ఆంధ్రులు ఉండరు. ఈనాడు మన పిల్లలకి తెలియకపోవచ్చు. అర్థరాత్రి, అపరాత్రి అని లేకుండా అన్నార్తులకి గోదావరినది దాటివెళ్ళికూడా అన్నదానాలు చేసిందట ఆవిడ. భర్త డొక్కా జోగన్న ఆవిడకి సహకరించాడు. కొంతమందిలో మామూలుకంటె అధికంగా ఉండే దయాగుణమే ఇటువంటి పనులకి, సంఘసేవకి ప్రేరణ ఇస్తుంది.

కాలంతోబాటు ఈ సంఘసేవా విధానాలలో కూడా మార్పులు వచ్చాయి. మన కళ్ళెదుట కనిపించే అభాగ్యులేకాదు, ఈ ప్రపంచంలో ప్రతిచోట యెందరో అనాధలు, పతితలు, దారిద్ర్య సర్పదష్టులు ఉన్నారు. వీళ్ళకి దిక్కు యెవరు? ఉద్ధరించటం యెట్లాగ? అనే పరశ్రేయస్సు గూర్చిన చింతన అనాధాశ్రమాలు, సంక్షేమసంఘాల స్థాపనకి దారితీసింది. మొదటి ప్రపంచయుద్ధ ఫలితంగా యూరప్‌లో యెంతో మంది సైనికులు వికలాంగులయ్యారు. వారి సేవకి తన జీవితాన్ని నియోగించింది నైటింగేల్. ధనిక కుటుంబంలో పుట్టిన ఈ యువతిని పెళ్ళి చేసుకుందామని యెందరో యోగ్యులయిన యువకులు ఉవ్విళ్ళూరారు. అయినా ఆవిడ స్వసుఖాల్ని, సంపదల్ని నిరాకరించి నిస్వార్థంగా తన జీవితాన్ని సంఘసేవకి అర్పించింది. అది వ్యామోహమంటే, ఔను: జీవితాన్ని తరింపజేసేటటువంటి వ్యామోహం. అది అందరికీ సాధ్యంకాదు. ముఖ్యంగా వివాహితులకి బాధ్యతలుంటాయి. ఏ మనిషికైనా,



స్త్రీకైనా, పురుషుడికైనా బాధ్యతలు నిర్వహించటం ప్రథమ కర్తవ్యం.

బాధ్యతలు నిర్వహించగా ఇంకా తమ కాలాన్ని, ధనాన్నికూడా వెచ్చించగల మహిళలున్నారు. అటువంటి వారు ప్రయోజనరహితమైన కాలక్షేపాలలో, విలాసాలలో కాలం గడపడంకంటే, తమకంటె తక్కువ స్థితిలో దయనీయమైన సమస్యలలో చిక్కుకునివున్న సోదరీమణుల కోసం పాటుపడటం, చేయూతనివ్వాలని కోరుకోవటం ప్రోత్సహించ వలసిన విషయమేగాని, నిరసించి నిరోధించవలసిన అవసరం ఏమాత్రంలేదు!

ఉద్యోగం చేయటంద్వారా పురుషులు ఈ ప్రపంచంలో నిర్మాణ కార్యక్రమాన్ని, ఉత్పత్తి విధానాలని చేపట్టి నిర్వహిస్తున్నారు. ఈ ఉద్యోగ నిర్వహణలో వారికి సాంఘికావసరాలయిన సాంస్కృతిక విషయాల్ని, సంక్షేమ పథకాల్ని పరిశీలించి నిర్వహించేటందుకు తీరిక వుండదు. తీరిక, ఆసక్తివున్న మహిళలు ఈ కార్యక్రమాలు చేపట్టడం హర్షదాయకం కదా!

♦ ♦ ♦

తల్లి ఉద్యోగంచేస్తే పిల్లలు చెడిపోతారంటారు. అది నిజంకాదు. పిల్లలు ఇంకా సమర్థవంతంగా తయారవుతారు. రోజంతా తీరికవున్న గృహిణి వంట చెయ్యటానికి నాలుగు గంటలు పడుతుంది. అదే పనిని బయటకి వెళ్ళాల్సిన మహిళ ఒక గంటలో పూర్తిచేస్తుంది. పిల్లలకి భర్తకి కూడా తమ తమ పనులు చకచకా చేసుకోటం అలవాటవుతుంది.

పిల్లలకి బాధ్యతలు తెలుస్తాయి. బద్ధకం దూరమవుతుంది. తెలివి తేటలు శక్తి సామర్థ్యాలు ఉన్న తల్లిని పిల్లలు ఆరాధిస్తారు! వాళ్ళలో ఆత్మవిశ్వాసం, ఆత్మగౌరవం అధికమౌతాయి. ప్రతిరోజూ విందుభోజనం కావాలని భర్తలు కోరటం, ప్రతినెలా ఒక కొత్తచీర, బంగారు నగా కావాలని భార్య అలగటం వంటివే!

అట్లా కాకుండా అన్ని విషయాల్లో ఆరోగ్య సూత్రాల్ని పాటిస్తూ పరస్పరావగాహన సహకారాలతో పిల్లల్ని సక్రమంగా పెంచుకుంటూ బ్రతుకునే ఒక పండుగగా చేసుకోవడానికి మనం ప్రయత్నించాలి!

చెప్పటం మరచాను. మా అక్కయ్య కొడుక్కి ఎప్పుడూ ఫస్టు మార్కులే వస్తాయి!

□

# ప్రగతి పథంలో పారిశ్రామిక రథం

వివిధ రంగాలలో గణనీయమైన ప్రగతిని సాధించిన ఆంధ్ర ప్రదేశ్‌లో హైదరాబాదు నగరంలోనూ, పరిసరాల్లోనూ అనేక కేంద్ర ప్రభుత్వ పారిశ్రామిక సంస్థలను నెలకొల్పడంతో పారిశ్రామికాభివృద్ధికి చక్కని వాతావరణం ఏర్పడింది. 1956లో 43 కోట్ల రూపాయల పెట్టుబడితో మన రాష్ట్రంలో మధ్యతరహా, పెద్దతరహా పరిశ్రమలు మొత్తం 45 ఉన్నాయి. అలాంటిది ఇప్పుడు 620 కోట్ల రూపాయల పెట్టుబడితో 150 పరిశ్రమలు నిర్వహించబడుతున్నాయి. చిన్నతరహా పారిశ్రామిక రంగం సత్వరాభివృద్ధి చెందుతున్నది. రాష్ట్రంలోని వెనుకబడ్డ, గిరిజన ప్రాంతాలలో కొత్తగా పరిశ్రమలు నెలకొల్పదలచిన ప్రోత్సాహకులకు అనేక సదుపాయాలు ఆంధ్రప్రదేశ్‌లో కలుగజేస్తున్నారు. 1978-79లో పారిశ్రామిక రంగానికి 11.54 కోట్ల రూపాయలు కేటాయించారు.

అభివృద్ధి పథంలో మన పారిశ్రామిక రథం శరవేగంతో పరుగిడుతున్నది.

---

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధ శాఖ డైరెక్టరుచే ప్రకటితము.

2/77-78



జ్యోతి కథల పోటీలో ప్రత్యేక ప్రశంస పొందిన కథ :




ఆఫీసు అయిన తర్వాత "కోటి" దగ్గర బస్సెక్కి దోమల్‌గూడ చేరుకున్నాను. బస్ స్టాప్‌నుంచి ఇల్లు దగ్గిరే. ఆఫీసులో జరిగిన సంఘటనే పదేపదే గుర్తుకొస్తోంది. మా వింగ్‌కి వారం రోజుల కిందటే కొత్త డైరెక్టరొచ్చారు. ముప్ఫయికి నలభైకి మధ్య ఉంటుంది ఆయన వయస్సు. ప్రిమెచ్యూర్లీ బాల్డు. కాని ముఖంలో ఏదో ఆకర్షణ. ఎబవ్ ఎవరేజ్ హైట్, అందుకు తగ్గ లావు.

"కూర్చోండి" అని రావుగారు అంటే భుజాలచుట్టూ నిండుగా పైట సరుకుని కూర్చున్నాను. తల ఎత్తేసరికి ఆయన నన్నే పరీక్షగా చూడటం గమనించి కళ్ళుదించుకున్నాను.

"టేక్ డౌన్ ఎ లెటర్" ఆయన పలికిన తీరు ఆంగ్లభాషకే కొత్త అందాన్నిచ్చింది.

పూర్తిగా ఒకపేజీ వచ్చే వుత్తరాన్ని సుమారు ఐదు నిమిషాల్లో డిక్టేట్ చెయ్యడం పూర్తిచేశారు. ఆయనకు పూర్వం వుండే డైరెక్టరు ఇదే నిడివిగల ఉత్తరం డిక్టేట్ చెయ్యడానికి పావుగంట పట్టేది, రెండు మూడు సిగరెట్లు ఖర్చయ్యేవి.

ఉత్తరం టైపుచేస్తూ ఆ ఉత్తరంలోని అంశాలను గురించే ఆలోచిస్తున్నాను. ఎనిమిదేళ్ళ నుంచి 'టైపిస్టు' పోస్టులోనే వుంటూ స్టెనో వర్కు కూడా చేస్తున్నాను. ఈ ఎనిమిదేళ్ళలో ఇద్దరు డైరెక్టర్లు వచ్చారు, వెళ్ళారు. నా స్థితిలో మార్పురాలేదు. ఈయన వచ్చిన కొద్ది రోజులలోనే ఆఫీసు స్థితినంతా తెలుసుకొని రిపేరుకు నడుం కట్టారు. టైపిస్టు పోస్టుని స్టెనో టైపిస్టుగా కన్‌వర్ట్‌చేసి, ప్రస్తుతం ఆ పోస్టులో వున్న శ్రీమతి సరస్వతికి, అంటే నాకు, రెండు ఎడ్వాన్సు ఇంక్రిమెంట్సు ఇవ్వాలన్నది ఒక సిఫారసు. పాతికేళ్ళ సర్వీసు వుండి సూపర్నెంటుగానే రెండు మూడేళ్ళలో రిటైరవాల్సిన సోమనాథంగారి పోస్టును అసిస్టెంటు డైరెక్టరుగా కన్వర్ట్ చెయ్యాలన్నది రెండవ సిఫారసు. ఎడిషనల్‌గా రెండుయు.డి.సి. ఒక ఎల్. డి. సి. పోస్టుస్ క్రియేట్ చెయ్యాలన్నది మూడవ సిఫార్సు. ఈ సిఫార్సులతో డిపార్ట్‌మెంట్ సెక్రెట్రీకి వ్రాసిన డి.ఓ. లెటర్ అది. నేను ఉద్యోగంలో చేరిన తర్వాత ఇంత శ్రద్ధగా డైరెక్టరు డిక్టేటుచేసిన డి. ఒ. లెటర్ ఇదే.

లెటర్ టైపుచెయ్యడం పూర్తిచేసి నేనొకసారి చదివి తప్పులు కనిపించకపోయినా, సోమనాథంగారికి చూపించేను. అనుభవము, మంచితనం, సమర్థత వుండి ఆఫీసులో అందరికీ ప్రీతి పాత్రుడయిన ఆయన ఏ పేపరునైనా ఒ.కె. చేస్తే ఇంకెవ్వరూ ఆ పేపరులో తప్పు పట్టలేరు.

"వెల్‌డన్ అమ్మాయ్! మనకి మంచిరోజులొస్తున్నాయన్న మాట" అన్నారు నవ్వుతూ. ఉన్నదాంతో సంతృప్తి పడటమేకాని రానిదాని కోసం విచారించే తత్వం కాదాయనది.

ఉత్తరం చదివి సంతకంచేసి పైన "ఫర్ ఇమిడియట్ ఎటెన్షన్ అండ్ నెసెసరీ ఏక్షన్" అని వ్రాసి ఉత్తరంవున్న ఫయిల్ పాడ్‌ను నావంక జరిపారు.

"సెండ్ దిస్ థ్రూ ఎ స్పెషల్ మెసెంజర్. ప్లీజ్ టేక్ ఎవే దీజ్ సర్వీస్ రిజిష్టర్స్" ఫయిల్లోకి తలదూర్చుతూ రావుగారన్న మాటలు.

పువ్వుల దుకాణం దగ్గర ఆగి పావలా మల్లెపూలు, పదిపైసలు మరువం తీసుకున్నాను శ్రీవారి అభిరుచులను తలచుకుంటూ. నేను ఇంటికి వెళ్ళేసరికి చిన్నవాడు గుమ్మంలోనే ఎదురొచ్చాడు.

"మమ్మీ! నాన్నారికి ఆఫీసులో యేదో పార్టీ వుందట. స్కూలునుంచి మమ్మల్ని ఇంటికి దిగబెట్టి ఆఫీసుకు వెళ్ళారు. ఎనిమిదయే సరికి వచ్చేస్తామని చెప్పారు" నా చేతులు పుచ్చుకుంటూ అన్నాడు.

నిండా తొమ్మిదేళ్ళు లేకపోయినా పొడుగ్గా బొద్దుగా పన్నెండేళ్ళవాడిలా కనిపిస్తాడు. వాడి భుజంచుట్టూ చేతులువేసి లోపలికి వెళ్ళాను. హాలులో కాన్వెంట్ యూనిఫామ్సు మార్చుకోకుండానే చెరో పుస్తకం పుచ్చుకొని సోఫామీద చదువుతూ కూర్చుని ఉన్నారు పాప, పెద్దవాడు. పదకొండేళ్ళకే పాప నా అంత పొడుగుంది.

చదువులో ముందడుగే కానీ ఇల్లును హాస్టల్‌గా మాత్రమే చూడ గలిగే మనస్తత్వం దానిది. ఇంట్లో పని ముట్టుకోదు. పెద్దవాడు ఈ విషయంలో దానికి పూర్తిగా విరుద్ధం. అటు చదువులో శ్రద్ధ కనపరుస్తూనే, ఇటు ఇంటి పనిలో కూడా నాకు చాతనయిన సహాయం చేస్తాడు. వాడొక్కడి మీద ఇల్లు వదిలేసి వెళ్ళినా జాగ్రత్తగా చూసుకునే సామర్థ్యం పదమూడేళ్ళకే వచ్చేసింది వాడికి. పెద్ద కొడు

## రచయిత గురించి

కొత్తగా కథలు రాస్తున్న నాకు రచయితగా చెప్పుకునేందుకు పెద్ద విశేషాలేమీ లేవు. నా ప్రధాన వృత్తి అయిన 'ఎకనామిక్స్ బోధన' నుంచి కొంత రిలీఫ్ పొందేందుకూ, తిరిగి శక్తి పుంజుకొనేందుకూ పాస్టైమ్‌గా రచనను స్వీకరించాను. ఫొటో ప్రచురించబడటం నాకు ఎంబరాసింగ్‌గావుంటుంది.

—వి. ఎల్. ఆర్.

కులందరూ ఇంతేనేమో. వయసుకి మించిన బాధ్యతా భావం ఉంటుందేమో వాళ్ళకి.

"అమ్మా! తమ్ముడు స్కూల్లో షూస్ పారేసుకున్నాడు. వాడ్నేమీ అనకుండా మరో పెయిర్ కొనమ్మా" అన్నాడు జాలిగా మొహంపెట్టి.

వాడ్ని దెబ్బలాడకుండా ఉండటం కోసం వాడి తరపున వీడు వకాల్తా పుచ్చుకున్నాడన్న మాట. ఈ వెధవకి షూస్ పారేసుకున్నానన్న చింతే లేదు. వీడికి మాత్రం వాడంటే అంత శ్రద్ధ.

"ఎలా పోయాయిరా" అడిగేను.

"ఇంట్రవెల్‌లో షూస్ తీసి పక్కనపెట్టి స్నేహితులలో ఆడుకుందికి వెళ్ళేడుట. తిరిగి వచ్చి చూస్తే అవిలేవు" అన్నాడు.

నెలక్రితమే పాతిక రూపాయలు పెట్టికొన్న జోళ్లు. నాలుగు నెలలకన్న వాడి దగ్గర షూస్ మన్నవు. ఇంక పారెయ్యడం కూడ మొద లెడితే .

"సరే! నాన్నగార్కి చెప్పి మరో జత కొని పెస్తాను కాని, వాళ్లిద్దర్ని పిలు. బోర్నవిటా తాగి ఆడుకుందికి వెళ్తరు కాని" అన్నాను, మధ్య తరగతి జీవితంలోని సమస్యల్ని గురించి ఆలోచిస్తూ.

ఈ ముగ్గురి స్కూలు ఫీజు, ఇతర అవసరాలు, ఆటో ఛార్జిలకే నా జీతం సరిపోతుంది. ఆయన జీతంలో కోతలు పోగా మిగిలింది మధ్య తరగతి విలువలకు తలఒగ్గుతూసంసారం ఈడ్చడానికి చాటాబొటిగా సరిపోతుంది. కొత్త అవసరాల్ని సృష్టిస్తున్న ఆర్థిక వ్యవస్థ అందరికీ అందుకు తగినట్టు ఆదాయాన్ని పెంచడం లేదు.

స్టవ్ మీద కుక్కర్ పెట్టి, హాలులో కొచ్చి ఏ. జె. క్రోనిన్ "ది జూడాస్ట్రీ" నవల చదువుతూ కూర్చున్నాను.

"హాయ్ లేడీ!" అంటూ ఆయన నా చెయ్యందుకుని వేళ్లు రాస్తూ ఉండేసరికి నవలలో "మేరీ" గురించి ఆలోచిస్తూ నిద్రలో కొరిగిన నాకు తెలివొచ్చింది.

"సరసూ! ఈ ఉద్యోగం మానేసి హాయిగా ఇంట్లోనే ఉండి నన్ను, పిల్లల్ని చూసుకుందూ. ఈ అలసట నిద్రలకి స్వస్తి చెప్పొచ్చు" ఆప్యాయంగా అన్నారు, నా అరచేతిని తన ముఖంమీదికి తీసుకుంటూ.

"మీ చిన్న దొరగారు జోడు పారేసుకున్నాడట. నోరు మెదపకుండా కొత్తవి కొనమని మీ పెద్దనానిగారి రికమండేషన్" నవ్వుతూ అన్నాను.

"పోనిద్దూ! మనసు పారేసుకుని మగువకి గులామ్ అయే ముందు మగాడు పారేసుకునేవి చాలా ఉంటాయి" నన్ను దగ్గరకు తీసుకుని నా భుజంమీద తలపెట్టి నాతలలోని మల్లెల నాఘ్రాణిస్తూ నామెడ వెనక తన పెదవులతో గిలిపెడుతూ అన్నారు శ్రీవారు.

"మీకు మల్లెల సువాసన, నాకు మీచొక్కా " అన్నాను, ఆయన్ని మృదువుగా ముందుకు నెడుతూ.

ముఖం చిన్నబుచ్చుకుని వెంటనే నిజం గ్రహించి చిరునవ్వుతో నా భుజం తడుతూ బట్టలు మార్చుకుందికి ఇంట్లోకి నడిచారు.

పిల్లలకి వడ్డించి వాళ్ళు భోజనం చేసిన తర్వాత వంటింట్లోంచి బయటపడ్డాను.

స్నానంచేసి లుంగీ, బనియను వేసుకుని బెడ్ రూంలో వాలుకుర్చీలో ధ్యానముద్రలో ఉన్నారు శ్రీవారు. ప్రతి రాత్రి భోజనానికి ముందు తొంభై ఎమ్ఎల్ మేరకు 'బ్లాక్ నైట్' విస్కీ ఆయన ధ్యానానికి ఆధారం. పదేళ్ళ క్రిందట హైదరాబాదు వచ్చిన దగ్గర్నుంచి ఆయన కయిన అలవాటది. ఆయన అలవాట్లను విమర్శించకుండా సర్దుకుపోవడం నేను చేసుకొన్న అలవాటు. చూపుడు వేలుకు సగభాగంవరకూ విస్కీ గ్లాసులోపోసి గ్లాసునిండే వరకూ నీళ్లు పోస్తారు. ఆ గ్లాసును పూర్తి చేయడానికి సుమారు అరగంట పడుతుంది. అదే ఆపరేషన్ మరోసారి రిపీట్ చేస్తారు. తొమ్మిదిన్నర, పది అయేసరికి భోజనానికి లేస్తారు. పిల్లల భోజనానికి, శ్రీవారి భోజనానికి మధ్య కాలంలో నాకు తోచినప్పుడు నేను భోంచేస్తాను. ఆఫీసు విషయాలో, నేను చదివిన నవల గురించో మాట్లాడుతూ ఆయనకి కంపెనీ ఇస్తాను. "ది జూడాస్ ట్రీ" నవల గురించి చెప్తున్నాను.

"సరూ! ఈ అలవాటుని దానిసనయిన నన్ను చూస్తే నీకు కోపం రావడంలేదూ?" నా కథ కడ్డొస్తూ సీరియస్‌గా అన్నారు.

ఎన్నడూ లేనిది ఇన్నేళ్ళ తర్వాత ఆయన ఈ ప్రశ్న వేయడం ఆశ్చర్యం వేసింది. ఒకరి అలవాట్ల నరికట్టడానికి మరొకరు పూనుకోవడం అవివేకమని నా అభిప్రాయం.

"మీకు అందులో ఏదో సుఖమో, ఆనందమో, తృప్తో ఉండి త్రాగుతున్నారు. మీ అలవాటును ప్రశ్నించడం మీ వ్యక్తిత్వాన్ని ప్రశ్నించడమే. వ్యక్తిత్వంలేని వ్యక్తిని నా భర్తగా ఊహించలేను" లైటర్ వీన్‌లో గంభీరతనటిస్తూ అన్నాను.

"ఇది దురలవాటు కాదంటావా?" ఆశ్చర్యంగా కళ్లు పెద్దవి చేస్తూ అడిగారు.

"అతి సర్వత్ర వర్జయేత్ అన్నారు. మితంగా ఉన్నంతవరకూ ఏ అలవాటు దురలవాటు అవదు" అన్నాను మొండిగా.

"మితంగా వ్యభిచరించడం కూడ తప్పు కాదంటావు" వాదనలో ఓడిపోవడం ఇష్టంలేని ఉడుకు మోత్తనం తొంగిచూసింది ఆయన మాటల్లో.

ఇక ఈ ధోరణిలో సంభాషణ సాగించడం మంచిది కాదనిపించింది.

"మీ మొదటి ప్రశ్నకు వద్దాం. ఇన్నాళ్ళు లేంది మీ త్రాగుడు గురించి ఆలోచన ఈవేళెందు కొచ్చింది" అన్నాను మాట మారుస్తూ.

"ఏంలేదు! పిల్లలు పెద్ద వాళ్ళవుతున్నారు. ఖర్చులు పెరుగుతున్నాయి. అనవసరపు ఖర్చులు తగ్గించు కోవడం మంచిదేమో అని" కళ్ళుమూసుకొని ఆలోచిస్తూ అన్నారు.

ఆయన ఏం చేసినా నిబ్బరంగా ఉండటానికి కారణం ఇదే. సెల్ఫ్ ఇంట్రాస్పెక్షన్ చేసుకొని తన్నుతాను సరిదిద్దుకొనే సమర్థత ఉన్న వ్యక్తి ఆయన. బాధ్యతలు మరచి పోనివ్వని వ్యక్తిత్వం ఆయనది. అవే మా స్థిరాస్థి.

"అంతేనా లేకపోతే మీ ఖర్చులు తగ్గించుకొని నన్ను ఉద్యోగం మానేయమందామనా?" ఆఫీసునుంచి వచ్చిన తర్వాత ఆయనన్న మాటలు గుర్తుకు తెచ్చుకొంటూ నా తలని ఆయన ఒళ్ళోకి చేరుస్తూ అన్నాను.

ఆయన నా తలరాస్తూ కొంతసేపు మాట్లాడలేదు. రెండు చేతుల్తో నా ముఖం ఎత్తి నాకళ్ళల్లోకి చూస్తూ——

"నీ అందుబాటు నాకు కొంచెంగా ఉన్నప్పుడే మన ప్రేమ నిత్యనూతనంగా ఉంటుంది. నిన్ను ఉద్యోగానికి పంపిస్తున్నది నీ ఆర్జన కోసం మాత్రమే కాదు. జీవితం అనుభవాల సముదాయం. ఆ అనుభవాల సంచయనంలో పురుషుడికి ఎంత స్వేచ్ఛ అవసరమో స్త్రీకి కూడ అంతే స్వేచ్ఛ అవసరం. అందుకే నిన్ను వంటింటికి, పడకటింటికి మాత్రమే అంకితం చేయకుండా ఆఫీసుకు పంపుతున్నాను" అన్నారు.

ఇందాకటి నా అహంకారపు సమాధానాలకు రిటార్టా అన్నట్లుంది ఆయన చిన్న సైజు ఉపన్యాసం.

"దిస్ ఈజ్ ది లాస్ట్ బాటిల్ ఫర్ మి టు




కిల్" నిర్ణయానికి వచ్చిన వ్యక్తిలా బాటిల్ బీరువాలో పెట్టి భోజనానికి లేచారు. విశాలమైన నుదురున్న ఆయన ముఖంలో ఏదో కాంతి స్పష్టంగా కనిపించింది. తనకు తానుగా తీసు కొన్న మంచి నిర్ణయం వలన కలిగిన ఆనం దానికి నాకాళ్లు వణుకుతూ ఉంటే ఆయన వెంట వంటింట్లోకి నడిచాను.

మరునాడు ఆఫీసులో కొత్తఅనుభవం ఎదు రయింది. ఆఫీసు టైములో మూడునాల్గుసార్లు డైరెక్టర్ రావుగారి గదిలోకి వెళ్ళాను. ప్రతీ సారి ఆయన చూపులు నా శరీరాన్నంతా తడుముతున్నట్టే అనిపించింది. ముగ్గురు పిల్లల్ని కని నడివయస్సులోకి జారుకొంటున్న నా స్త్రీత్వం విపరీతంగా సిగ్గుపడింది. ఇప్పుడు కూడ పరాయి మగాణ్ణి ఆకర్షించే రూపం నాకున్నందుకు నా మనసు గర్వంతో పొంగింది. పరస్పరం విరుద్ధంగా ఉన్న ఈ ఆలోచనలతో బస్‌స్టాప్‌నుండి ఇంటికి రావడం రిక్షేప్స ల సాయంతోనే జరిగిపోయింది. పిల్లల సంగతి చూసిన తర్వాత పోస్టులో వచ్చిన ఉత్తరాలు చూశాను. నా పేరుతో ఒక ఉత్తరం ఉంది. రమాదేవి దస్తూరి. కవరు విప్పాను.

డియర్ సరసూ'

రెండునెలల క్రిందట విశాఖనుంచి వ్రాసిన వుత్తరానికి నీనుంచి సమాధానమేమీలేదు. నీలా కాపురం చేస్తున్న దానినే, నాకున్న తీరిక ఓపిక నీ కెందుకులేవే? లేకీ బమ్. మావారికి ట్రాన్స్ఫరయి ఈ ఊరొచ్చేం.ఇక్కడకువచ్చిన కొద్ది రోజులకే తెలిసింది, మన క్లాస్‌మేట్ వెంకటరమణ గురించి. గుర్తుందా? ఎర్రగా, పొడుగ్గా సన్నగా ఉండేవాడు. ఇవాంజలికల్ ఫేస్. క్లాసవుతున్నంతసేపు అతన్ని చూస్తూనే గడపేసేదాన్ని. క్లాసులో అతను వేసిన ప్రశ్నలు ఇప్పటికీ గుర్తున్నాయ్. చదువులో చురుకు దనం. ఆటల్లో తప్ప మిగతా అన్ని ఏక్టివి టీస్‌లో పాల్గొని బహుమతులు కొట్టేసేవాడు. కోరి పలకరిస్తే రెండు మూడు 'ఊ' 'ఆ' లతో పొడిపొడి మాటలతో సంభాషణముగించి జారుకునేవాడు. నాలోనే నా ప్రేమ ఉండి పోయింది. యూనివర్సిటీలో హాయిగా గడిపిన ఆరోజులు కాలగర్భంలో కలిసిపోయాయి. అతని రూపం, వేదికమీద ఉద్రేకంగా మాట్లాడుతున్నప్పుడు ఎర్రపడి చూడ ముచ్చ టగా ఉండే అతని ముఖం నా మనసులో నిలిచి పోయాయి. ఇంతా ఎందుకు వ్రాస్తున్నానంటే పన్నెండేళ్ళ తర్వాత మళ్ళీ రమణ గురించిన

వివరాలు తెలిశాయి.

మా ఇంటి ప్రక్క వాళ్ళకి దగ్గర చుట్టం అతను. ఈ మధ్యే వచ్చి వెళ్ళాడు. మనిషి రూపం పూర్తిగా మారిపోయింది. అతనువెళ్ళిన తర్వాత పక్కావిడ అతని గురించి వివరాలు చెప్పింది. గవర్నమెంటులో ప్రస్తుతం పెద్ద ఉద్యోగమేనట. ప్రేమించి పెళ్ళి చేసుకొన్నా డట. పెళ్ళయిన నాలుగేళ్ళకే ఇద్దరు పిల్లల్ని (ఒక బాబు, ఒక పాప) తనకు గుర్తుగా వది లేసి భార్య చనిపోయింది. ఆ షాకుతో మనిషి మళ్ళీ ప్రజల్లో పడతాడా ఎప్పటికైనా అన్నం తగా మారిపోయాడట. విపరీతంగా త్రాగుడు కలవాటు పడ్డాడు. అతను త్రాగకుండా ఉండ నిది ఆఫీసులో గడిపే కొన్ని గంటలు మాత్రమే. కొన్నాళ్ళ తర్వాత ఆ పిల్లల కోసం అన్నట్టు మామూలు మనిషయేడట. మట్టాలు ఎంత చెప్పినా మళ్ళీ పెళ్ళి కంగీకరించలేదుట. ఈ మధ్యే గుంటూరునుంచి హైదరాబాద్‌కు ట్రాన్స్ఫరయిందట.

ఒకటి రెండుసార్లు ఇక్కడ అతన్ని చూసి నందుకే నా మనసు సంతోషంతో నిండి పోయింది. నాకు గుర్తున్న రూపం కాక పోయినా, ఆ ముఖంలో దైవత్వం మాసి పోలేదు.

తొలి ప్రేమ మధురమైనదేకాదు. మరువ లేని దనిపిస్తుంది. పెళ్ళి పలకరించే ధైర్యం లేకపోయింది. నాది మూగ ప్రేమగానే మిగిలి పోయింది.

ఈ నా ప్రేమ కబుర్లతో కొన్నేళ్ళ తర్వాత మళ్ళీ నిన్ను బోరు కొడుతున్నానని నవ్వు కొంటున్నావు కదూ! అవునులే ఇలాంటి మధుర భావాలు నీలాంటి మొద్దులకేం బోధపడ తాయి! పిల్లలు తలుపు తడ్తున్నారు. ఉంటాను.

నీ —రమ

ఉత్తరం చదివి నిజంగానే నవ్వుకున్నాను. దాని పోరు పడలేక ఎప్పుడో ఒకసారి చూసి నట్టు గుర్తు దాని ప్రియుణ్ణి. చాలా మామూలు రూపం. రోజు కొకసారైనా అతన్ని తల్చు కొని అతని కబుర్లతో నన్ను విసిగించేది. భావుకతలో నిండిన రమ నే నెన్నటికీ మరచి పోలేని మంచి స్నేహితురాలు. కలల్లో విహ రించే అమాయకురాలు.

"ఏవిటీ! దేవిగారి కేమైనా ప్రేమలేఖ వచ్చిందా. ఉత్తరం తొడ మీదుంచుకొని ఆలో చనలో పడ్డారు."

మావారి మాటల్తో ప్రస్తుతానికి వచ్చాను. ఆఫీసులో "చూపులు" గుర్తుకొచ్చాయి.

"ఏవండీ! ఒక మగాడు ఒక స్త్రీని గుచ్చి గుచ్చి చూస్తే అర్థం ఏమిటండీ" టాపిక్ సీరియస్‌దైనా హాస్య ధోరణిలో సంభాషణ ప్రారంభించాను.

"ఏముంది. ఆ స్త్రీ అందమైనదైనా అయుం డాలి, లేదా ఆశ్చర్యాన్ని కలిగించే కురూపైనా అయ్యుండాలి" షూలేసెస్ విప్పుతూ అన్నారు.

"ఆ స్త్రీ మీ ఆవిడే అయి, ఆ పురుషుడు ఆమె బాసయితే?" డైరక్టుగా విషయాని కొచ్చాను.

"నిన్ను ఉద్యోగం మానేయమని, ఇంటికే అంకిత మవమని శాసించను. మీ బాస్ టేస్టుని మెచ్చుకొంటాను." బట్టలు మార్చు కుందికి గదిలోకి వెళ్తూ అన్నారు.

ఆయన విశాల హృదయానికి, నేనంటే ఆయనకున్న నమ్మకానికి ఆశ్చర్యపోయాను. సంతోషంతో కూడిన గర్వంతో నా మనసు నిండిపోయింది. అలవిమాలిన ప్రేమ వున్న చోటే అనుమానం ఉంటుందంటారు. ఆయనకి నేనంటే అనుమానం కలిగేంత ప్రేమలేదా? అసలు ప్రేమంటే? రమ దగ్గర ఉంటే ఎంత బాగుండేది. ఈ ప్రశ్నలకు సంతృప్తికరమైన సమాధానాలు చెప్పేది. దానికీ విషయాలు బాగా తెల్సు.

బట్టలు మార్చుకొని వచ్చి ఇంకా హాలులో సోఫాలోనే స్తబ్దంగా కూర్చున్న నన్నుచూసి—

"ఏవిటీ సరసూ! యూ ఆర్ బికమింగ్ బిట్టరీ! ఏం జరిగింది? మీ ఆఫీసర్ నిన్ను పదే పదే ఆశగా చూశాడు. ముగ్గురు పిల్లల్ని కన్నా, పెళ్ళి కెదిగొచ్చిన కన్యలా ఉన్న నిన్ను ఏ మగాడు చూడడు? చూసి గుటకలు

వెయ్యడు? ఇన్నాళ్ళు నువ్వు అబ్జర్వ్ చెయ్యలేదు అంతే. అందమైన వస్తువుల్ని, ప్రకృతిలోని సొగసుల్ని చూసి ఆనందించడానికే కళ్ళున్నది మనకు. 'పరస్త్రీని కన్నెత్తి చూడకు', 'పరపురుషుడి నీడ కూడ నీమీద పడనీయకు' లాంటి అసహజ నియమాల్ని మనకు నూరిపోసి జీవితంలో ఎంతో థ్రిల్‌ని పోగొట్టుకొనేట్టు జేశారు మన పూర్వీకులు. మన సంస్కృతి అంతే అనను కాని, స్త్రీ పురుష సంబంధాల విషయంలో మాత్రం మనవాళ్ళ నియమాలకు ఆధారం భయం, అనుమానం."

ఆయన మాటలు ఆశ్చర్యంగా వింటూ కూర్చున్నాను. ఆయన స్వభావంలో ఇన్నాళ్లు నాకు తెలియని డైమన్షన్ ఉన్న సంగతి ఇప్పుడు తెలిసింది. నా అదృష్టానికి పొంగిపోయాను. ఆ విషయం అక్కడితో ఆపేశాను.

ఆఫీసులో రావుగారి చూపులు నాలో సిగ్గుని భయాన్ని కలిగించలేదు. చొరవగా స్నేహంగానే "మూవ్" అవుతున్నాను. ఆయన కూడ అవసరం మేరకు తప్ప అనవసరంగా నన్ను తన గదిలోకి రప్పించుకోవడంలేదు.

అర్జంటు పేపర్లు టైపు చెయ్యడం పూర్తి కాక ఆరు గంటలవరకూ ఆఫీసులోనే ఉండిపోయాను. ప్యూన్, డైరెక్టర్, నేనే ఆఫీసులో ఉన్నది. టైపుచేసిన కాగితాలు సంతకం జేయడానికి రావుగారు ఆఫీసులోనే ఉండాల్సి వచ్చింది. టైపు చేయడం పూర్తిచేసి ఫైల్సు పుచ్చుకొని సంతకాల కోసం ఆయన గదిలోకి వెళ్ళాను. కళ్ళు మూసుకొని కుర్చీలో వెనక్కివాలి ఉన్నారాయన.

"సర్" అన్న నా పిలుపుకి కళ్లు తెరిచారు. నన్ను అదే పనిగా కొన్ని క్షణాలు చూశారు. కొత్త పోయిన నేను కూడ సూటిగా ఆయన వైపు చూసేసరికి కళ్ళుదించుకొని ఫైల్సు దగ్గరకు తీసుకొన్నారు. ఆ గదిలో ఒంటరిగా ఆయన కెదురుగా నేను. మూసిఉన్నతలుపులు. నా గుండెల శబ్దం నా గొంతులో వినిపిస్తోంది. రక్తమంతా నా ముఖంలోకి వచ్చినంతగా చెవుల్లోంచి వేడి గాడ్పులు. ఏదో తెలియని భయం ఆతృత, ఉత్కంఠ, అనుమానం నాలో చోటు చేసుకొన్నాయి. నిటారుగా నిలబడలేక కుర్చీని ఆసరాగా చేసుకొని నిల్చున్నాను.

"సారీ ఫర్ హోల్డింగ్ యు అప్ ఏఫ్టర్ ఆఫీస్ టైమ్.థ్యాంక్యూ, యు కెన్ గో నవ్" అన్నారు.

గదిలోంచి బయటపడి నిండుగా ఊపిరి పీల్చుకొన్నాను. ఆధారంలేని నా భయాలకి నాలో నేనే నవ్వుకొన్నాను.

ఆ రాత్రి శ్రీవారి గుండెలమీద తలపెట్టుకొని ఆయన భుజాల్ని రాస్తూ జరిగింది వివరంగా చెప్పాను.

"యూ ఆర్ స్టిల్ టూ గర్లిష్. నీలో

---

(వి) చిత్ర విజ్ఞానం



జిరాఫీల నివాసస్థలం ఉత్తర దక్షిణాఫ్రికాలలోని అడవులు. వీటి సంఖ్య ప్రస్తుతం బాగా తగ్గిపోయి, ఇవి అతి త్వరలో విలుప్తం చెందే సూచనలున్నాయి. జిరాఫీల ముఖ్య శత్రువులు సింహం, చిరుతపులి, మొసలి. జిరాఫీలు ఎప్పుడు గుంపులు గుంపులుగా సంచరిస్తాయి. మగ జిరాఫీలు సుమారు 19 అడుగుల పొడవుకు ఎదగగలవు. అప్పుడే పుట్టిన జిరాఫీపిల్ల సుమారు 6 అడుగుల పొడుగుతో 120 పౌనుల బరువు కలిగివుంటుంది. ఆఫ్రికాలో కెన్యా—ఉగాండాల మధ్య రైలుమార్గం నిర్మించినపుడు యీ మృగాలు టెలిగ్రాఫ్ తీగలను తెంపివేసేవట! వీటి బారినుండి వైర్లను కాపాడ్డానికి వాటిని 25 అడుగుల ఎత్తున వుంచారు!

ప్రామినెంటుగా ఉండే స్త్రీత్వం నీ లోకజ్ఞానపు గొంతు నొక్కుతోంది. లెర్న్ ఇట్ యువర్ సెల్ఫ్ డిహార్డెస్టిపే" అన్నారు నన్ను ఇంకా దగ్గరికి తీసుకొంటూ.

నాకు, సోమనాధంగారికి ప్రమోషనార్డర్సు వచ్చాయి. మేము స్వయంగా రావుగార్ని కలసి మేమివ్వబోయే పార్టీ గురించి చెప్పాం. ఆయన్ని ముఖ్య అతిధిగా ఆహ్వానించాం.

"మంచి జరిగినపుడు సంతోషించడం, చెడు జరిగినప్పుడు దుఃఖించడం మనం నిత్యం అనుభవించే ఇమోషన్సు. మంచి జరిగినపుడు సెలబ్రేట్ చేసుకోవడం, చెడు జరిగినపుడు క్రుంగిపోవడం మన అల్పత్వానికి బాహ్య స్వరూపాన్నివ్వటమే అవుతుంది. న్యాయంగా మీకు ఎప్పుడో జరగాల్సిన మంచి ఇప్పుడు జరిగింది. మీ ఇష్టాన్ని నేను కాదనను. మిగతా స్టాఫ్‌లో మీరు సెలబ్రేట్ చేసుకోండి. నలుగురిలో కలిసి సరదాగా గడిపే అదృష్టాన్ని నే నెప్పుడో కోల్పోయాను. పార్టీలంటే నాకు కిట్టదు. ఐ లూజ్ మై సెల్ఫ్ ఇన్ ఎ క్రౌడ్ ! ఆఖరి వాక్యాలు చెప్తున్నప్పుడు ఆయన గొంతులో ఆవేదన స్పష్టంగా తెలుస్తోంది.

మరునాడు ఆఫీసుకి వెళ్ళేసరికి ఎందుకో అంతటా కదలిక లేకుండా నిశ్శబ్దంగా వారి వారి సీట్ల కతుక్కుపోయారు. నా సీటు దగ్గరికి వెళ్లేసరికి టేబిల్‌మీద ఒక కాగితం ఉంది. చదివాను.

"ఐ ఎంజాయ్డ్ వర్కింగ్ విత్ యూ ది పాస్టుఫ్యూ మంత్స్. గుడ్ లక్ ఎంచ్ గుడ్ బై" రావుగారి చేతి వ్రాత అది.

"అందరికీ అదే ఉత్తరం తల్లీ. ఆ మంచి మనిషి మెరుపులా క్షణకాలం మెరిసి మనకు మంచిచేసి కోరి ట్రాన్స్ఫర్ చేయించుకొని ఢిల్లీకి వెళ్ళిపోయారు. ఇదిగో ఆయన ట్రాన్స్ఫర్ ఆర్డర్సు కాపీ. కొత్త డైరెక్టర్ వచ్చేవరకూ ఇన్‌చార్జిని నేనే" అన్నారు సోమనాధంగారు ట్రాన్స్ఫరార్డరు కాపీని నాకు చూపిస్తూ.

ఎవరో అప్తుడు దూరమయినట్లుగా బాధ గలిగించింది నాకు.

"సరస్వతీ ఈ ట్రాన్స్ఫర్ కన్నా వింతైన విషయం. ఆయన్ను రోజుకు మూడు నాల్గు సార్లయిన చూస్తూ ఉండే దానివి. ఆయన విపరీతంగా త్రాగుతాడంటే నమ్ముతావా?" ఆయనే అన్నారు.

నేనేం అనలేదు. విస్తుపోతూ టేబిల్ నానుకొని నిల్చున్నాను.

"ప్యూన్ కనకారావు ఇల్లు సర్దుతూ ఉంటే స్టోరు రూములో ఖాళీ విస్కీ సీసాలు దండిగా ఉన్నాయట."

దూరంగా తలవంచుకొని నిల్చున్న కనకారావు వైపు చూశాను. వాడు నిజమే అన్నట్టు తల ఊపేడు.

"ఆయన మనసుకు ఏ గాయం తగిలిందో, ఆయన్ని ఏ సమస్య పీడిస్తోందో, మంచి తనానికి వేయి రకాలుగా సమాధికట్టే ఈ కుళ్ళిన సంఘం ఆయనకే మన్యాయం చేసిందో—లేకపోతే దేవుడులాంటి మనిషి త్రాగుబోతా?" సోమనాధంగారు ఆవేదనతో అన్నమాటలు. ఆయన కళ్ళల్లో నీళ్ళు తిరుగుతూంటే చూడ లేక తలదించుకొన్నాను.

"పోనీ మన మందరం ఆయన ఇంటికి వెళ్ళి ట్రాన్స్ఫర్ కాన్సిల్ చేసుకోమని రిక్వెస్టు చేస్తే" అన్నాను, ఆయనను ఇక్కడే ఉండేట్లు చేయాలన్న ఆతృతతో.

"ఆ అవకాశం ఆయన మన కివ్వలేదమ్మా' నిన్న సాయంత్రం ఫ్లయిటుకే ఢిల్లీ వెళ్ళి పోయారు" నిరాశగా అన్నారు సోమనాధంగారు.

ఆ రోజు ఆఫీసులో పనేం జరగలేదు.

ఇంటికివచ్చి జరిగింది మా ఆయనకు చెప్పాను.

కొంతసేపు నిశ్శబ్దంగా వుండి శూన్యంలోకి చూస్తూ" "ఇట్ ఈజ్ లైఫ్" అన్నారు. అంతే.

మరునాడు ఆఫీసునుండి ఇంటి కొచ్చేసరికి ఉత్తరాల్లో రావుగారి దస్తూరితో కవరు. కవరు విప్పి కాగితాలు బయటకు తీశాను.

శ్రీమతి సరస్వతీ,

కొన్నేళ్ళ క్రిందట వ్రాయాల్సింది. చొరవ ధైర్యం లేక వ్రాయలేదు. వ్రాయనందుకు




అప్పుడు విచారించలేదు. ప్రేమంటే నమ్మకం లేని నేను మరొకరంటే ఇష్టపడి పెళ్ళి చేసుకొన్నాను. కొన్నాళ్ళు జీవితం హాయిగానే నడిచిపోయింది, ఇద్దరు పిల్లల్ని నా కొదిలి, ఆమె దేవుణ్ణి చేరుకొంది. ప్రేమంటే అప్పుడు తెల్సింది. వియోగంలోని నరకం అనుభవం లోకి వచ్చింది. కొన్నాళ్ళు "మత్తు"లో అస్తిత్వాన్నే మరచిపోయాను. పిల్లల కోసం మామూలు మనిషయాను. మనుగడ కొనసాగిస్తూ వచ్చాను. ఇక్కడ నిన్ను చూశాను.

రమాదేవి, నువ్వు కలసి తిరుగుతుండే వాళ్ళు. అమ్మాయిల్ని చూడాలన్నా, వాళ్ళతో మాట్లాడాలన్నా సహజంగా నాకు ఉండే భయం, బిడియం నుంచి నీతో మాట్లాడ్డానికి ప్రయత్నించలేదు ఎప్పుడూ. మీ ఫ్రెండు రమాదేవి కోరి పలకరించినప్పుడు కూడ ఎడ్వాంటేజ్ తీసుకొని నీతో మాటలు కలిపి స్నేహం చెయ్యడానికి తెగింపు లేకపోయింది. ఏ పనీ చేసినప్పుడు నా మనసులో నీ రూపమే కదిలేది. నీ గురించి ఆలోచనలతో నా మనసు నిండి పోయేది.

ఇక్కడ నిన్ను చూసిన క్షణంనించి బంధ బారిందనుకొన్న నా మనసు బలహీనమవడం ప్రారంభమయింది. ఏదో చెప్పాలని, నీనుంచి ఓదార్పు పొందాలని, నిన్ను చూస్తూ గంటలు గడిపేయాలని తీరని తీవ్రమైన కోరికలు, తపన. ఎన్నో రాత్రులు నిద్రపోకుండా నీ గురించిన ఆలోచనల్తో పూర్తిగా తెలివితప్పే వరకూ త్రాగుతూ గడిపాను. వదిలిందనుకొన్న పాడు అలవాటు మళ్ళీ నన్ను బానిసను చేసుకొంది. పగలు నీరూపం ప్రత్యక్షంగా చూసి, ఆరూపాన్ని మనసులో ముద్రించుకొని రాత్రి గుర్తుకు తెచ్చుకొని సంతృప్తి పడుతుండే వాణ్ణి. బాధపడుతుండేవాణ్ణి. ఇంక ఇక్కడ ఉండడం అసంభవమని తెలుసుకొన్నాను. త్రాగుడు కబంధ హస్తాల్లోంచి నన్ను నేను రక్షించుకోవాలంటే నీకు దూరంగా వెళ్ళి పోవాలి. అందుకే వెళ్ళిపోతున్నాను.

శుభాకాంక్షలతో.

రాఘవరావు.

తడిసిన కళ్ళతో ఉత్తరం వైపుచూస్తూ కొన్ని క్షణాలు శిలనే అయిపోయాను. రమాదేవి ఉత్తరం దాని రూపం మనసులో మెదిలేయి. రావుగారి చూపులు గుర్తుకొచ్చాయి. "ఇట్ ఈజ్ లైఫ్" మా వారి మాటలు మెదడులో ఖంగుమని మ్రోగాయి.

ఏడుస్తూ మా చిన్నవాడు "అమ్మా! అన్నయ్య ఆటలో నా చొక్కా చింపేశాడు చూడమ్మా" అన్నాడు.

"వాడు చింపాలని చింపలేదు నాన్నా" అన్నాను, దుఃఖాన్ని ఆపుకుంటూ. □

# నవ్వి చెడినవారు లేరు!

"ప్రియమైన మామగారికి అల్లుడు సుబ్బయ్య నమస్కారములు. మీరు సంక్రాంతికి వస్తున్నట్టు వ్రాసిన ఉత్తరం చూసి చాలా సంతోషించాను. కాని ఆ రోజు నాకు వేరే పనుంది కాబట్టి స్టేషనుకి నా బదులు నా మేనల్లుడొస్తాడు. కాని మా మేనల్లుడు మిమ్మల్నెపుడూ చూడలేదు— మీరూ అతనిని చూడలేదు. అందుచేత మీరు ట్రైను దిగుతున్నప్పుడు కుడిచేతిలో ఆకుపచ్చని జలతారు పట్టుచీరను, ఎడమచేతిలో బొలిస్టర్ సూటుబట్టతోను నిలబడితే నా మేనల్లుడు మిమ్మల్ని తప్పక గుర్తుపడతాడు."

—ఇట్లు
అల్లుడు సుబ్బయ్య.

* * *

ఒక పిసినిగొట్టుకి జీవితంమీద విరక్తి పుట్టి ఆత్మహత్య చేసుకుందామని ఉరితాడులో తల దూర్చి వ్రేలాడుతూండగా పనిమనిషి వచ్చి అర్జంటుగా తాడుని కత్తితో కోసి అతనిని కాపాడేడు! ఆ నెల జీతం ఇస్తున్నపుడు ఆ యజమాని పనిమనిషికి 2 రూపాయలు తగ్గించి ఇచ్చాడు.

"ఏం దొరా. ఇలా తగ్గించారు?" అని అడిగాడు పనిమనిషి!

"మంచి తాడుతో నేను ఉరేసుకుంటున్నప్పుడు దానిని తెంచేశావు కదా? ఆ నష్టం ఎవరు భరించాలిరా?" అన్నాడు యజమాని.

* * *

"నాన్నగారూ, నేను హార్ట్ స్పెషలిస్టు నవ్వాలా లేక డెంటిస్టు నవ్వాలా?"

"డెంటిస్టే అవరా వెధవా! మనిషికి హృదయం ఒక్కటే కాని పళ్ళు 32 వున్నాయిగా! అదే లాభదాయకం!"

* * *

చిన్నవయస్సులో అన్ని సబ్జెక్ట్సులోనూ "జీరో" మార్కులు తెచ్చుకున్న అప్పారావు భవిష్యత్తులో ఏం చేస్తాడు?

ఇదికూడా తెలియదా? కోడిగుడ్ల వ్యాపారం పెడ్తాడు!

* * *

"అమ్మా తల్లీ ఒక చిరిగిన షర్టుంటే వెయ్యండి."

"నీ షర్టు బాగానే వుంది కదా?"

"అదేనండి చిక్కు! ఈ షర్టు చూసి ఎవరూ బిచ్చమెయ్యలేదమ్మా!"

* * *

సభలో ప్రసంగిస్తున్న రాజకీయనాయకుడు, "మహాజనులారా! కాకిని చూసి మనం ఐకమత్యం నేర్చుకోవాలి! చీమని చూసి మనం చురుకుతనం నేర్చుకోవాలి! కుక్కని చూసి మనం విశ్వాసం నేర్చుకోవాలి! "

ప్రేక్షకుల్లో ఒకడు·—"టైం చూసి మీరు ప్రసంగం వేగిరం ముగించడం నేర్చుకోవాలి!"

* * *

"అమ్మాయినిచ్చి, ఎనిమిది వేలు కట్నమూ ఇమ్మంటున్నారే ఇది జరిగే పనేనా?"

"అయితే ఓ పనెయ్యండి... ఎనిమిది వేలు కట్నం మాత్రం యిచ్చేసి అమ్మాయిని మీరే అట్టిపెట్టుకోండి!"

**సేకరణ: ఆర్. శివరాజన్**

# చిత్రకారుడి జీవితచిత్రం






రాజారావు నన్ను గుర్తు పట్టలేదు.

కనుబొమలుముడివేసి పరీక్షగా నా ముఖంలోకి చూశాడు.

"మీ పేరు? అడిగాడు.

'ఆనంద్ "

"ఆ నం ద్ . యన్. ఆనందరావనుకుంటాను పూర్తి పేరు?" అతని కళ్ళల్లో సంతోషపు ఛాయలు కనిపించాయి.

"అవును గుర్తొచ్చానా ?" కుతూహలంగా అడిగాను.

"అరె నువ్వటోయ్ చంపావు పో ఏమిటిట్లా ఐపోయావ్? చిన్నప్పుడు బాగా బొద్దుగా వుండేవాడివి. ఇప్పుడేమిటి ఇంత చిక్కిపోయావు? " ఆశ్చర్యం ప్రకటించాడు, నన్నింకా పరిశీలనగా చూస్తూ—

"ఆఁ ఎమిటి విశేషం? ఊరు ఎట్లావుందో చూద్దామని వచ్చావా? మార్పేమీ లేదులే ఇప్పుడెక్కడా వుండటం? విజయవాడేనా?" అన్నాడు.

"ఆఁ విజయవాడలోనే."

"ఏం చేస్తున్నావ్?"

"ఓ ప్రైవేటు కంపెనీలో క్లర్కుగా "

"గుడ్ రా అలా హోటల్లో కూర్చుని మాట్లాడు కుందాం " అంటూ నావీపుమీద చేయివేసి ముందుకు నడిచాడు.

"అమ్మా నాన్నా అంతా బావున్నారా?" నడుస్తూనే అడిగాడు.

"నాన్నపోయారు రెండు సంవత్సరాలయింది?"

"అరే? ఏమిటి? ఏవఁన్నా జబ్బా?"

"ఆఁ కాన్సర్!"

"హుఁ ఇంతమంది డాక్టర్లు వుండీ కేన్సర్ని కుదర్చలేక పోతున్నారు గదా ఊఁ ఇంకా ఏమిటి సంగతులు? "

"ఏమున్నాయ్ నువ్వే చెప్పాలి —మన వూరి గురించి "

"ఈ వూరి గురించి నాకు మాత్రం ఏం తెలుసు గనుక నేనిక్కడ వుండటంలేదు. హైదరాబాదులోనే జాబ్ చేస్తున్నాను."

"హైదరాబాదులో వుంటున్నావా? నాకు తెలీదు.. ఎందులో పని చేస్తున్నావ్?"

"స్టేట్ బ్యాంకులో."

"అట్లాగా అదృష్టవంతుడివి "

హోటల్లో ఓమూలగా వెళ్ళికూర్చున్నాం

హోటల్ ఇదివరకటికన్నా బావుంది. ఇదివరకు దీని స్థానంలో చిన్న కాకా హోటల్ వుండేది.

ఇంతకు ముందు మా వూరికి సినిమా హాలు కూడా వుండేదికాదు. చిన్న టూరింగ్ టాకీసు అప్పుడప్పుడూ వంచేస్తుండేది. ఏమైఁనా వూరు కొద్దిగా మారిందనే అనుకోవాలి కానీ రాజారావుకి ఈ మార్పేమీ ఆనటంలేదు. అవును మరి—అతనుంటున్నది హైదరాబాదులో'

రాజారావు ఆప్యాయంగా పలుకరించటం నాకు చాలా సంతోషంగావుంది . ఇంకా పాత మిత్రులెవరూ కనిపించలేదు. బస్సుదిగటం లోనే—కిళ్ళీకొట్టు దగ్గర సిగిరెట్టు కాలుస్తున్న రాజారావు కనిపించాడు.

స్వీట్ కు ఆర్డరిచ్చాడు రాజారావు, వద్దంటున్నా వినకుండా.

పామర్తి రాజేంద్రప్రసాద్

ట్రూడిల్స్

# మనిషి గొడుగు దర్పణం

"పిల్లలెంతమంది?" అడిగాడు.

"నలుగురు "

"ఊఁ బోర్డర్ దాటావన్నమాట ఇంకా ఎక్కువ దూరంపోయేవు ! నాకు ఇద్దరే ఇద్దరు ఒక 'క్రెడిట్టూ'—మరో 'డెబిట్టూ'" నవ్వుతూ అన్నాడు, తను బేంక్ ఎంప్లాయీ నని గుర్తుచేస్తూ.

నేనూ నవ్వాను.

స్వీట్ తెచ్చి ముందర పెట్టాడు, సర్వర్. మెల్లగా నంజుతూ అసలు విషయం బయట పెట్టాను

"పల్లవరావుని చూడాలని వచ్చాను "

"పల్లవరావెవరూ ఓహో ఆర్టిస్టు గదూ క్లాసులో పాఠాలు వినకుండా బొమ్మలు గీస్తూండేవాడు "

"అతను ఏం చేస్తున్నాడు? బాగు న్నాడా?" ఆసక్తిగా అడిగాను.

"ఏమో నాకేం తెలుసు? నేనీవూరొచ్చి రొండ్రోజులే ఐంది. మీరిద్దరూ మంచి ఫ్రెండ్సనుకుంటాను "

"ఆఁ చాన్నాళ్ళ క్రితం ఉత్తరాలన్నా రాస్తూండే వాడు ఇప్పుడు అదీలేదు: ఏం చేస్తున్నాడో పాపం చాలా పూర్ ఫేమిలీ వాళ్ళది: ఐనా ఏం. బ్రహ్మాండమైన ఆర్ట్ వాడిచేతిలో వుంది. ఎప్పటికైనా పైకొస్తాడు. అదెలాగూ తప్పదు."

"నిజంగా ఆర్టనేది గాడ్స్‌గిఫ్ట్ అందరికీ రాదు?" కాఫీతాగుతూ అన్నాడు రాజారావు. 'కరక్ట్' అన్నట్లు తలవూపాను.

"మంచి పిక్చరాడుతోంది. వెళ్దామా? టైమెందుకే ఎడెంటికి మొదలెట్టేది."

"సారీ ముందు పల్లవరావుని చూడాలి. వీలైతే ముగ్గురం 'సెకెండ్షో'కి పోదాం" అన్నాను కాఫీ తాగటం పూర్తిచేసి.

"సెకెండ్‌షో నమ్మకొలుండదవ్ జనం పోగయితేనే వేస్తారు సరే కానివ్వు . అంతగా ఐతే రేపు వెళ్దాం వుంటావు గదూ రెండ్రోజులు?"

"చెప్పలేను" అంటూ లేచాను.

"వన్సిక్టీ ఎ" అరిచాడు సర్వర్.

నేనివ్వబోతుంటే వారించాడు రాజారావు.

ఇద్దరం బయటికొచ్చాం. ఇంకో పది నిముషాలసేపు కబుర్లాడాం రోడ్డుమీదే. అత నేదో మాట్లాడాడే కానీ, నాకేమీ అర్థంకాలేదు. నా ఆలోచనలన్నీ పల్లవరావు చుట్టూ తిరుగు తున్నాయి. వాడ్ని చూడాలని నా మనస్సు తహ తహలాడుతోంది.

"సరే వెళ్లిరా ఐతే సినిమాకు రేపె ళ్దాం " అంటూ అక్కడే ఆగిపోయాడు రాజారావు. నేను ముందుకు నడిచాను.

పల్లవరావు వాళ్ళిల్లు వూరి చివర. బస్టాండు నుంచి కొద్దిగా దూరం. గబగబా నడక ప్రారం భించాను. దారిన తెలిసిన వాళ్లు చాలామంది కనిపించారు. ఐతే ఎవరూ నన్ను గమనించ లేదు. గమనించినవాళ్లు గుర్తుపట్టలేదు. నేను కూడా పలకరించలేదు, కబుర్లలో పడితే ఆలశ్యం ఔతుందని: రేపెప్పుడైనా మాట్లా డొచ్చునని తలవంచుకొని నడవడం మొద పెట్టాను.

బాగా చీకటి పడిపోయింది. వీధిలైట్లు అక్కడొకటీ, అక్కడొకటీ వెలిగాయి . వూరి చివర బంగళాను సమీపించాను. బంగ

# కలుషు చంద్ర కళము

శాకు దగ్గరలోనే పల్లవరావు ఇల్లు. అక్కడన్నీ పూరి గుడిశెలే ఎక్కువ. పెంకుటిళ్లు విసిరి వేయబడ్డట్లు ఒకటో అరో వున్నాయి.

రోడ్డుమీద నిలబడి పరిశీలనగా చూశాను. పల్లవరావు వాళ్ళింటి స్థానంలో—శిథిలావస్థలో వున్న చిన్న పెంకుటిల్లు కనిపించింది. బయట తలుపులు మూసివున్నాయి. దగ్గరకెళ్లి మునివేళ్ళతో చప్పుడు చేశాను. వెంటనే తెరుచుకున్నాయి.

“ఎవరు కావాలి నాయనా ” ఒక నడి వయసావిడ.

“పల్లవరావున్నాడా?” అడిగాను.

“ఏ పల్లవరావు ”

“చలపతిరావుగా రబ్బాయి.”

“చలపతిరావు గారెవరూ? ఎక్కడని చెప్పారు?”

“ఇక్కడే . ఇదే వీధిలో—ఈ ఇల్లే ”

ఇంతలో ఓ ముసలాయన వచ్చాడు లోపలి నుంచి-“ఎవరు కావాలండీ” అంటూ.

“ఎవరో చలపతిరావట ” సమాధానం చెప్పింది ఆమె.

“మీరెవరు బాబూ ” అడిగాడాయన.

“నాపేరు ఆనందరావు.”

“అలాగా లోపలికి రండి.”

వెళ్లాను.

విరిగిపోయిన కుర్చీ ఒకటి చూపించి కూర్చోమన్నాడు.

“ఫరవాలేదండీ వాళ్లెక్కడుంటున్నారో చెబితే—త్వరగా వెళ్లి కలుస్తాను” అన్నాను కూర్చోవటానికి ఇబ్బంది పడుతూ.

“ఫరవాలేదు ముందు కూర్చోండి “ ఆయన పక్కన మంచం వాల్చుకొని కూర్చున్నాడు. నేను భయం భయంగా విరిగిన కుర్చీలో ఒదిగి కూర్చున్నాను.

“చలపతి మీకేమౌతాడు?”

“వాళ్ళబ్బాయి పల్లవరావు నా స్నేహితుడు”

“ఆఁ హాఁ చలపతి చనిపోయి రెండు సంవత్సరాలవుతోంది.”

కలవరపడ్డాను.

“యాక్సిడెంటైంది లారీ క్రింద పడ్డాడు. పాపం, చాలా మంచివాడు. నాకు మంచి స్నేహితుడు మీకీ విషయం తెలీదేమో వాళ్ళబ్బాయి చలపతి చనిపోక ముందే ఎవ్వరికీ చెప్పకుండా ఇంటినుంచి వెళ్లిపోయాడు.”

• ఏమిటుపాటే!

నమ్మలేకపోయాను మొదట.

“ మీరు చెప్పేది నిజమా ఐతే పల్లవా ఇక్కడ లేడా? ” అంతకన్నా ఎక్కువ మాట్లాడ లేకపోయాను.

ఆయన తలవంచేసుకున్నాడు.

నాలో ఉత్సాహమంతా చప్పగా చల్లారి పోయింది. ఎంత ఆశతో వచ్చానో—అంత నీరసపడిపోయాను—ఆ మాట వినడంతోనే. ఇట్లా జరుగుతుందని వూహించలేకపోయాను.

నేనింకా ఏవేవో వూహల్లోవున్నాను.

నన్ను చూడగానే పల్లవా అమాంతంవచ్చి కౌగలించుకున్నట్లూ—

ఇద్దరం కలిసి ఊరంతా తిరిగొచ్చినట్లూ—

అర్ధరాత్రివరకూ ఏవేవో కబుర్లు చెప్పుకున్నట్లూ—

చిన్ననాటి సంఘటనల్ని నెమరు వేసుకున్నట్లూ—

—ఇంకా ఏవేవో అనుకున్నాను. కానీ— ఇప్పుటిలా? .. .

నిజమే ... సరిగా మూడు సంవత్సరాల నుంచీ పల్లవరావు దగ్గరనుంచి ఉత్తరాలు రావడం ఆగిపోయాయి.

"ఇప్పుడెక్కడుంటున్నాడో మీకేమైనా తెలుసా? . అతనికోసమే ఇంతదూరం వచ్చాను."

"వివరాలు మాకేమీ తెలీవు . పాపం వాళ్ళ నాన్న అతన్ని తలుచుకొని ఎంతగానో కుమిలిపోయేవాడు. అతను పోయిన దిగులు తోనే చిక్కి సగమయ్యాడు. వాళ్ళమ్మ మరీను. ప్రతిరోజూ అతనికోసం విలపించేది? ఆ సమయంలోనే మేమీ వూరొచ్చాం. ఇంతకుముందు కరణంగారి వీధిలో వుంటుండే వాళ్ళం. ఈ ఇంట్లోకివచ్చి ఆరునెల్లే ఐంది. వాళ్ళమ్మగారు ఈ ఇంటిని మాకు అమ్మకం చేశారు."

"ఆవిడ ఎక్కడుంటున్నదో "

"వాళ్ళన్నగారి దగ్గర వుంటోంది, బందరులో. వూరైతే తెలుసునుగానీ — అడ్రసు మాత్రం తెలీదు. అడ్రసు లేకుండా ఎక్కడని వెదుకుతారు మీరు మాత్రం? అసలు వాళ్ళ బ్బాయి గురించి ఆవిడకూడా వివరాలేమీ తెలీవు. ఎట్లా తెలుస్తాయి? కనీసం ఉత్తరం ముక్కయినా రాసి పడేస్తేగా అతను?"

"సరే . థాంక్సండీ మీకు శ్రమ కలిగించాను." అంటూ లేచి నిలబడ్డాను. ఆయన కూడా లేచాడు.

"పాపం. స్నేహితుణ్ణి చూడాలని చాలా ఆశతో వచ్చినట్లున్నారు." అన్నాడు నిట్టూర్పుతూ.

"వెళ్లొస్తానండీ—"

"మంచిది బాబూ."

రోడ్డుమీదకు వచ్చేశాను. ఇంతకు ముందు ఎంత వేగంగా వచ్చానో — అంత నీరసంగా అడుగులు పడుతున్నాయి.

మనసంతా దిగులుతో నిండిపోయింది. పల్లవరావు నాకెంతో ప్రియమైన స్నేహితుడు మరి. అట్లాంటివాడు దారీతెన్నూ లేకుండా ఎక్కడికో పోయాడంటే ఎంతబాధ? ఎంత గుండెకోత?

పల్లవరావుని నేను 'పల్లవా' అని పిలిచే వాణ్ణి. మేమిద్దరం ఎలిమెంటరీ స్కూలు రోజులనుంచీ మంచి స్నేహితులం. పల్లవాకి ఎక్కువమంది స్నేహితుల్లేరు. కారణం వాడు ఎవరితోనూ కలవడు. ఎవరితోనూ మాట్లాడడు కూడా. చిన్నప్పట్నుంచీ చాలా 'రిజర్వ్డు'గా వుండేవాడు. తన పనేదో తను చేసుకుపోతుండేవాడు.

వాడు క్లాసులో పాఠాలు వినగా నేనెప్పుడూ చూడలేదు. ఓ మూలన కూర్చుని చదువుతున్నట్లుగానో, రాస్తున్నట్లుగానో నటిస్తూ బొమ్మలు గీస్తూండేవాడు.

పల్లవరావు బొమ్మల్ని అందరూ మెచ్చుకునేవారు. చిన్న వయసులోనే అంత అద్భుతంగా బొమ్మలు గీయటం ఎవరికైనా ఆశ్చర్యంగానూ, అబ్బురంగానూ వుంటుంది.

వాడికున్న కొద్దిమంది స్నేహితులూ వాడిలోవున్న ఆ గొప్ప 'కళ'కు ఆకర్షింపబడే దగ్గిరయ్యారు. స్కూల్లో టీచర్లందరూ కూడా పల్లవరావుని బాగా 'లైక్' చేసేవాళ్ళు.

హైస్కూల్లో చదివేటప్పుడు అక్కడి హెడ్మాష్టరుగారు పల్లవరావుని ఎంతో అభిమానించేవారు. వాడి ద్వారా మా స్కూలికి చాలా ప్రైజులు వచ్చాయి! ఆ వయస్సులోనే వాడు ఎన్నో ఎగ్జిబిషన్సులో పాల్గొన్నాడు. హైస్కూలు స్థాయిలో జరిగే ప్రతి చిత్ర కళా పోటీకీ పల్లవరావు వెళ్ళేవాడు.

ఓ సంవత్సరం మాస్కూలు యాన్యువర్సరీ ఫంక్షను రోజు హెడ్మాష్టరు రిపోర్టు చదువుతూ స్కూలు గెలుచుకున్న బహుమతులను గురించి వివరిస్తూ—

"వర్ధమాన చిత్రకారుడు పల్లవరావు మా స్కూలు విద్యార్థి ఐనందుకు గర్విస్తున్నాను. మా స్కూలు తరఫున ప్రతి చిత్ర కళా పోటీలోనూ అతను ఎంతో ఉత్సాహంతో పాల్గొని టౌన్‌లోవున్న పెద్ద పెద్ద హైస్కూల్సుని సైతం ఓడించడంవల్ల, మా విద్యా సంస్థకు

ఓ రకమైన గుర్తింపు కలిగింది. పల్లవరావు మాకు సాధించిపెట్టిన విజయపరంపరను మేము మర్చిపోలేము. అతి చిన్న వయస్సులోనే ఇంత మంచి కళాకారుడయ్యాడంటే ముందు ముందు ఎంతో అభివృద్ధిలోకి వచ్చి 'గొప్ప పేరు గడిస్తాడనడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. ప్రతి విద్యార్థి కూడా పల్లవరావుని ఆదర్శంగా తీసుకొని కృషిచేస్తే మంచి ఫలితాన్ని పొందగలుగుతారు. మన స్కూలుకు మరింత పేరును తీసుకురాగలుగుతారు."

అంటూ పల్లవరావు ప్రతిభను పదిమంది లోనూ గొప్పగా చెప్పారు.

కాలేజీలోకూడా వాడు చాలాపేరు తెచ్చుకున్నాడు.

మంచి ఆర్టిస్టుగా కాలేజీలో ప్రతి ఒక్కరికీ వాడు తెలుసును. అక్కడకూడా ప్రిన్సిపాల్ గారు వాడిని ఎంతగానో అభిమానించేవారు. కాలేజీకి కప్పులు కొట్టుకొచ్చే స్టూడంట్సుని ఏ ప్రిన్సిపాల్ అభిమానించడు కనుక?

ప్రతిచోటా ఇంత ఇదిగా పల్లవరావు పేరు ప్రకాశిస్తున్నా-వాడు మాత్రం తనకేమీ పట్టనట్లు గానే 'కామ్'గా వుండేవాడు. కొత్తవాళ్ళనీ, పెద్ద వాళ్ళనీ పరిచయం చేసుకోడానికి ఉత్సాహం చూపించడు. ఎంతసేపటికీ వాడేమిటో వాడి లోకమేమిటో! నలుగురికీ దూరంగా, ఏకాంతంగా వుండటానికే ప్రయత్నిస్తూండే వాడు!

వాడి చూపులు ఎక్కడో ఆలోచిస్తూ-ఏదో వెదుకుతున్నట్లు వుంటాయి. సామాన్యులకు కనిపించని ఏదో అదృశ్య శక్తిని దర్శిస్తున్నట్లూ, మనం చూడలేని మనోహర లోకాలను తను చూస్తున్నట్లూ తన్మయత్వం చెందుతూంటాడు. అతిపొడవుగా వుండే సున్నితమైన వాడివేళ్ళు అనుక్షణంనాట్యంచేస్తూనేవుంటాయి! బహుశా ఏదో సుందర రూపాన్ని వూహించుకుంటూ గాలిలో వేళ్ళతోనే గీతలుగీస్తూ వింత అనుభూతిని చెందుతూంటాడనుకుంటాను.

ఇంటర్ సెకెండియర్లో ఎవ్వరికీ చెప్పా చెయ్యకుండా కాలేజీ మానేశాడు పల్లవరావు. కారణం ఏమిటో ఎవరికీ తెలీదు.

ఎంత గుచ్చిగుచ్చి అడిగినా నాకే చెప్పలేదు. మరీ వత్తిడిచేస్తే-"ప్రత్యేకంగా కారణమంటూ ఏమీలేదు. నేను చదవలేను. నా చదువుసాగదు. నాకు వంటబట్టదు. అంతకుమించి చెప్పలేను." అన్నాడు విరక్తిగా.

"ఏమిటో అర్థంకాని మనిషి"అనుకున్నాను ఏమీచేయలేక. వాడు ఒక నిర్ణయమంటూ తీసుకుంటే ఇక దానికి తిరుగుండదు. ఎంత మంది చెప్పినా ప్రయోజనం వుండదు. అసలు ఎవరూ చెప్పడానికి సాహసించరు. అంతగంభీరంగా కనిపిస్తాడు మనిషి.

"నువ్వూ. ఆనందరావ్వికదూ."రోడ్డుమీదే ఆగిపోయాను, ఆలోచనల్ని అంతటితో ఆపి. అతన్ని సులభంగానే గుర్తుపట్టాను. అతని

(వి)చిత్ర విజ్ఞానం



అమెరికాలోని ఓ కంపెనీ సైకిలుకు తెరచాపలు నిర్మిస్తున్నది. ఈ తెరచాప పాలిథీన్‌తో తయారు చేయబడినది. దీనిని హాండిల్ బార్‌కు తగిలించుకోవచ్చు. మనకి అనుకూలమైన దిక్కువైపు గాలి వీస్తున్నప్పుడు యీ తెరచాపను గొడుగు విప్పినట్లుగా విప్పి ఉపయోగించుకోవచ్చు. గంటకు 15 మైళ్ళ వేగంతో వీస్తున్న గాలిలో, యీ తెరచాప సాయంతో గంటకు 22 మైళ్ళ వేగంతో సైకిలు దూసుకుపోతుందని అంచనా. ఈ తెరచాపపేరు "వైకింగ్ బైసికిల్ సెయిల్." దీన్ని తయారుచేసే కంపెనీ విలాసము, **Turtel Leisure Products, 206 Quentin Road, Brooklyn, NewYork 11223!!**

పేరు కిషన్!

"అవును ఆనందరావునే. బావున్నావా?" ప్రశ్నించాను.

"ఆఁ ఏమిటి చాలాకాలానికి వచ్చావు? మమ్మల్ని మర్చిపోయినట్లున్నావ్? ఎవరింటి కొచ్చావ్?"

చెప్పాను-క్లుప్తంగా.

"అవును, పల్లవరావు ఇక్కడ లేడుగా. బొంబాయిలో వుంటున్నాడు?"

నా ఆశ్చర్యానికి అంతులేదు!

"పల్లవరావు బొంబాయిలో వుంటున్నాడా?" నమ్మలేనట్లు అడిగాను.

"వాడికేమోయ్. సినిమాల్లో చేరిపోయాడు. ఎవరో పెద్ద ఆర్టు డైరెక్టర్ దగ్గర సహాయకుడిగా పంచేస్తున్నాడు. రేపో మాపో తనే ఓ ఆర్ట్ డైరెక్టర్ కాబోతున్నాడు.

"ఏమిటి నువ్వనేది నిజమా?" నమ్మలేక అడిగాను.

"నిజమే. ఎవ్వరికి చెప్పకుండా పోతే పోయాడు కానీ-వెళ్లి మంచి పనేచేశాడు. ఎప్పటికైనా కష్టపడ్డవాడు పైకిరాక తప్పదు కదా. నువ్వేదో పాత స్నేహితుడ్ని గుర్తుంచుకొని-పిచ్చిగా అతన్ని చూట్టానికి వచ్చావు. కానీ ఈరోజు నువ్వు బొంబాయి వెళ్తే 'నువ్వెవరో నాకు తెలీదంటాడు. ఆమాట అనకపోయినా కనీసం నిన్నుచూసి గుర్తుపట్టలేడు.

నాకెంతో సంతోషం వేసింది, పల్లవా ఓదారిలో పడి మంచి స్థితికి రాబోతున్నందుకు.

కానీ పల్లవా అంతతేలిగ్గా మరిచిపోలేడు నన్ను. మా స్నేహం అట్లాంటిది. మా స్నేహం గురించి కిషన్‌కేం తెలుసని? అయినా మనుషుల్ని అంత త్వరగా మరిచిపోయే స్వభావం కాదు పల్లవాది. నాకు బాగా నమ్మకం. నా నమ్మకం ఎప్పుడూ వమ్ముకాదు.

కిషన్ ఇంకేదో చెప్పకు పోతున్నాడు. మౌనంగా వింటున్నాను. పల్లవా గురించి ఇంకా చాలా చెప్పాడు. అవన్నీవింటూ ఉప్పొంగి పోయాను.

"సినీ ఫీల్డులో ప్రవేశించడం నిజంగా వాడి అదృష్టమేనోయ్. నిజానికి పల్లవరావు మామూలు సమాజంలో చలామణికాలేడు. అట్లాంటి తత్వం వాడిది. నోరు తెరిచి అడగందే అమ్మ ఐనా అన్నంపెట్టదు కదా. అట్లా అడగటానికి కూడా నోరులేదు వాడికి. ఎంతసేపటికీ కళారాధనా, కళాసేవ అనుకుంటూ కూర్చుంటే పొట్టగడవదు కదా. మన కళారాధన చూసి ఎవ్వడూ సంతోషించడు. పైగా పిచ్చోడని నవ్వుకుంటారు. దూరంగా తరిమేస్తారు! ఎంతకీ నాలుగు మాటలు చెప్పగలిగినవాడే 'టేలెంట్' లేకపోయినా బ్రతగలడు కానీ, అమోఘమైన టాలెంటువుండీ మాటలు చెప్పడం రాకపోతే-అట్లాంటివాడు 'అన్‌ఫిట్ ఫరెనీథింగ్.' అందుకే అంటారు కాకారాయుళ్ళకున్న విలువ కళాకారులకులేదని.

"మొదట నేననుకునేవాడ్ని-పద్మవ్యూహం లాంటి ఈ సమాజంలో పల్లవరావువంటివాడు బ్రతగలడా అని! కానీ బ్రతగ్గలననీ-గొప్ప భవిష్యత్తుని కూడా సృష్టించుకోగలననీ నిరూపిస్తున్నాడిప్పుడు. ఎట్లాంటి వెధవ ఎట్లా మారిపోయాడు!!"

లాటరీలో లక్షరూపాయలు ప్రైజువచ్చినంత సంబరపడిపోయాను. అంతటి ఆనందం నా జీవితంలో ఇంతకు ముందెప్పుడూ పొందలేదు. పల్లవావృద్ధిలోకివస్తే చూసి సంతోషించే వాళ్ళల్లో నేను మొట్టమొదటివాడ్ని!

"చాలా మంచివార్త చెప్పావు కిషన్. అలా ముందుకుపోయి కాఫీ తాగుదాం." అన్నాను, నా ఆనందాన్ని అదుపులో పెట్టుకోలేక.

"వెళ్దాం కానీ మరి ఈ రాత్రికి మకాం ఎక్కడా?" అన్నాడు నడుస్తూ.

"మకాంలేదూ ఏమీలేదు. ఇప్పుడే తిరుగు ప్రయాణం. వెంటనే బస్సుదొరికితే టౌనుకు వెళ్లేసరికి పన్నెండవుతుంది. అక్కడ్నుంచి ఒంటిగంట ట్రైనుకు అందుకుంటే తెల్లవారేసరికి విజయవాడలో వుంటాను.

"అంత తొందరేం? మా ఇంటికి రాకూడదూ."

"రావచ్చుగానీ, ఇప్పుడు వీలుకాదు. రేష

ఉదయాన్నే కంపెనీకి వెళ్ళాలి!"

"అదేవిటీ. లీవ్ పెట్టలా నాల్రోజులైనా?"

"పెట్టాను. కానీ ఎల్లుండి మా మేనేజింగ్ డైరెక్టర్, మరికొంతమంది ఉద్యోగులూ కలిసి బోంబే వెళ్తున్నారు, కంపెనీ పనిమీద. నన్ను కూడా రమ్మన్నారు కానీ, పల్లవరావుని చూద్దామని రానన్నాను. ఐతే ఇప్పుడు పల్లవరావుని చూట్టానికైనా వాళ్ళవెంట వెళ్ళక తప్పదు."

"ఎల్లుండే ప్రయాణమన్నమాట"

"ఔను. నామట్టుకు నాకు ఇప్పుడే వెళ్ళి పల్లవా ముందు వాలితే బాగుండు నన్నంత ఇదిగా వుంది.''

కిషన్ నవ్వాడు.

మెల్లగా అట్లామాట్లాడుకుంటూ బస్టాండు దాకా వచ్చాం.

ఇందాకటి హోటల్లోకివెళ్ళి ఫుల్‌గా టిఫెన్ చేసి, తీరుబడిగా కబుర్లు చెప్పుకుంటూ కాఫీ తాగుతుంటే బస్సొస్తున్న శబ్దం వినిపించింది.

వెంటనే లేచి బిల్లు 'పే'చేసి బయటికి వచ్చాము.

టైము పావు తక్కువ తొమ్మిదైంది.

బస్సు ఆగింది. లోపలికి వెళ్ళి కూర్చున్నాను. కిషన్ కిటికీ దగ్గరకొచ్చి నిలబడ్డాడు.

"పల్లవరావుని మరీమరీ అడిగానని చెప్పవోయ్" అన్నాడు అప్పటికి పదోసారి.

బస్సు కదిలింది.

కిషన్‌తోపాటు నేనూ చేయివూపాను.

కొద్ది సేపట్లోనే స్పీడందుకుంది బస్సు. కిటికీలోనుంచి చల్లని గాలి తెరలు తెరలుగా వస్తూ గిలిగింతలు పెడుతోంది.

నా మనస్సు హాయిగా ప్రశాంతంగా వుంది.

* * *

తరువాత నాలుగు రోజులకు బొంబాయి నగరంలో అడుగెట్టాను. అక్కడో మిడిల్ క్లాస్ హోటల్లో దిగాము మేమంతా. మా డైరెక్టరు మాత్రం హెడ్డాఫీసువాళ్లు ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన బసలో విడిది చేశాడు.

మా పనులన్నీ చకచకా జరిగిపోతున్నాయ్. పదిరోజులు ప్రోగ్రాం వేసుకొని వచ్చాం. తీరా ఇక్కడి వాతావరణాన్నిబట్టి వారం రోజులకే తిరిగి పోవచ్చునని నిశ్చయించుకున్నాం.

పల్లవరావుని కలుసుకోడానికి పెద్ద చిక్కు ఎదురైంది.

వాడి ఎడ్రసు నాకు తెలీదు.

ఎక్కడుంటాడని వెదకను?

ఎవరో పెద్ద ఆర్టు డైరెక్టర్ దగ్గర సహాయకుడిగా పనిచేస్తున్నాడట. కానీ ఆ ఆర్టు డైరెక్టర్ పేరుకూడా నాకు తెలీదు. ఎట్లా కనుక్కోవడం మరి?

మా స్టాఫ్‌లో ప్రకాశానికి హిందీ వచ్చును. అతనితో నాబాధ మొరపెట్టుకున్నాను.

నా అదృష్టం. అతను గ్రీన్ సిగ్నల్ ఇచ్చాడు. పైగా "హిందీ సినీఫీల్డులో నీఫ్రెండ్ పనిచేస్తూండటం నిజంగా నీ అదృష్టం. గర్వకారణం" అంటూ ఏవేవో కబుర్లు చెప్పాడు.

అప్పట్నుంచీ ఖాళీదొరికినప్పుడల్లా ఊరంతా తిరగటం మొదలెట్టాము. చాలామంది కళాదర్శకుల చిరునామాలు సంపాదించాం అతికష్టంమీద. ఈఅడ్రసుల తతంగం ముగిసేసరికే మూడురోజులు గడిచాయి. అంటే ఇంకా బొంబాయిలో వుండేది నాలుగు రోజులే.

ఈ నాలుగు రోజుల్లో పల్లవరావుని పట్టుకోగలనో లేదో.

మరో రెండ్రోజులు గడిచాయి. కొంతమంది ఆర్టు డైరెక్టర్లను కలిశాము. "పల్లవన్ అనే అతను ఎవరిదగ్గరో పనిచేస్తున్నట్లు గుర్తు. మిగతా వాళ్ళనుకూడా విచారించి చూడండి. పెద్ద కష్టమైన పనికాదు. తప్పకుండా మీ స్నేహితుణ్ణి కలుసుకుంటారు." అన్నారువాళ్ళు.

నా గుండెల్లో రైళ్లు పరిగెట్టాయి! పల్లవరావుని చూడలేనేమో?

బొంబాయిలో వుండేది ఇక రెండ్రోజులు మాత్రమే,

మర్నాడు—మా డైరెక్టర్ని కలిసి నా పరిస్థితి చెప్పాను....బాగా 'రిక్వెస్టు' చేయగా పర్మిషన్ ఇచ్చాడు ప్రకాశానికీ, నాకూ.

నాకెంతో ఆనందమైంది. కంపెనీ పని తప్పిపోయింది. ఆ టైముకూడా పల్లవరావు



కోసం కేటాయించవచ్చు.

టాక్సీ ఒకటి మాట్లాడాము చకచకా పని జరిగిపోతుందని.

మధ్యాహ్నం పన్నెండయ్యే సరికి—చాలా మందిని కలిశాం. అప్పటికి ప్రకాశం 'ఆకలి' అనడంతో—ఏదైనా మంచి హోటల్ దగ్గర ఆపమని చెప్పాము, టాక్సీవాడితో.

టాక్సీ ఓచిన్న రోడ్డులోనుంచి వెళుతోంది.

సెంటర్లోకి వచ్చేసరికి—ఓచోట నా కళ్లు ఆగిపోయాయి. నా కనుబొమ్మలు ముడి పడ్డాయి. టాక్సీ ఆపమని చెప్పాను డ్రైవరుతో.

సడన్ బ్రేక్‌తో ఆగింది టాక్సీ.

'బేక్' చేయమని చెప్పాను.

కొద్దిగా వెనక్కివచ్చి ఆగింది.

గబగబా టాక్సీలోనుంచి దిగాను.

రోడ్డు పక్కన పలుచపాటి గుంపు. ఆ గుంపు మధ్యన శుభ్రం చేయబడిన రోడ్డుమీద ఓ చిత్రకారుడు నటరాజు బొమ్మకు తుది మెరుగులు దిద్దుతున్నాడు ! పరీక్షగా చూశానతన్ని!

ఏదో అనుమానం నాలో!

ఇంకా దగ్గరికివెళ్లి చూశాను—నా అనుమానం నిజమైంది!

అంతే—ఆకాశం ఉరిమి పిడుగుల వర్షం కురిపించినట్లు—నా పక్కనుంచి ఎడ తెరిపి లేకుండా ఫిరంగి గుళ్ళుదూసుకుపోతున్నట్లూ- వొణికిపోయాను' అదిరిపడ్డాను! చలించి పోయాను'! వళ్ళంతా చల్లబడి బిగుసుకు పోయింది!

ఆ చిత్రకారుడు ఎవరో కాదు.

పల్లవరావు!

నా ప్రియ మిత్రుడు—

ఇప్పుడు వీథుల్లోపడి, తన కళావైభవాన్ని, తన ప్రజ్ఞాపాటవాన్ని — పదిమంది నడిచే రోడ్డుకు అంకితంచేస్తూ పరోక్షంగా ముష్టెత్తుకు బ్రతుకుతున్నాడని గ్రహించటానికి ఎంతోసేపు పట్టలేదు.

నా మనసులో తుఫాను రేగింది! అల్లకల్లోల మవసాగింది!

నా చెవులలో సుడిగాలి హోరు—సముద్రపు ఘోష—వినిపిస్తున్నాయి, స్పష్టంగా.

ఆషాక్‌నుంచి తేరుకోలేకపోయాను.

రెండు నిముషాలు గడిచి వుంటాయి.

పల్లవరావు దరిచేరి పలకరించే సాహసం ఇప్పుడు నాలోలేదు. నిలబడ్డచోటనుంచి ఒక్క అడుగుకూడా ముందుకు వేయలేని దౌర్భాగ్యపు పరిస్థితి!

పల్లవరావునే చూస్తున్నాను. వాడు మాత్రం నావైపు చూడటంలేదు. నా ఉనికే వాడికి తెలిసే అవకాశంలేదు. ఆ పదిమందిలో నేనూ ఒకణ్ణి.

మరొక్కక్షణంకూడా అక్కడ వుండలేక పోయాను.

నా హృదయంలోనుంచి ఉబికి ఉబికివస్తున్న ఉద్వేగాన్ని నిభాయించుకోవడానికి ఎంత ప్రయాస పడ్డానో.

జేబులోకి చేయిపోనిచ్చి యాభైరూపాయల నోటు బయటికి తీశాను.

రోడ్డుమీద నటరాజు బొమ్మ ఎంతబావుందో నేను గమనించలేదు.



దానిమీద విసిరివేయబడ్డ - పదీ, ఐదూ, మూడూ, రెండూ పైసల్నే చూడగలిగాను.

బొమ్మకింద "ప్లీజ్ హెల్ప్ మీ" అని ఇంగ్లీషులో వ్రాయబడ్డ చిన్న చిన్న అక్షరాల్నే చూడగలిగాను!

యాభై నోటు ఆ చిల్లర పైసల మధ్యకు వదిలాను ! అందరి చూపులతోపాటు పల్లవ రావు చూపులూ నాకు గుచ్చుకున్నాయి.

మరో షాక్ తగిలింది—వాడికళ్ళు నా కళ్ళతో కలవగానే.

రివ్వున వెనక్కు తిరిగి టాక్సీ ఎక్కాను.

ప్రకాశం ప్రశ్నల వర్షం కురిపించాడు—"ఏమిటి. ఏమయింది? ఎవరతను?" అంటూ.

నేను మాట్లాడలేదు.

టాక్సీకదిలి ముందుకు దూసుకుపోతోంది,

ఏమిటి ఇట్లా జరిగింది?

కిషన్ నాతో చెప్పిందేమిటి?

ఇక్కడ నేను చూసిందేమిటి?

రెంటికీ సంబంధమేలేదు!

అతనికి ఎవరో చెప్పారట!—అంటే పల్లవ రావు ఆర్టు డైరెక్టర్ కావడం పెద్ద 'పుకారు' అన్నమాట! అవును. పదిమంది నోళ్ళల్లో నానేసరికి నిజం తన స్వరూపాన్ని పూర్తిగా కోల్పోతుంది-

మరి పల్లవరావు ఎందుకిట్లా అయ్యాడు? ఎందుకింత దిగజారాడు? సొంతవూరు వదలి వచ్చిన తరువాత అభివృద్ధి లేకపోగా అథః పాతాళానికి ఎందుకు అణిగిపోయాడు?

టాక్సీ వేగంగా వెళ్తోంది.

కిషన్ పల్లవరావు గురించి మాట్లాడిన మాటలు గుర్తుకొచ్చాయి నాకు—

"నిజానికి పల్లవరావు మామూలు సమాజంలో చలామణీ కాలేడు. అట్లాంటి తత్వం వాడిది. నోరు తెరిచి అడగందే 'అమ్మైనా' అన్నం పెట్టదు కదా అట్లా అడగటానికి కూడా నోరులేదు వాడికి. ఎంతసేపటికీ కళారాధన కళాసేవ—అనుకుంటూ కూర్చుంటే పొట్ట గడవదు కదా. మన కళారాధనను చూసి ఎవ్వడూ సంతోషించడు, కనికరించడు. పైగా పిచ్చోడని నవ్వుకుంటారు. దూరంగా తరిమేస్తారు. ఎంతకీ—నాలుగు మాటలు చెప్పగలిగినవాడే 'టేలెంట్' లేకపోయినా బ్రతగ్గలడు కానీ—అమోఘమైన టాలెంట్ వుండీ మాటలు చెప్పటం రాకపోతే—అలాంటివాడు 'అన్ ఫిట్ ఫరెనీథింగ్' . అందుకే అంటారు—'కాకా రాయుళ్ళకున్న ఎలువ కళాకారులకు లేదని!".



# స్థాయీభేదం

ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి

"ధర్మం తల్లీ. ధర్మం చేయండమ్మా. మీ బిడ్డ పాపలు కల కలలాడుతూ సల్లగుంటారు."

"దరమం సెయ్యమ్మా. పున్నెం జేసుకో తల్లీ. నీ యిల్లు సల్లగుంటది."

ఆ జంట స్వరాలు పదినిముషాలు పైగానే అలా వినవస్తున్నాయి.

"ఛీ వెధవ సొద," చదువుతూన్న పుస్తకం ఆపి యిటు తిరిగింది విద్య.

గ్రుడ్డివాడిని చేయిపట్టుకొని నడిపించు కుంటూ వస్తుంది కుంటి మనిషి రోజూ.

"రోజూ యిదేవేళ. ఛీ. కాస్త పని తీరు బాటై వీధి వరండాలో విశ్రాంతిగా కూర్చో బోయేసరికి ఈ ముష్టి మూక తయారు పోపో. రోజూ పనీ పాటూ లేదు. వెధవ సంత. అరవబోక, చెవులు పాడౌతున్నాయి."

ఇటువంటి ఛీదరింపులూ, అదిలింపులూ లెఖ్ఖ జేసుకుంటే వాళ్ళు బిచ్చాని కెందుకొస్తారు? ఆ మాటలన్నీ మరెవరినో అన్నట్టుగా, విన నట్లుగా యింకా దీనాలాపాలు మరింత తార స్థాయిలో విన్పించుతోంది బిచ్చగత్తె.

"నిన్నటి కాడనుండీ తిండి లేదమ్మా. రచ్చించు తల్లీ! లోపలి సిన్నపేణానికైనా పిడికెడు ముద్దెయ్యి తల్లీ." అంటూ కడుపు సవరించుకుంటోంది.

"ఖర్మ ఇంతోటి బ్రతుకులకూ యిది కూడానా?" అసహ్యం అధికమైంది విద్యకు. విసుగ్గా లేచి, ఢభ్ళున తలుపులు మూసి లోనికి వెళ్ళిపోయింది.

కొంతసేపు అలాగే నిరర్థకంగా అఱచి, నిష్క్రమించారు భిక్షకులు.

అయితే అది ఒక్కనాటి విషయం కాదు.

ముష్టి దొరికినా., దొరకకున్నా వాళ్ళు ఆ వీధిలో రోజూ ప్రతియింటి ముందూ నిలచి అడుక్కుంటారు. అదే వాళ్ళవృత్తి. ఆ వీధి మొగలో వున్న పెద్ద చింతచెట్టు నీడ వాళ్ళ పాలిటి గూడు.

మరి వానా వఱదా వచ్చినప్పుడు ఎలా బ్రతుకుతారో?

ఎవరి పంచకో, ఏ పాడుబడ్డ సత్రపు అరుగు మీదికో జేరతారేమో?

ఇంతపాటి ముష్టి బ్రతుకులకూ వంశాభి వృద్ధి ఒకటా పైగా? బొత్తిగా జ్ఞానంవుండదేం?

జనాభాను తగ్గించమని బోధించే వాళ్ళె వఱ్ఱూ ఇటువంటి వాళ్ళ విషయం పట్టించు కోరేం?

ఏదో నాలుగు రాళ్లు తెచ్చుకొనేవాళ్ళు ఎల్ల ల్నెలాగైనా పోషించుకుంటారు. అదీ కాక, ఓ మాదిరి స్థాయి వాళ్ళందఱకూ ఈమధ్య ఎవరి పుణ్యాం వల్లనైతేనేం, ఇటువంటి విజ్ఞానం బాగానే పెరిగినట్లూ, మెలకువలు తెలి సినట్టూ అన్పిస్తోంది.

ప్రచారాలూ, ఉచిత సహాయాలూ ఈ రోడ్డు ప్రక్క వాళ్ళకే అవసరంగా కలుగ జేయాలని ఎవరికీ తోచలేదా? లేదా మహామహులెవరి దృష్టిలోనూ వీళ్ళు మనుషులే కాదా?

ఈ తర్క వితర్కాలూ, పరిశీలనా విద్య మనసులో అంతకు పూర్వం గల కొలది మాత్రపు దయాబుద్ధినీ కూడ రూపు మాపివేసి ఆ స్థానే జుగుప్సకు తావునిచ్చాయి.

'పాపం' అని దయతలచి అప్పుడప్పుడు వేసే ముష్టినికూడా మానివేసినా కుతూహలంగా గమనించడం మాత్రం మానలేదు.



గమనించిన ప్రతి తడవా ఏవగించు కొనడమూ మానలేదు.

## 2

"ఒకళ్ళు కుంటి, మరొకళ్ళు గ్రుడ్డి. ఇక ఈ ఇద్దరి సంతానానికీ మరేమి అంగవైకల్యమూ వైపరీత్యమూ కలుగుతాయో? ఎంత అజ్ఞానమైనా ఆ మాత్రపు ఆలోచన వుండదా? వాళ్ళకే పొట్ట గడవని గతిమాలిన వాళ్ళు. మరో ప్రాణిని ఈ ప్రపంచంలోనికి తెచ్చి కష్టాలు పడమనడం ఎంతదారుణం! ఇటువంటి వాళ్ళకు జ్ఞానోదయం కలిగించి ఉద్ధరించరేం మీ మహా మహా సంఘసేవికలందరూ?"

ఆవేశంగా వచ్చిన విద్య సవాలును శాంత చిరుహాసంతో కొట్టిపారేసింది.

"వాళ్ళు చేస్తూన్నది మహా పాపమూ, నేరమూ అంటాను. అటువంటి వాళ్ళకు భిక్షం వేసి మీరంతా సంఘానికి ఇంకా ఇంకా కీడు కలిగించుతున్నారంటాను."

"ఏమీ కాదంటాను ఖచ్చితంగా. నీ ఆవేశం తగ్గించుకో. దొరక్క దొరక్క ఆ చెట్టుక్రింద బ్రతికే బీద పక్షులే దొరికారా నీకు ధర్మపన్నాలు చెప్పటానికి, సంఘ పటిష్ఠత గురించి ఉపన్యసించడానికీను?"

"ఎందుక్కాదు? నా ఆవేశం తగ్గదు. మీరు వీళ్ళందరికీ జీవితపు విలువలు తెలియజెప్పే పథకాలూ, శ్రమించి బ్రతకగల దారులూ ఏర్పాటు చేయరాదూ?"

"హుఁ! 'ఆడదానికి చదువెందుకూ' 'డబ్బున్నవాడికి ఉద్యోగమెందుకూ?' అని ఇప్పటికీ నీల్గుతూనేవున్న సమాజంలో — విద్యా

వంతులనే మార్చలేని మన సమాజంలో, దివారాత్రులూ పొట్టకోసం ముష్టెత్తుకొనేవాడికి పారాలు నేర్చుకొనే తీరిక వుండదు. వాళ్ళు ఏ స్థితిలోవున్నా, వాళ్ళూ మనుషులే గనుక కోరికలుంటాయి, తీర్చుకుంటారు."

"నేను చెప్పేది. "

"ఆగు. నేను చెప్పేదికూడావుంది. ఆ బిచ్చగాళ్ళను పిలచి మన యింట గిన్నెలు తోమే పని యిచ్చి ఉపాధి కల్పించుదామా?"

"ఛఛ. వాళ్ళనా? వాళ్ళకేం తెల్సు శుభ్రతా, శుచీను? డాక్టరువై యుండీ ఆ మురికి వాళ్ళను యింట ఎలా పెట్టుకుంటావు?"

"చూశావా మరి? అందుకే యింట గెలిచి రచ్చ గెలవమన్నారు. ఎందుకొచ్చిన కంఠ శోషగానీ నేను వెళ్ళొస్తాను. ఎప్పుడైనా రా నువ్వు మా యింటికి."

## 3

పరీక్ష ముగించి చిరునవ్వు నవ్వింది శాంత.

"కంగ్రాచ్యులేషన్స్. నీకు నాలుగవ నెల."

విద్య వదనం వికసించింది.

అవసర జాగ్రత్తలన్నీ శాంతనుండి తెల్సుకొని, అనవసరమైనప్పటికీ బలవర్ధకమైన టానిక్కూ, కాప్సూల్సూ వగైరా వ్రాయించుకుని యింటి ముఖం పట్టింది.

"అన్నట్టు వారానికోసారి వచ్చి 'చెక్' చేయించుకోనా?" అన్నది కారులో కూర్చో బోతూ మఱలా వెనుదిరిగి.

శాంత నవ్వులో ఆమె అనుభవజ్ఞత కురిసింది.

"ఏమైనా అవసరమన్పించితే ఫోనుచెయ్యి. ఆరోగ్యంగా వున్నవాళ్ళు నెలకోసారి డాక్టర్ని చూస్తే చాలు."

"ఎందుకైనా మంచిది. పదిహేను రోజుల కోసారి వస్తాను శాంతా."

"నీ యిష్టం. రోజూ వచ్చినా కాదనను." నవ్వింది. నవ్వుతూ సెలవు తీసుకున్నది విద్య.

కారు మెత్తగా సాగిపోతూన్నది.

కలలు అలలై కదలి పోతూన్నాయి.

చక్కటి బాబు, లేదా బేబీ, ఎవరో ఒకరు. పచ్చగా, బొద్దుగా - ముద్దుగా అందంగా వుంటుంది తన బిడ్డ అందరినీ ఆకర్షించుతూ. అందుకు వలసిన జాగ్రత్తలన్నీ తాను తీసుకుంటుంది. తాప్పక తీసుకోవాలి. తీసుకోగలదు.

ఎదురింటి కమలకు ఏకంగా నలుగురు పిల్లలు. ఎప్పుడూ ఈసురో మంటూనే వుంటారు, తల్లీ పిల్లలూ. ఎప్పుడూ ఏదో ఓ జబ్బే. పిల్లల్ని సాకే ఓపికే వుండదట.

సిగ్గులేకపోతే సరి! ఎందుకు ఈ రోజుల్లో కూడా అంతంతలేసి సంతానం!

చక్కగా యిద్దరంటే యిద్దరే వుంటారు నాకు పిల్లలు. నాకూ ఆరోగ్యం, వాళ్ళకూ ఆరోగ్యం.

శ్యామలకు అయిదుగురు ఆడపిల్లలు వర సాగ్గా. ఎమ్మెస్సీ పాసైంది. భర్తకూడా ఏదో ఆఫీసరే. ఎవరైనా ఇక చాలించమంటే 'మగ పిల్లలు కావద్దా?' అంటూంటారు. ఈలోగా మరో నలుగురు కూడా ఆడవాళ్ళే అయితే?

ఛ, ఈ రోజుల్లో కూడా తెలివి తక్కువ కాదూ ఈ ఛాందసాలన్నీ? ఎప్పుడూ చాకిరీతో, రోగాలతో అసలు ఆఫీసరు భార్యా పిల్లలూ అన్నట్లే వుండరు.

నేను కలలోకూడా అటువంటి ఛాందస భావాలకు తావీయను; మగైనాసరే ఆడ అయినా సరే—ఇద్దరే బిడ్డలతో సరిపుచ్చి ఈ అందమూ ఆరోగ్యమూ యిలాగే నిలుపుకొంటాను.

అంతెందుకూ? శాంత — అవ్వటానికి డాక్టరే, చాలాపేరుంది. ఏం లాభం? పిల్లలిద్దరూ వాన పాములల్లే వుంటారు. అసలు డాక్టరు పిల్లలంటే నమ్ముతారా ఎవరైనా? ఎందుకుంటారు? వాళ్ళ ఆలనా పాలనా ఆ డాక్టరమ్మగారు చూచుకుంటే కదా? ఆయాల దయా ధర్మాలపైననేగా వాళ్ళు బ్రతికేది!

ఛ. నేను ఎప్పటికీ అలా చెయ్యను. దర్జా నిలుపుకోటానికి ఆయాను నియమించుతాను, కానీ, పర్యవేక్షణ అంతా స్వయంగా చేస్తానుగా?

బోనీ బేబీ కంటెస్ట్‌లో ప్రథమ బహుమానం అందుకుంటుంది అందంగా ఆరోగ్యంగా వుండే నాబిడ్డ.




నా పెంపకం చూచి, డాక్టరైన శాంతకూడ సిగ్గుపడాలి!

"అమ్మా ధర్మం. సంటి బిడ్డకు ఓ గుడ్డ ముక్క దానం సెయ్యి తల్లీ, నీబిడ్డ పాపలు సల్లగుంటారు." పాయసం త్రాగుతూంటే పుల్ల ఏదో అడ్డుపడినట్లుగా చీకాకుతో చూచింది విద్య.

కలల ఊహా లోకంలో ఆమె కారు గమ్యం చేరడం గమనించనేలేదు. డ్రైవర్ తలుపుతీసి పట్టుకున్నాడు.

ఇంతలో ముష్టిది ఎక్కడినుండి వచ్చి పడిందో? పరుగున వచ్చినట్టుగా వున్నది ఆయాసంతో రొప్పడం చూస్తే. ఒడిలో మురికి ఓడుతూన్న జీర్ణవస్త్రంలో పసిపిల్ల కేరుకేరు మంటూన్నది.

చూచీ చూడనట్లుగా అటు చూచింది విద్య, ఏవగించుకుంటూనే, మరొక ప్రక్క ఏదో కుతూహలంతో.

అసహ్యం ఉప్పెనగా వచ్చింది. వెంటనే ముఖం త్రిప్పుకొంది.

'ఛీ. కంపు. ఈ మనుషుల చుట్టూ ఆమడ దూరంవఱకూ దుర్గంధమే. దాని ఒంటిమీద పీలికలైపోయిన గుడ్డలు. జుట్టు అట్టకట్టింది. దీని బ్రతుక్కి పిల్ల ఒకటా సైదోడు!'

"దానిమొహాన రూపాయిపారేయి. లేకుంటే కదలదు యిప్పుడు," అని దర్జాగా డ్రైవరుకు ఆజ్ఞాపించి తాను లోనికి వెళ్ళిపోయింది.

సంతోషంగా వున్నది గనుక ఆ మాత్రపు వితరణ కన్పఱచింది.

అదే విచ్చుగత్తె పాలిట పెద్దవరం.

వేయి దీవనలు కురిపించింది.

శుభ విశేషం అత్తమామలను అలరించింది.

భర్తను మురిపించింది.

జంటను ఆనందంలో ఓలలాడించింది.

"మెట్లు ఎక్కేటప్పుడూ దిగేటప్పుడూ జాగ్రత్తమ్మా, నెమ్మదిగా వెయ్యి అడుగులు."

ముఖాముఖి ఎదురైనపుడెల్లా మామగారి హెచ్చరిక విన్పించుతుంది.

"ఎక్కువగా తిరిగి అలసిపోకు. అన్నీ మేడమీదికే పంపిస్తాను. ఇందరు నౌఖర్లుండగా ఎందుకలా తిరుగుతావు? వేళకు వేడివేడిగా తిని పడుకో?"

గారంగా మందలించే అత్తగారు.

"విద్యా, అంతా బాగానే వుందా? ఏమైనా కావాలా? సిగ్గుపడకూడదు సుమా! ఏం కావాలన్నా అడిగేసేయి." రోజూ ఉదయం సాయంత్రం భర్తప్రేమమీరగా అనేమాటలవి.

"నన్ను రమ్మంటావా, నువ్వు వస్తున్నావా? శుభ్రంగా వున్నావ్‌గా?" అంటూ రెండ్రోజుల

# విజ్ఞాన వికాసం

విద్య వ్యక్తి వికాసానికి తోడ్పడినట్లే దేశాభ్యుదయానికి దోహదం చేస్తుంది. అభ్యుదయ పథంలో పురోగమిస్తున్న ఆంధ్రప్రదేశ్‌లో విద్యాభివృద్ధికి ఇతర కీలక రంగాలతో సమానంగా ప్రాముఖ్యం యివ్వడం జరుగుతున్నది. 1978-79 రాష్ట్ర బడ్జెటులో 16,676 లక్షల రూపాయలు ఈ పద్దు క్రింద కేటాయించడమే దీనికి నిదర్శనం.

విద్యారంగంలో ఒక ప్రత్యేక ఉద్యమాన్ని నిర్వహించడం ద్వారా 1976 నుంచి 1979 వరకూ ఏటేటా 6 శాతం వంతున బడులలో చేరే బాలబాలికల సంఖ్యను పెంపొందించడానికి ప్రత్యేక కృషి చేశారు. పాఠశాలలు లేని 693 కేంద్రాలలో పాఠశాలలు ప్రారంభించాలని ప్రతిపాదించారు.

ప్రాథమిక పాఠశాలల్లో ప్రవేశాలను అధికతరం చేసి, చదువు మానివేయడాన్ని అరికట్టి, పిల్లలను ప్రోత్సహించే సంకల్పంతో పుస్తకాల గ్రాంట్లు హాజరు ఉపకారవేతనాలు, దుస్తులు మొదలైనవి యివ్వడంతో పాటు మధ్యాహ్న భోజన పథకం అమలు జరుపుతున్నారు.

---

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌరసంబంధ శాఖ
డైరక్టరుచే ప్రకటితము

3/78-79



కోసారైనా డాక్టర్ శాంత ఫోన్ చేస్తుంటుంది.

ఆరోగ్యాది విషయాలు ఆరాతీస్తూ నాలు రోజుల కొకసారి పుట్టింటినుండి ట్రంక్‌కాల్స్ వస్తుంటాయి.

విద్య మనసు గర్వంగా నాట్యం చేస్తుంది.

'అబ్బ! నువ్వొచ్చాక యింకెంత గారా మోరా బాబూ!' పుట్టబోయే వాడిని తలచుకొని నవ్వుకొంటుంది హాయిగా.

"ఇన్నిన్ని జాగ్రత్తలు తీసుకుంటామే మనం? అలా గాలికీ ధూళికీ బ్రతికేవాళ్ళు మరి ఎలా వుంటారో? ఆశ్చర్యం! ఏది దొరికితే దానితో పొట్ట నింపుకొని, ఒంటిని సరిగాకప్పే గుడ్డకూడా లేకుండా ఎండకూ ఎండుతూ, వానకు తడుస్తూ, గాలికి వణుకుతూ బ్రతికే బిచ్చగత్తెకు మరి అంత ఆరోగ్యంగా వున్న పిల్ల పుట్టడం ఆశ్చర్యం కదూ? చెట్టు కొమ్మన గుడ్డ పేలికల ఉయ్యాలలో నిత్యం కేరుకేరుమని గోల పెడు తూనే వుండే ఆ పిల్ల మరి అంత గుండ్రంగా ఎలావుంది?"

"వాళ్ళు ప్రకృతి బిడ్డలు. ఆ ప్రకృతే వాళ్ళ బలానికీ ఆరోగ్యానికీ గల రహస్యం. పెద్దపెద్ద భవనాలలో చుట్టూ తెఱలు వ్రేలాడదీసుకు కూర్చునే మన నాగరికతే మనకు అన్నింటికీ ప్రతిబంధకం." అన్నది శాంత నవ్వి.

ఈ సమాధానం తృప్తిగాలేదు విద్యకు.

మనస్సులో సందేహాలు సమసిపోలేదు.

మేడ వరండాలో తూగుటుయ్యాలపై కూర్చుంటే ఆ బిచ్చగాళ్ళుండే తావు స్పష్టంగా కన్పిస్తుంది.

తీరుబాటుగా కూర్చున్నప్పుడెల్లా, వాళ్ళనూ, ఇంకా త్రోవనపోయే వాళ్ళ లాంటి వాళ్ళనూ పరిశీలనగా కుతూహలంగా చూడటం విద్యకు పరిపాటి అయిపోయింది.



రంగి గది చిమ్ముతూ ఆ కబురూ ఈ కబురూ చెప్తోంది. బాల్కనీలో కుర్చీలో కూర్చున్న విద్య పరధ్యానంగా వింటోంది.

"ఏంటమ్మా? ఎక్కడుంది మీ ధ్యాస?" అన్నది జవాబు రాక. విద్య చూస్తూన్నదెసగా క్రిందికి తానూ దృష్టి సారించింది.

"అవిటి పిల్ల బాబూ. సూపులేని కబోది. కాలులేదు. దెరమ పెభువులు ఓ పైసా దానం సేయండి బాబూ."

దీనాతి దీనంగా, శోకాలు పెడుతూన్నట్లుగా అరుస్తూ యాచించుతూన్నది, ఆ చెట్టు క్రింది స్త్రీ, దారి ప్రక్కన కూర్చుని. ఒకగుడ్డ పఱచి పిల్లను అందు పరుండబెట్టింది. పిల్లకిపుడు ఆరునెలల వయసు వుండవచ్చు. కళ్ళపై ఈగలు ముసురుతున్నాయి. ఒకటే ఏడు స్తోంది. కాళ్లు కదలడంలేదు.

"దాని పిల్లకన్నూ, చెయ్యీ - అంతా సవ్యంగా చక్కగా వుండడం నేను చూచాను. చాలసార్లు దాన్ని నాదగ్గఱగా తెచ్చి అడు క్కునేది. ఇపుడు కన్నూ కాలూ లేకపోవట మేమిటి?" విస్మయంగా అడగడంలో కొంత ఖంగారు కూడా కన్పిస్తూన్నది, విద్యలో.

"ధూ." అన్నది రంగి చీదరింపుగా. "పాడు మడుసులు! ఆల గురించా మీరు అడుగు తారు?"

"ఏం?"

"స్సీస్సీ" మఱలా ఛీత్కరించింది రంగి. "కన్నూ కాలూ వున్నోలకి ముట్టి ఎవరేస్తారు? అందుకని సుబ్బరంగా వున్న కన్ను పొడిసే త్తారు; కాలు యిరిసేత్తారు. అవిటోల్లమని అడుక్కుంటే అందరికీ కనికరం పుట్టి అంతో యింతో బిచ్చం పెడతారు. మొన్న అది ఆ పొదల్లో జిల్లేడు సెట్లకాడ ఆకులు కోత్తావుంటే నా కళ్ళతో నేను జూశా."

"ఎంత దారుణం!!" విద్య కంటి పాపలు భయంతో నిలచిపోయాయి కొన్ని క్షణాలు.

"ఔనమ్మా. ఆ జిల్లేడుపాలు పిల్లదాని కంట్లో గుచ్చేసి వుంటాది.

"అబ్బబ్బ, చెప్పకు వినలేకపోతున్నాను. ఇటువంటి వాళ్ళను షూట్‌చేసి పారేయాలి ." చెవులు చేతులతో మూసుకున్నది.

"చాల్లే. నిండు మనిషివి. ఆట్టే హైరాన పడబోకు, అనవసర ఆలోచనలతో. దారిన పోయేవాళ్ళ గోలలన్నీ నీకెందుకు?" అపుడే

# కొండ కోనల్లో కొత్త జీవనం

కొండ గ్రామాల చుట్టూ ఆవరించిన దట్టమైన అడవులూ, పర్వత శ్రేణులూ కోయ ప్రజలను నాగరికతా ప్రభావంనుంచి వేరుపరచాయి. మరో మాటల్లో చెప్పాలంటే వారు దశాబ్దాల తరబడి ప్రధాన జీవన స్రవంతి నుంచి దూరంచేయబడ్డారు. విద్యావకాశాలు లోపించడంవల్ల అజ్ఞానం, అంధవిశ్వాసాలు, దారిద్ర్యమనే విషవలయంలో చిక్కుకున్నారు. ప్రణాళికాశకం నవోదయానికి నాంది పలికింది. ఈనాడు వారి సంక్షేమానికి అమలుజరుపబడుతున్న అనేక పథకాల ఫలితంగా గిరిజనులు సుఖజీవనం సాగిస్తున్నారు.

షెడ్యూల్డు జాతుల సహకార ఆర్థిక సహాయక సంస్థ ఇంతవరకు చేపట్టిన 97.25 లక్షల రూపాయల విలువగల పథకాల మూలంగా కొండ జాతులకు చెందిన 5,700 మంది సభ్యులు ప్రయోజనంపొందుతున్నారు. అంతేకాకుండా 7 జిల్లాలలో సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థలు నెలకొల్పబడ్డాయి.

కొండ కోనల్లో ప్రగతి శక్తులు విజృంభించాయి. గిరిజనుల భవిష్యత్తు మహోజ్జ్వలంగా ఉంటుంది.

---

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌర సంబంధ శాఖ

డైరెక్టరుచే ప్రకటితము.

**4/78-79.**



వచ్చిన అ త్తగారు మందలించింది.

ఆమె వెనుకనే డాక్టరు శాంత ప్రవేశించింది.

"అదికాదు "

"నాకు తెలుసు." ఏదో చెప్పబోతూన్న విద్యను శాంత వారించింది.

"ఆ అజ్ఞానులను మానసికంగా 'ఎడ్యుకేట్' చేయలేని వాళ్ళం, వాళ్ళకొక పని కల్పించి సవ్యమైన ఉపాధి చూపలేని వాళ్ళం-మనకి వాళ్ళని నిందించే అర్హతలేదు. పిల్లలను లంచగొండులుగా, స్మగ్లర్స్‌గా, నేరస్థులుగా తయారుచేసే వారికంటె పెద్ద నేరస్థులా వీరంతా?"

సమాధానం చెప్పలేని విద్య తల వాల్చుకున్నది.

# 5

"ఛీఛీ. ఆ దయ్యాపు పిల్లను నేను చూడను. నా ఎదుటికి తేకండి, పీక పిసికి పారేయండి."

ఉన్మాదినిలా అరుస్తూన్న విద్యకు సముదాయింపు మాటలు చెప్పడానికే జెదరిపోతున్నారు ఎవరికి వారే.

డాక్టరు శాంత ధైర్యంగా, చనవుగా విద్య చెంత కూర్చుని, ఆమె ముఖంపై ఆచ్ఛాదించుకున్న చేతులను తొలగించింది.

"నీవంటి విద్యావతి, వివేకవతి యిలా ప్రవర్తించగలదని నేనెన్నడూ అనుకోలేదు విద్యా. బిడ్డ ఈ లోకంలోని కొచ్చి ఒకరోజు పూర్తి కావస్తున్నా నీకింకా మమకారం కలగ లేదా?"

"ఛీఛీ. ఎందుకు మమకారం ఆ శనిపై? ఆ అనాకారిపై?"

"మాతృత్వపు మమకారం పిల్ల ఆకారాదులపై ఆధారపడి వుంటే ప్రపంచపు మనుగడ ఏనాడో నశించి వుండేది. అందాలూ, అవకరాలూ విధిలీలలు!"

"ఇంతటిడాక్టరువు—నువ్వూ విధీ దేవుడూ అంటున్నావా?"

"మరి? అంతా నీ గొప్పే అయితే నీవు కోరుకున్న అందమైన బేబీని ఎందుకు సృష్టించలేకపోయావ్?"

ఈ తర్కవాదమూ, సవాలూ మరింత అసహనవతిని చేశాయి విద్యను.

"విధి! దైవం!" కసిగా పళ్ళు కొరికింది, పై పెదవి రెండుగా చీలి, వికృతంగా కన్పించుతూన్న పసి ప్రాణిని ఏహ్యంగా చూస్తూ. "ఏ దైవమైతే సృష్టించాడో అక్కడకే తిరిగి పంపించు!"

"విద్యా!"

"ఆఁ. అంతే. ఎలాంటి ఎలాంటి కలలు కన్నాను నేను? ఏమిటీ శిక్ష? ఈ వికృతపు పిల్ల నా బిడ్డగా నా యింట పెరగటానికి వీల్లేదు. ఎంత సిగ్గు? ఎంతవమానం?"

"ఆలోచించి మాట్లాడు విద్యా. నీ బిడ్డ నీ యింట పెరగటానికే వీల్లేదు; పరాయివాళ్ళు తమ యింట ఎందుకు పెట్టుకుంటారనుకున్నావ్?"

"అందుకే ఏదో యింత యిచ్చి చంపి పారేయి!" పళ్ళ బిగువున అన్నది.

"విద్యా!" శాంత అదలింపు గదిలో మార్మ్రోగింది.

"ఒకనాడు ఒక బీద స్త్రీ, మరే దారీ లేక ఉదర పోషణార్థం పిల్లను అవిటి దానినీ గ్రుడ్డి దానినీ చేసిందని అసహ్యించుకున్నావ్. షూట్ చేసి పారేయాలన్నావ్. మరి . నీవు ఏకంగా ప్రాణమే తీయాలనుకుంటున్నావు కదూ? హాయిగా పెంచగల ధనరాసులుండీ, కన్న బిడ్డ ప్రాణం తీస్తావు కదూ?"

బయటనుండి బిచ్చగత్తె కంఠం మేడమీదకి కూడా వినవస్తోంది.

"అమ్మా. కనికరించండి. అవిటి పిల్ల. దానం సెయ్యండి "

"అదుగో విద్యా. నువ్వు ఏవగించుకొనే బీదరాలు. కన్నపిల్లను ఏదో విధంగా పోషించాలని తాపత్రయపడే నిస్సహాయురాలు "

"అబ్బబ్బా! ఆపుజేయి ఇక శాంతా!" చెవులు మూసుకుంటూ దిక్కులు పిక్కటిల్లేలా ఆర్తనాదం చేసిన విద్య స్పృహ తప్పి పడి పోయింది. □

జ్యోతి కథల పోటీలో ప్రత్యేక ప్రశంస పొందిన కథ

# "రాలేనమ్మా, రాలేను"

ఇచ్ఛాపురపు రామచంద్రం

సీతాలుకి దుఃఖం వొచ్చేస్తూంది.

ఏటికి పోటొచ్చినట్లు ఏడుపొచ్చేస్తూంది.

గుండె పగిలిపోయేలా వుంది.

గొంతు తెగిపోయేలావుంది.

"నాన్నా నాన్నా నాన్నా"

దిగంతాలు మార్మోగేలా అరిచింది.

అరిచి అరిచి అలసిపోయింది.

సీతాలుకి శోషొస్తూంది. ఈ క్షణమో మరు క్షణమో మొదలు నరికిన తరువులా దభాలున నేలకూలి పోయేటట్లుంది. అయినా ఓపికతెచ్చు కుని—తనలో వున్న శక్తినంతటినీ ఒక్కసారి కూడ దీసుకుని అదేచివరి సారన్నట్లూ, యిక తనతరం కాదన్నట్లూ ఆశగా ఆత్రంగా అరిచింది "నాన్నా, రావూ? రావూ?"

ఒంటి కంటితో అతనొస్తున్నాడేమో అని చూసింది!

ఒంటి కాలితో కుంటికాలితో.. .రెండడుగులు వేసింది. అతన్నందుకుందు కన్నట్లు. అతనందలేదు—ఆమె పిలుపుకీ. .చూపుకీ పరుగుకీకూడా.

నిలువునా కూలిపోయింది—ఆమె అన్ని ఆశలలా.

ఆమె కళ్ళముందు చీకట్లు క్రమ్ము తున్నాయి. ఇన్నాళ్ళూ ఎదురుచూసిన క్షణం వొచ్చి—వెక్కిరిస్తూ వెళ్ళిపోయింది.

ఆమె ఏడుస్తూంది . "నాన్నా! నేను నాన్నా నీ సీతని....నీ రెండో అమ్మాయిని. నీతో కలసి అన్నం తినేదాన్ని. నువ్వెంత రాత్రికి వొచ్చినా మేలుకొని కూర్చుని నువ్వు కలిపి పెడితేగాని బువ్వ తిననని గారాము చేసిన సీతని నాన్నా. నన్ను మరచిపోయావా? చాల కాల మేమీ ఐనట్లు నా కనిపించడం లేదే! ఇంటికి దూరమై ఎన్నాళ్ళయిందో నాకు తెలియదు. నువ్వు నన్ను మరచిపోయావేమో కానీ నేను నిన్ను మరచిపోలేదు నాన్నా. నువ్వు నన్ను వెతుకుతున్నావో లేదో కాని నేనింకా నిన్ను వెతుకుతూనే వున్నాను.

అమ్మ ఎలావుంది? అక్క ఎలా వుంది? ఎన్నో అడుగుదా మనుకున్నాను. నన్నెందుకు వినిపించుకోలేదు నాన్నా? నిజంగా నన్నుమర్చి పోడం నీకు సాధ్యమేనా? నేను—నీ సీతని నీ సీతని నాన్నా

* * *

"అమ్మాయి వయస్సు ఎనిమిది. అందంగా బొద్దుగా వుంటుంది. కళ్ళు చక్రాల్లావుంటాయి. పేరు సీత. నీలం జాకెట్టూ, ఆకుపచ్చ పరికిణీ కట్టుకుంది. చెవులకి బంగారు రింగులున్నాయి. ఇంకేమీ నగలులేవు వొంటిమీద. నిన్న సాయంత్రం ఆడుకుందుకు వెళ్ళింది. ఎంతకీ రాలేదు. శాయశక్తులా వెదికాం. ఫలితం లేక పోయింది. ఇన్‌స్పెక్టర్ నా సీతని వెదికించి నాకప్పగించరూ?" గాద్గదిక కంఠంతో ప్రాధేయ పడుతున్నట్లు అన్నాడు గోపాలరావ్.

"మీరేం చేస్తుంటారు?"

"టీచర్‌ని. స్కూలు టీచర్‌ని. నేను లేక పోతే అన్నమేనా తినదు సీత. దయచేసి వీలు

అయినంత తొందరగా సీతని వెదికించరూ?"

"ప్రయత్నిస్తాం. రిపోర్టు సంతకం చేసి మీరు వెళ్ళండిక."

"సార్...."

"చెప్పానుగా చూస్తామని" విసుగొచ్చింది సబినస్పెక్టరాఫ్ పోలీస్‌కి. ఔను. తప్పిపోయింది అతని సీతకాదు. కనీసం ఓ ఆఫీసరుగారి అమ్మాయేనా కాదు. ఓ టీచరు సీత. ఎద్దు పుండు కాకికి నొప్పికాదు. స్కూలు టీచరు సీత సబినస్పెక్టరుగారికి ముద్దుకాదు. కనుకనే-

"దేనికయినా యోగముండాలి. దైవం అనుకూలించకపోతే మానవ ప్రయత్నం ఫలించదు. గుండె రాయి చేసుకో" అని చివరి మాటగా అర్ధాంగితో చెప్పెయ్యవలసి వచ్చింది గోపాలరావుకి — పోలీసు రిపోర్టిచ్చిన ఆరు నెలల అనంతరం.

* * *

చీకటి పడుతున్నా ఆటలు పూర్తవలేదు. సీత దొంగ అయింది. కళ్ళకి గంతలు కట్టుకుని—తడుముకుంటూ నడుస్తూంది. ఎవరో అందారు చేతికి. "దొంగ" అరవబోయింది. నోరు నొక్కేశారు. ఏదో తియ్యని వాసన. భయం వొళ్ళు తెలియని తనం. కళ్లమూతలు పడుతూ బాబోయ్ ఏమౌతూంది? కళ్ళు తెరిచేసరికి కళ్ళ కెదురుగా జిల్లేడు మొక్కలు. కంటికి దగ్గరగా జిల్లేడు కొమ్మలు. ఆ మొక్కలూ కొమ్మలూ ఎందుకో?

"పాపా ఈ చాక్‌లెట్ తిను యిటు చూడు."

చాక్‌లెట్ వేపు చూసింది. కళ్ళలో యేదో పడింది. ఒక కంటిలోనే. భగ్గుమని మంటలు. కెవ్వున కేకవేసి ఏడుపు లంకించుకుంది. వాళ్లు తినడానికేదో పెట్టారు. తింది—ఆకలికి వుండలేక. నిద్రవొచ్చేసింది. లేచాక—ఒక కన్ను మండుతూనే వుంది. రెప్ప తెరవడానికి వీలు లేకపోయింది.

వారం పదిరోజులకు తెలిసిపోయింది. తనెవరో ఎత్తుకొచ్చారు. వాళ్ళు-కావాలని తనని గుడ్డిదాన్నిచేసి వదిలారు. ఆవేళ తనకోసం

# రచయితను గురించి



జననం: 1940. విద్యార్హత: బి.ఎ.ఎకనమిక్స్. రచనపరంగా : అడగని వాళ్ళదీ అచ్చెయ్యని వాళ్ళదీపాపం అన్నధోరణిలో యీ మధ్యవరకూ తెగరాసి — అంటే 150-200 కథలూ, 15-20 నవలికలూ, 5-6 నవలలూ- యిక అలసి- యీ మధ్య నుంచే ఉధృతం తగ్గించాను. కొంచెం రెగ్యులర్‌గా పత్రికలు చూసేవాళ్ళకి నా కథలు తగులుతూనే ఉంటాయి. జ్యోతిలోనూ చాలానే రాశాను.

నా నమ్మకం—"కథకయినా నవలకయినా నవ్యతే ప్రాణం" అని. ధ్యేయం "ఏ రెండూ ఒకలా ఉండనంతకాలం రాసుకుంటూ పోవడం."

అభిమాన రచయితలు:—కథలకు మా అన్నయ్య ఐ. జె. రావూ, నవలలకి పురాణం సుబ్రహ్మణ్య శర్మా.

ప్రస్తుతం—L.I.C.లో పనిచేస్తూ అనకాపల్లిలో నివాసం.

ఇప్పటి కింతే సంగతులు

—ఇచ్ఛాపురపు రామచంద్రం

లారీ వచ్చింది. దాన్నిండా తనలాటి పిల్లలే. లారీలో తీసుకువెళ్ళారు తనని. రోడ్లుకలిసే చోట ఓ గోనెపరచి కూర్చోపెట్టారు. ఆవూరు కొత్తది. ఆ మనుషులు కొత్తవాళ్ళు. ఆ భాష కొత్త.

మొదట ఒకటి రెండురోజులు యెవరో కూర్చుని—"ఈ గుడ్డిదానికి ధర్మం చేయండి. పిల్లముఖంచూసి పైసా వెయ్యండి" అనిరోడ్డు మీద పోయేవార్ని నడిగేవారు. తరువాత తనం తట తానే అడుక్కునేది. ఆ భాష కొంచెం తెలిసింది. పారిపోదామని ప్రయత్నించింది. ఊరి పొలిమేరలు దాటకుండానే సేట్ జీ మనుషులు పట్టేశారు. పట్టి—

తలుచుకుంటేనే భయంగావుంది. కూర్చోబెట్టి—కాళ్ళు చాపమని—మోకాలి దగ్గర—కర్రబండతో ఒకే ఒకదెబ్బ- ప్రాణాలు పోయాయేమో అనిపించేంత భయం. గొల్లున గోల. అలా కుంటిదాన్ని చేశారు. గుడ్డిదీ కుంటిదీ కూడా అయ్యాక తనకి దినాదాయం పెరిగింది. అది గమనించి సేట్ నవ్వాడావేళ. "దెబ్బకి రెండు పిట్టలు."

తనెంత బాధపడితే వాళ్ళకేం?

"చీకటీ, నువ్వు మా నాన్నకిచెప్పు. నువ్వు తప్ప నాకెవరుచేస్తారు సాయం? మనుషులని ఎత్తుకుపోయి ఇలా కుంటివాళ్ళనీ గుడ్డివాళ్ళనీ ఎందుకు చేస్తారని నాన్నకి సందేహంగా వుంటుందేమో. వాటికి జవాబుగానూ వుంటుంది. నా బతుకెలాటిదో తెలియనూ తెలుస్తుందని చెబుతున్నాను. వినీ—అందచెయ్యి. నేను పెద్దగా మాటలాడుతున్నానని ఆశ్చర్యపడకు. పరిస్థితులూ అనుభవాలూ మనిషిని వయసు కంటె త్వరగా పెద్దచేసి వదలి పెడతాయ్. సరే. ఆ విషయానికేం.

పిల్లల నెత్తుకుపోయే మురాకి చిక్కాను. కుంటికీ గుడ్డికీ భిక్షం దొరుకుతుందని నన్ను వాళ్ళు గుడ్డిదాన్నీ కుంటిదాన్నీ చేశారు. ఒక విధంగా నేను నయమే. కొందరాడ పిల్లల నయితే వయస్సు వచ్చేవరకూ పెంచి విదేశాలకు అమ్మేయడమో, ఈ దేశంలోనే వ్యభిచారులుగా మార్చెయ్యడమో చేస్తాడట మా సేట్ జీ. ఎక్కడెక్కడినుంచి పిల్లల నెత్తుకొస్తారు. మా దినచర్య—తూరుపు తెల్లారక మునుపు ప్రారంభమవుతుంది. లారీలలో మమ్మల్నందరినీ యెక్కించి యెవరి స్థలాలకు వారిని చేరుస్తారు. అక్కడనుంచి మేమడుక్కోవడం ప్రారంభిస్తాం. రోజు సంపాదనలోకొంత భాగం సేట్ కి పోతుంది. మిగిలింది మా తిండికీ గుడ్డకీ. ఏనాటికీ నా బతుకిక్కడ ఇంతే.

ఉండీ ఉండీ అమ్మా నాన్నా గుర్తుకొస్తారు. ఏడుపొస్తుంది. ఎవరూ ఓదార్చరు. పగలంతా అడుక్కోడంతోనే సరి. అరిచి అరిచి వుంటామేమో చీకటిపడి మెతుకులు తినేసరికి కళ్ళు మూతలు పడిపోతాయి. చదువుకుందామనుకున్నాను. నాన్నలా ఉద్యోగం చేద్దామనుకున్నాను. అమ్మలా పెళ్ళి చేసుకుందామనుకున్నాను. మంచిమంచి బట్టలు వేసుకుందామనుకున్నాను. ఏదీ కుదరలేదు. ఈ బతుకు నాకు విసుగొస్తూంది. సేట్ నా చుట్టూ యెటువంటి కాపలా వుంచుతాడంటే—చివరికి చావాలన్నా వాళ్ళకన్ను కప్పలేను. నాకీ నరకం ఏమీ బాగులేదు. అందుకే—నాన్నా, నన్ను మళ్ళీ ఇంటికి తీసుకువెళ్ళు. అమ్మతోనూ నీతోనూ ఆనందంగా ఉండనీ. ఏం నాన్నా రావూ? నాన్నా రావూ? నాన్నా రావూ?"

చీకటిలో దుఃఖపు ఛాయలు నింపుకుని. ఆమె ఆవేదన ఆలాపన అభ్యర్థన.

* * *

గోపాలరావ్ జుత్తుపీక్కున్నాడు. ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. తనిక్కడికి రాకపోతే బాగుండేది. స్కూలు టీచరుకి కలకత్తా ప్రయాణమేమిటి? వచ్చినా. సీత కనబడకపోతే బాగుండేది. ఐనా-సీత ఎందుకు కనపడాలి తనకి? కనిపించినా—అలాగా ఆ వేషంలోనా?

ఇప్పుడేం చెయ్యడం?

ఈ అగ్నిపరీక్షనెలా యెదుర్కోడం?

సీత—కుంటిది.

సీత—ఒంటి కంటిది.

మొదట ఆనవాలు తెలియలేదు. కాని- ఆ గొంతు విని ఆ పిలుపువిని తను తడబడ్డాడు. సీతా అని పిలిచేకుండా ఎలా నిగ్రహించుకున్నాడో తనకే తెలియదు. సీతనలా చూసేసరికి గుండె నీరు అయింది. వాత్సల్యంతో హృదయం ఆర్ద్రమైంది. ఒక్కసారి స్వాధీనం తప్పి "సీతా" అని పిలిచేసే వాడే.

కాని—

కఠోరమైన వాస్తవం వివేకం—అడ్డుపడ్డాయి—గుండెకీ, గొంతుకీ.

ముఖంతిప్పుకున్నాడు. నడకవేగం పెంచాడు.

తనకు దగ్గరవాలని సీత సీతకి దూరమవాలని తను.

తనే గెలిచాడు. ఔను. సీత కుంటిది.

ఎంత బాధ పడిందో అమ్మాయి.

కాని—తనేం చెయ్యగలడు?

పరిస్థితులకు బందీ. సమాజంలో ఓ ఖైదీ. ఆ గోడలు దాటలేని అసమర్థుడు.

సీతా!

ఈ నాన్న ఆనాటి నీనాన్న కాదమ్మా.

ఆరుగురు ఆడపిల్లల తండ్రి. మీ అక్కకి పెళ్ళిచెయ్యటంలేదని బంధువులూ మీ అమ్మా పోరుతుంటే—ఇక్కడ చవకలో పెళ్ళికొడుకు దొరుకుతాడని విని వచ్చాను. నువ్వు కనిపించావు.

కాని నిన్నెలాగ ఇంటికి పిలువగలను? దురదృష్టవశాత్తూ — మధ్యతరగతి సంసారానికి ఒక్కొక్క ఆడపిల్లా ఒక్కొక్క శాపం. కనీసం పదివేలయినా పరిహారం చెల్లించక పోతే ఆ శాపానికి నిష్కృతి దొరకదు. నువ్వు





కాక ఐదుగురు. అంటే ఐదుపదులు. అంటే యాభై వేలు. అన్ని రూపాయలమాట దేము డెరుగు. పైసలయినా కూడ బెట్టగలనా అని నా అనుమానం. అదీకాక—నువ్వు ఆఇంట్లో సుఖపడేది ఏమీలేదు. యాచించి అయినా రెండుపూటలా యింత తిండి తినగలుగుతు న్నట్టే వున్నావు నువ్వు. మధ్యతరగతి మిధ్యా ప్రతిష్టకులోనై అందుకూ నోచుకోలేదు నీ అక్క చెల్లెళ్లు. బడి పంతులిని. బండెడు సంతానమయితే కనగలిగాను కాని వాళ్ళకిమంచి పెంపకం అందించగలిగే ఆర్ధిక స్తోమతెక్కడిది? మధ్య తరగతి కుటుంబం కనక—ఆకలి వేస్తున్నా అణచుకోవాలే తప్ప అడుక్కోలేరు. ఏ కూలో నాలోచేసి పొట్టపోసుకోలేరు. మిధ్యా గౌరవం మరి. అదీకాక—

నిన్ను వాళ్ళందరూ సరిగా ఆహ్వానించ గలరన్న నమ్మకమూ నాకులేదు. అంగ వైకల్యాన్ని హాస్యాస్పదమయిన విషయంగా తీసుకునేవారే తప్ప సానుభూతిచూపే సంస్కారుల సంఖ్య స్వల్పం. నీ ముఖంమీదే అనేస్తారు చుట్టుపక్కల వాళ్ళు —'అయ్యో! ఓ కన్నూలేదు, కాలూలేదు. నీకు పెళ్ళెలా ఔతుందే? ఎంత డబ్బు కక్కుర్తివాడయినా బొత్తిగా నీలాటి దాన్నెలా చేసుకొంటాడు?'

అమాయకత్వం కొద్దీ పిల్లలూ, అజ్ఞానం కొద్దీ పెద్దలూ నీ మనసులో మాటల ముళ్ళు గుచ్చుతూంటారు. మీ అమ్మయితే, నిన్నిలా చూసి కుమిలికుమిలి ఏడుస్తుంది. నువ్వు ఆమెకు నిత్య సమస్యవౌతావు. అనుక్షణమూ మీఅమ్మ నీ గురించి దీని జీవితం ఎలా తెల్లవారుతుందా అని బెంగెట్టుక్కూర్చుటుంది. ఇప్పటికే మీ అమ్మకి ఐదు దిగుళ్ళు. ఐతే—ఆ అయిదూ ఒకెత్తు. నువ్వు ఒకెత్తు. నువ్వు వస్తే యింట్లో యెటువంటి ఆతిధ్యం జీవితం భవిష్యత్తు లభిస్తాయో నా ఊహ మేరకు చెబుతున్నానంతే. నా గురించికూడా చెప్పెయ్యనీ. బాధగానూ సిగ్గుగానే ఉందనుకో. కాని తప్పదు. నిజం చెప్పేద్దామన్న దుగ్ధ నన్ను పీకుతోంది.

బడిపంతులినికదా? నలుగురిలోనూ పేరుం టుంది, పలుకుబడి శూన్యమయినా. అయిన దానికీ కానిదానికీ అప్పులుచేస్తూ సంసారయాత్ర సాగించే యెవరికి మాత్రం సంఘంలో పలుకు బడీ గౌరవమూ వుంటాయి. అయితే—అటు వంటి వాళ్ళుకూడా నలుగురికీ తెలుస్తారు—వేరే కోణంనుంచి. అటువంటి పేరు నాకూ వుంది.

పలానా మాస్టారమ్మాయి చిన్నప్పుడు తప్పి పోయింది. కుంటీ గుడ్డీ ఐ—మళ్ళీ దొరికిం దట. మాస్టారమ్మాయికి కన్నులేదు. కాలు లేదు. ఎలా వుంటుందో! చూద్దామా?

మీ పరిస్థితికి మా సానుభూతి. మీఅమ్మాయి ఎప్పుడు యెలా తప్పిపోయింది? మళ్ళీ యెలా దొరికింది. ఎక్కడ దొరికింది. ఆ అమ్మాయికి పెళ్ళి చేస్తారా? కష్టమే. గంతకుతగ్గ బొంత. ఎక్కడో కుంటివాడో గుడ్డివాడో దొరకాలి. అమ్మాయిఅదృష్టం బాగుంటే దొరుకుతాడేమో చెండి. అసలు మీ అమ్మాయి పుట్టుగుడ్డేనా? మొదటినుంచీ కుంటిదేనా? పూర్వజన్మలో యే పాపం చేశారో, లేకపోతే ఇదేమిటి? పుణ్యం కొద్దీ పురుషుడూ, దానంకొద్దీ బిడ్డలూ పూర్వులు ఊరికే అనలేదు.

ఇన్నాళ్ళూ మీ అమ్మాయి యెక్కడుంది? ఎలావుంది?

నన్నుచూస్తే చాలు. ప్రశ్నలు ప్రశ్నార్ధ కంలాంటి ముఖాలు. అవే ఎదురౌతాయి. వాటికి జవాబు చెప్పడం నాతరం కాదు సీతా. నాతరం కాదు.

అక్క తరవాత నువ్వే. అంటే నేను

చెయ్యవలసిన పెళ్ళి రెండోది..,నీదేఔతుంది. నీకు నేనెలాగూ పెళ్ళిచెయ్యలేను. పెళ్ళికొడుకుల కళ్ళుగప్పగలిగే డబ్బు సంచీలు నాదగ్గర లేవు. కనుక నీ పెళ్ళి నాకు అసాధ్యంగానే మిగులుతుంది ఏ నాటికీ. నువ్వింట్లో వుంటే నీ పెళ్ళికాకుండా నీ చెల్లెళ్ళకు పెళ్ళికాదు. పెద్దపిల్లవుండగా మానేసి చిన్నవాళ్ళకి పెళ్ళేమిటి అంటారు. ఈ దేశంలో మన కుటుంబాలలో ఆడపిల్లకి జీవితమంటే పెళ్ళి. అంతే. అది నీకు నేను చెయ్యలేను.

నిన్ను చూసిన నువ్వు పలకరించబోయిన నాన్నా అని పిలవబోయిన—క్షణంలోనే నేను ఇవన్నీ ఆలోచించాననికాదు. నిజంగా నిన్ను చూసి గుర్తుపట్టిన క్షణంలో నాకు విపరీతమయిన భయంవేసింది. అందుకే నువ్వు "నాన్నా" అని పిలుస్తున్న కొద్దీ దూరంగా దూరంగా ఇంకా దూరంగా ఐపోయాను. నేను వట్టి పిరికివాణ్ని. అసమర్థుణ్ని. నన్ను క్షమించమని నిన్నడిగే అర్హతకూడా నాకులేదు.

సీతా! నీ బతుకు నువ్వే బతకాలి. కుంటిదానివీ గుడ్డిదానివీ ఐన నీకు ఆదరమూ ఆశ్రయమూ అవసరం. కాని ఆ కారణాలుగానే వాటిని నీకివ్వలేక పోతున్నాను.

'నాన్నా, రావూ' అని నువ్వు ఏడుస్తూ ప్రాధేయపడుతూ, పిలుస్తున్న పిలుపు—యీ చీకటిలో నాకు వినపడుతూ నా గుండెలను మండిస్తూనేవుంది.

కాని—

సీతా!

నా అమ్మాయీ.

నేను రాలేనమ్మా. రాలేను.' 

---

# నవ్వితే నవ్వండి!

"సంవత్సరాల తరబడి మీ యింట్లో తిష్టవేసు క్కూర్చున్న మీ మామగారిపై పగసాధించేనన్నావు! ఎలా?"

"హైద్రాబాదు ట్రెయినెక్కించి ట్రెయిన్ టిక్కెట్టుకు బదులు ప్లాట్ ఫారం టిక్కెట్టిచ్చి పంపించేశా!"

* * *

"నా పెళ్ళాం చిలకలా వుంటుంది!"

"అంత అందంగానా ?"

"కాదు. చెప్పిన విషయాన్నే మళ్ళీ మళ్ళీ చెప్పి బోర్ కొడుతుంది!"

* * *

"భోంచేసే ముందు నేను దేవుడ్ని ప్రార్థిస్తా "

"నాకా బాధలేదు! నా పెళ్ళాం బాగానే వండుతుంది!"

* * *

"మీ కథ నడిచే తీరు బాగాలేదే!"

"ఎలా బావుంటుంది? అందులోని హీరోయిన్ కుంటిదిగా?!"

* * *

"బలరామయ్య తమ్ముడా మీరు! నాకు ఇవాళ పొద్దున్నే తెలిసింది!"

"అదేంటి సార్ ? నేను 30 సంవత్సరాలుగా ఆయన తమ్ముడిగా వుంటున్నాను! మీరు ఇవాళే అంటున్నారే?"

సేకరణ: ఆర్. శివరాజన్

సీరియల్




మల్లాది వెంకటకృష్ణమూర్తి

జరిగిన కథ :

ఎవరి మాటలు వినో తన భార్య ప్రియంవద శీలాన్ని శంకించి విపరీతమైన వేదనకు గురి అయాడు సత్యమూర్తి. ఆ ఆలోచనలలోనే తన మొదటి భార్య శ్రీవల్లి జ్ఞాపకాలతో సతమత మవుతున్నాడు. సత్యమూర్తీ, శ్రీవల్లీ రాజమండ్రి బయలుదేరారు. దారిలో సత్య మూర్తి పొరపాటున మరో బస్సు ఎక్కాడు.

సత్యమూర్తి గుండెలో గునపం దిగి నట్లయింది. కంగారుగా వున్న సత్య మూర్తి మొహం చూసి అడిగాడు కండక్టర్.

"ఏమిటి?"

"ఇది ఏ బస్సు?" అడిగాడు.

"హైద్రాబాద్."

"ఎక్కడనుంచి బయలుదేరింది?"

"తెనాలి టు హైద్రాబాద్. ఏం?"

అర్థమయింది సత్యమూర్తికి తన పొరపాటు. "అయ్యో" అన్నాడు బాధగా నిలబడలేక ఓ సీట్ కి ఆనుకుని కూర్చుని.

"ఏమయింది?"

"నేను నా భార్య కూతురు కలసి హైదరాబాద్ నుంచి నిన్నరాత్రి రాజమండ్రీ బయల్దేరాం...."

సత్యమూర్తికి వూపిరాడటంలేదు ఆదుర్దాతో, బాధతో.

"అయితే ఈ బస్సులో యెలా వున్నారు?"

"మధ్యలో టీకోసం దిగి ఇదే మేం యెక్కిన బస్సనుకుని యెక్కాను."

— "అంత చూసుకోకపోతే యెలా?"

—"వాళ్ళు రాజమండ్రి వెళ్ళి వుంటారు."

—"అయినాఅర్ధరాత్రి బస్సు దిగడం దేనికి టీనీళ్ళకోసం?"

—"వెంటనే రాజమండ్రి వెళ్ళండి."

—"టెలిగ్రాం ఇచ్చి కనుక్కోండి చేరారో లేదో వెంటనే.ఆలస్యంచేయద్దు"

ప్రయాణీకులు రకరకాలుగా సత్యమూర్తికి తమ సంతాపాన్ని తెలియచేస్తూ సలహాలు ఇవ్వసాగారు సంగతి తెలుసుకుని.

"అయితే టిక్కెట్ లేకుండా ఎక్కారా ఈ బస్సులో?" అడిగాడు కండక్టర్.

"రాజమండ్రి టిక్కెట్స్ నా దగ్గరే వున్నాయి వాళ్ళవికూడా."

"వాళ్ళవికూడా మీ దగ్గరే వున్నాయా? దారిలో చెకింగ్ జరిగితే ప్రమాదంకదా?"

సత్యమూర్తికి బాధగా వుంది. మన సంతా ఎంతో బరువుగా వుంది. నిబ్బరించుకోలేకపోతున్నాడు. మళ్ళీ వాళ్ళని చూస్తేనేకాని మనసు నిలకడగావుండదు. కుదుటపడదు.

బస్ ఎవైటింగ్ పాయింట్ లో ఆగింది. ఒక్కొక్కరే దిగసాగారు. సత్యమూర్తి అందరికన్న ముందరే కండక్టర్ వెనకాల దిగాడు. దిగాలుపడి నించున్న సత్యమూర్తికి అందరూ ఏం చేయాలో సలహాలు ఇచ్చి వెళ్ళిపోసాగారు.

కండక్టర్ చెప్పాడు సత్యమూర్తితో "కంట్రోలర్ దగ్గరకి వెళ్ళి జరిగింది చెప్పండి. రాజమండ్రికి ట్రంక్ కాల్ చేసి మాట్లాడుతారు. వాళ్ళు చేరారో లేదో తెలుస్తుంది. రాజమండ్రికి ఆ బస్సు చేరడానికి ఇంకా టైం వుండివుండవచ్చు. మీ భార్యతో మాట్లాడొచ్చుకూడా."

సత్యమూర్తి కంట్రోలర్ తో జరిగింది చెప్పాడు.

"ఆ బస్సు రాజమండ్రి చేరుకుని గంట దాటివుంటుంది. ఆ బస్సు కండక్టర్ కూడా దొరక్కపోవచ్చు. ఫోన్ చేసి వుపయోగం వుండదు. మీరు వెంటనే రాజమండ్రి వెళ్ళటం వుత్తమం" అని ఆగి చెప్పాడు ఆలోచనగా కంట్రోలర్.

"రాజమండ్రి బస్ డిపో కంట్రోలర్ తో మాట్లాడతాను, ఆ కండక్టర్ ని పిలిపించి వాళ్ళు రాజమండ్రిలో దిగారో లేదో కనుక్కోమని. ఒకవేళ వాళ్ళు కంగారుపడి దారిలో దిగిపోయివుంటే కనీసం ఎక్కడ దిగిందీ తెలుసుకునివుంటే మీరు అక్కడ కంట్రోలర్ ని కంటాక్ట్ చేయచ్చు వెళ్ళగానే."

"ఇప్పుడు వెళ్ళడానికి బస్సువుందా?" దీనంగా అడిగాడు సత్యమూర్తి.

"విజయవాడదాకా వున్నాయి చాలా. ముందర విజయవాడ చేరుకోండి. అక్కడనుంచి రాజమండ్రికి ఎలాఅయినా వెళ్ళచ్చు."

సత్యమూర్తికి కాఫీ తాగాలని కూడా అనిపించలేదు. బస్సుడిపోలోకి వెళ్ళాడు. మరో అరగంటలో విజయవాడకి వెళ్ళే బస్ వుంది. దాంట్లో టికెట్ దొరికింది.

చన్నీళ్ళతో మొహం కడుక్కుని బస్సులో కూర్చున్నాడు. శ్రీవల్లిగురించే ఆలోచిస్తున్నాడు. తెల్లారాక చూసుకుని

వుంటుంది తను బస్‌లో లేకపోవటం. ఏంచేసి వుంటుంది?

దిగిపోయివుంటుందా? లేదా అదే బస్సులో రాజమండ్రి వెళ్ళివుంటుందా? మధ్యలో తణిఖీఅయితే? అయివుంటుందా? ఇప్పు డెక్కడుంది తన రాణి? క్షేమంగా వుందా? హేండ్‌బేగ్‌లో డబ్బుందా దగ్గర?

బస్ ఎంత వేగంగా వెళ్తున్నా సత్య మూర్తి తృప్తిపడటంలేదు. దారిలో అని పించింది విమానంమీద విజయవాడ దాక వెళ్ళి వుండాల్సిందని.

మధ్యలో తను రాత్రి పొరపాటున ఇంకో బస్ ఎక్కిన వూరు చూసాడు.

తను బస్సు ఎక్కినప్పుడు బస్‌లో లైట్లు లేవు. సూపర్ ఎక్స్‌ప్రెస్ బస్ లన్నీ ఒకే మాదిరిగా వుంటాయి చూడ టానికి. తను ఎక్కిన బస్సు ఏ వూరు వెళ్ళేదో చూసుకోకుండా ఎక్కేసాడు. ఆ నిద్రమత్తులో తన బుర్ర పనిచేయలేదు సరిగా. తనెక్కిన బస్ వెళ్తూండగా ఇంకా శ్రీవల్లి ఒడిలో సత్యవల్లిని వుంచుకుని అలాగే నిద్రపోతూండి వుంటుంది అక్కడ.

సత్యమూర్తి బస్ విజయవాడ చేరే దాక ప్రాణాలు వుగ్గబెట్టుకుని కూర్చు న్నాడు. విజయవాడలో దిగి సుందర రాజమండ్రికి వెళ్ళే బస్సు ఎప్పుడుందో కనుక్కున్నాడు.

గంటన్నరకికాని లేదు.

తర్వాత విజయవాడలో శ్రీవల్లి దిగి తనకోసం ఎదురుచూస్తోందేమోనని వెయి టింగ్ రూమ్‌లో, బస్‌స్టాండ్‌లో చూసాడు జాగ్రత్తగా.

కనపడలేదు.

రాజమండ్రి వెళ్ళిపోయివుంటుందా అదే బస్సులో?

శ్రీవల్లి అలాంటి పరిస్థితిలో ఏం చేస్తుందో. ఏంచేసివుంటుందో వూహించ లేకపోతున్నాడు సత్యమూర్తి, అతను దాదాపు రెండున్నర ఏళ్ళగా శ్రీవల్లితో కలిసి కాపురం చేస్తున్నా.

బస్‌స్టాండ్ బయటవున్న పెద్ద హోటల్‌లోని ఏర్‌కండిషన్డు రెస్టారెంట్‌కి వెళ్ళాడు. టిఫిన్ ఆర్డర్ చేసాడు కాని

---

(వి) చిత్ర విజ్ఞానం



తల్లులు తమ పిల్లల్ని తమ ఎడమవైపునే ఎందుకు ఎత్తు కుంటారు? లీ సాల్క్ "సైంటిఫిక్ అమెరికన్" పత్రికలో యీ విధంగా వివరించారు. "శిశువు తల్లి గర్భంలో పెరుగుతున్న ప్పుడు, క్రమేణా తల్లి గుండె శబ్దానికి అలవాటు పడిపోతుంది. అంతే కాకుండా తల్లిగర్భంలో తనకి సమ ఉష్ణోగ్రత, సరిపడా ప్రాణవాయువు, ఆహారం, తల్లి రక్తంనుండి లభిస్తుంటుంది. ఈ చక్కటి వాతావరణానికి అలవాటుపడ్డ పసిగుడ్డు, వెలికిరాగానే అలాంటి వాతావరణాన్నే కోరుకుంటుంది. తల్లికి యీ రహస్యం తెలుసు గనకనే, పిల్లను తన ఎడమవైపున ఎత్తుకుని తన గుండెకు దగ్గరగా హత్తుకుంటుంది. ఆమె గుండెశబ్దం పసిపిల్లలకు యెంతో ఉపశమనం కలిగిస్తుంది.

సయించలేదు. తినకుండా అలాగే వదిలేసి కేవలం కాఫీమాత్రం తాగి మళ్ళీ బస్ స్టాండ్ చేరుకున్నాడు.

శ్రీవల్లికోసమే వెదుకుతున్నాయి కళ్ళు.

రాజమండ్రి బస్ వచ్చింది.

చీకటిపడ్డాకచేరుకున్నాడు రాజమండ్రి. సరాసరి కంట్రోలర్ దగ్గరకి వెళ్ళాడు. ఆదుర్దాగా అడిగాడు.

"నిన్న రాత్రి రాజమండ్రికి హైదరాబాద్‌నుంచి వచ్చిన బస్సులో నా భార్య వచ్చిందా?"

అతను అర్ధంకానట్లుగా చూసి అడిగాడు.

"అంటే?"

వివరంగా జరిగిందంతా వూపిరి పీల్చుకోకుండా చెప్పాడు సత్యమూర్తి. తర్వాత అడిగాడు.

"మీకు వుదయం హైదరాబాదునుంచి ఫోన్ చేసి వుండాలి అక్కడి కంట్రోలర్."

అతను కొన్ని క్షణాలు ఆలోచనగా చూసి చెప్పాడు సత్యమూర్తితో.

"మీ ఆవిడ విజయవాడలో చూసుకుంది మీరు బస్సులో లేని సంగతి. ఆ సంగతి కండక్టర్‌కి చెప్పింది వెంటనే. మీరు దారిలో మిస్ అయివుంటారని అనుకున్నారంతా."

"అదే బస్‌లో వచ్చిందా?"

"రాలేదు. విజయవాడలో దిగి దిగిపోయింది."

"అదేం?"

"టిక్కెట్స్ లేవు కాబట్టి."

సత్యమూర్తి అయోమయంగా చూశాడు కంట్రోలర్‌వంక.

"కండక్టర్ దింపేశాడు."

"రాజమండ్రిదాకా వస్తానందా?"

"అవును. విజయవాడ నుంచి టిక్కెట్ కొనడానికి ఆవిడదగ్గర డబ్బు లేకపోయింది. కండక్టర్ విజయవాడ తర్వాత ప్రయాణం చేయడానికి వప్పుకోలేదు."

"కాని నా భార్య టిక్కెట్ రాజమండ్రిదాకా కొన్నాగా?"

"కావచ్చు. కాని ఆవిడదగ్గర లేవుగా. దారిలో చెక్కింగ్ అయితే కండక్టర్‌కి తన వుద్యోగం వూడచ్చనే భయం వుండటం సహజం."

సత్యమూర్తి మొహంలోని బాధని గుర్తించి చెప్పాడు కంట్రోలర్.

"సారీ. అసలు పేసెంజర్లు అంతా బస్ ఎక్కారో లేదో లెక్కపెట్టుకొని చూసుకొని వుండాల్సింది కండక్టర్. అదే విధంగా మీరు తప్పు బస్సు ఎక్కినప్పుడు ఆ కండక్టర్ ఓ పేసెంజర్ ఎక్కువ వున్నాడన్న సంగతికూడా చూసుకొని వుండాల్సింది. ఈ రెండిట్లో ఏది జరిగినా కొంతలో కొంత మేలు జరిగి వుండేది."

"నేను విజయవాడలో దిగి చూశాను. నా భార్య కనపడలేదు. విజయవాడలోనే దిగిందా?"

"అవును. నేనా కండక్టర్‌ని పిలిపించి మాట్లాడాను."

"నా భార్యదగ్గర టిక్కెట్‌కి కూడా డబ్బులు లేవా?"

"ఉండివుంటే కొని వుండేదిగా."

సత్యమూర్తి మొహంలో కరడుకట్టు కొన్న బాధని గుర్తించి చెప్పాడు

కంట్రోలర్.

"విజయవాడలో మీ చుట్టాలెవరయినా వున్నారా? వాళ్ళింటికి వెళ్ళిందేమో?"

"ఆ కండక్టర్ దొరుకుతాడా ఇప్పుడు? మాట్లాడుతాను."

"లేదు. డ్యూటీమీదవెళ్ళిపోయాడు."

సత్యమూర్తి దీర్ఘంగా నిట్టూర్చాడు. రిక్షా ఎక్కి దానవాయిపేటలో వున్న తన అక్కయ్య ఇంటికి వెళ్ళాడు.

"ఏరా? ఒక్కడివే వచ్చావే?" అడిగింది సత్యమూర్తి అక్కయ్య.

ఆవిడ కాళ్ళకి పసుపు పూసి వుంది. తలంటిపోసుకున్న నెత్తిమీద అక్షింతలు. తమలపాకులు వేసుకొన్న గుర్తుగా నోరు ఎర్రగా వుంది. పట్టుచీరలో వుందావిడ.

"మీ బావగారు నిద్రపోతున్నారు. రా. దేముణ్ణి చూద్దువుగాని. సామానేది? బట్టలు తెచ్చుకోలేదా? ఆ అవతారం ఏమిటి?" అడిగింది.

తమ్ముడి మొహంలోకి వెదుకుతున్నట్లుగా పరీక్షగా చూసి అడిగింది అప్పుడు.

"అలా వున్నావేమిటి? మొహం పీక్కుపోయిందే? భోజనంచేసి ఎన్ని రోజులయింది...." అని అడిగింది మళ్ళీ ఆదుర్దాగా.

"ఏం జరిగింది? శ్రీవల్లి ఏది?"

సత్యమూర్తి ఎంతో ప్రయత్నంమీద తన కళ్ళ నీళ్ళని ఆపుకుని జరిగింది చెప్పాడు.

భయంతో ఆవిడ మొహం ముడుచుకుపోయింది వెంటనే.

"దానిదగ్గర అయిదు రూపాయలు కూడా లేకుండా ఎందుకుంచావ్?" అడిగింది.

"నాకు తెలీదు. ఉందనుకున్నాను."

"మీ బావగారిని లేపుతానుండు" అని గబగబా లోపలికి వెళ్ళింది.

క్షణాలలో నిద్రమత్తు మొహంతో వున్న తన భర్తతో వచ్చింది ఆవిడ.

అయిదు నిముషాల తర్వాత ఆయన, సత్యమూర్తి విజయవాడ బయల్దేరారు.

"వేడినీళ్ళు పెడతాను. స్నానంచేసి కొద్దిగా ఎంగిలిపడి వెళ్ళరాదూ?" బ్రతిమాలింది సత్యమూర్తిని అతని అక్కయ్య.

"నా కాకలి లేదు. అది ఎక్కడ వుందో? ఏం అవస్థలు పడుతోందో? పదండి బావగారు" అన్నాడు సత్యమూర్తి.

విజయవాడ బస్‌స్టాండ్‌లో బస్ దిగారు రాత్రి పదింటికి. కంట్రోలర్ గదికి వెళ్ళి అడిగారు అతన్ని. శ్రీవల్లిగురించి అతనికేం తెలియదు. పోర్టర్లని, కిళ్ళీ షాపులవాళ్ళని, చాలామందిని అడిగారు. ఎవరూ శ్రీవల్లిని గురించి చెప్పలేకపోయారు.

క్లోక్‌రూంలోకివెళ్ళి శ్రీవల్లి సామాను ఆ గదిలో భద్రపరిచిందేమోనని చూశారు.

సూట్‌కేస్ లేదు.

"ఈ వూళ్ళో తెలిసిన వాళ్ళింటికి వెళ్ళిందేమో చూడండి" చెప్పాడు క్లోక్‌రూంలోని క్లర్క్.

"విజయవాడలో తెలిసిన వాళ్ళెవరూ లేరు మాకు" నీరసంగా చెప్పాడు సత్యమూర్తి.

"అయితే వెంటనే పోలీస్ రిపోర్ట్ ఇవ్వటం మంచిది. ఆలస్యం చేయకండి."

"అవును ముందా పని చేద్దాం" అన్నాడు సత్యమూర్తి బావ బయటికి వచ్చాక.

బావగారివెంట దిక్కులు చూస్తూ నడిచాడు సత్యమూర్తి. అతనిలో ఆలోచనా శక్తి నశించిపోయింది. మనసు నిండా బాధ, ఆందోళన, అలజడి.

సత్యమూర్తి బావే మాట్లాడాడు పోలీస్ ఇన్‌స్పెక్టర్‌తో. ఓ తెల్లకాగితం మీద రిపోర్టు వ్రాసి సంతకం పెట్టి ఇచ్చాడు. ఇంకో తెల్లకాగితంమీద సత్యమూర్తి చేత శ్రీవల్లి సూట్‌కేస్‌లోని వస్తువుల వివరాలు, వంటి మీద వున్న నగల వివరాలు, బట్టల వివరం మొదలయినవి వ్రాయించాడు.

సత్యమూర్తికి ధైర్యం చెప్పాడు అతని బావ.

"విజయవాడలో చాలా మోసాలు జరుగుతూంటాయి బావగారు! అందులో వున్ననగలన్నీ దాని వంటి మీదే వున్నాయి. ఎవడి కళ్ళు పడ్డాయో? ఎవరి మోసంలో చిక్కుకుందో? మళ్ళీ ప్రాణాలతో నా కంట పడితే చాలది. ఎలాంటి పరిస్థితుల్లో నయినా సరే అది నా కంట బడితే చాలు. దానికేం కాకూడదు. వెధవలు ఆ నగలు తీసుకొని దాన్ని వదిలిపెడితే చాలు."

ఇన్‌స్పెక్టర్ కొన్ని ఫోటోలు చూపించి ఆ ఫోటోలలోని వాళ్ళెవరయినా బస్సులో వచ్చారా? అని అడిగాడు.

సత్యమూర్తికి గుర్తులేదు. తనతోటి ప్రయాణీకులని అంత పరీక్షగా చూడలేదు.

"ఇంటికి పోదాం పద" అన్నాడు సత్యమూర్తి బావ.

"వద్దు. తిరుగుదాం. ఎక్కడయినా కనబడవచ్చు."

రాత్రి రెండున్నరదాకా విజయవాడ రోడ్లు తిరుగుతూండిపోయారు ఇద్దరూ.

"ఇంటికి పోదాం. ఇలా తిరిగి లాభం లేదు" అన్నాడు సత్యమూర్తి బావ.

"ఒకవేళ...." అని మళ్ళీ మనసు మార్చుకుని చెప్పటం ఆపేసాడు సత్యమూర్తి. కొద్దిసేపాగి అన్నాడు.

"సరే....పోదాం పదండి."

రిక్షాలో బస్టాండ్ చేరుకున్నారు ఇద్దరూ. ఉదయం ఆరున్నరకి రాజమండ్రి చేరుకున్నారు మళ్ళీ. శ్రీవల్లి ఎలాగోలా రాజమండ్రి చేరుకుని వుండచ్చన్న ఆశ అడియాశేఅయింది సత్యమూర్తికి. శ్రీవల్లి ఇంటికి రాలేదు.

తిరిగి తిరిగి అలసిపోవడంవల్ల సత్యమూర్తికి పక్కమీదకి చేరిన కొద్ది నిమిషాలలోనే నిద్ర పట్టేసింది.

**౮**

సత్యమూర్తి మానసికంగా పడే బాధని చూడలేకపోతున్నారు అక్క బావలిద్దరూ. పదిహేనేళ్ళ మేనల్లుడు, ఎనిమిదేళ్ళ మేనకోడలు సత్యమూర్తి దగ్గరే కూర్చుంటారు ఎప్పుడూ.

సత్యమూర్తి అవసరం కలిగితేకాని మాట్లాడటం లేదు. కళ్లు మూసుకుని ఏదో ఆలోచిస్తూ పడుకునుంటున్నాడు.

పోలీస్ రిపోర్టు ఇచ్చి వచ్చిన మర్నాడు సత్యమూర్తికి అనిపించింది ఏ నగో తాకట్టుపెట్టి డబ్బు తీసుకుని మళ్ళీ హైదరాబాద్ వెళ్ళి వుండచ్చని.

తనుండే ఇంటి సందులో ఓ డాక్టర్



వున్నాడని, వాళ్ళింట్లో ఫోన్ వుందన్న సంగతి గుర్తుకు వచ్చింది.

పబ్లిక్ కాల్ ఆఫీస్‌కి వెళ్ళి హైదరాబాద్‌లోని ఆ డాక్టర్ పేరు, ఇంటి సందు పేరు, పేట చెప్పి నంబర్ తెలియదని, కనుక్కుని నంబర్ కాల్ బుక్‌చేయమని అడిగాడు సత్యమూర్తి.

రెండు గంటల్లో ఆ కాల్ మెటీరియలైజ్ అయింది.

సత్యమూర్తి సుందర తనని పరిచయం చేసుకొని తన ఇంటితలుపు తీసివుందో, వేసివుందో చెప్పమని, శ్రీవల్లి వుంటే పిలవమని టూకీగా రెండు నిముషాల్లో జరిగింది చెప్పాడు.

వాళ్ళు చూసివచ్చి చెప్పారు సత్యమూర్తి ఇంటికి తాళం వేలాడుతోందని.

శ్రీవల్లి లేదు హైదరాబాద్‌లో!

ఇంటితాళంచెవి కూడా శ్రీవల్లి దగ్గరే వుంది. సాధారణంగా తనదగ్గర డబ్బు వుంచుకుంటుందే? శ్రీవల్లిదగ్గర డబ్బు యెందుకు లేకపోయింది?

హైదరాబాద్‌లో లేదు.

రాజమండ్రీలో లేదు.

ఎక్కడ వున్నట్లు?

ఏమయినట్లు?

సత్యమూర్తికి తన బాధని, దిగులుని యెలా దిగమింగుకోవాలో తెలియటం లేదు. కూతురు సత్యవల్లి గుర్తుకు రావటంలేదు. తనని విపరీతంగా ప్రేమించే, తను లేకపోతే బ్రతకలేదనుకునే తన భార్యే గుర్తుకువస్తోంది సత్యమూర్తికి.

అక్కయ్య బలవంతంచేసి పెడితే తింటున్నాడు అన్నం. తినకపోతే కోప్పడి పెడుతోంది.

శ్రీవల్లికి ఏం కాదనీ, తప్పక వస్తుందనీ రోజూ ధైర్యం నూరిపోస్తోంది రోజూ సత్యమూర్తి బావగారు విజయవాడవెళ్ళి పోలీసులు ఆచూకీ ఏమయినా తెలుసుకోగలిగారా అని కనుక్కుని వస్తున్నాడు. అలా రెండు రోజులు వెళ్ళాక, మూడో రోజునుంచి ట్రంక్‌కాల్‌వేసి

కనుక్కోసాగాడు.

వారం రోజులు గడిచాయి.

శ్రీవల్లిగురించి ఏ వివరమూ తెలియ లేదు. గాలిలో కలిసినట్లుగా మాయమయి పోయింది శ్రీవల్లి.

మనోవ్యాధితో రోజు రోజుకూ సత్య మూర్తి చిక్కిపోతున్నాడు. అతని మనసులోని బాధని యెవరూ చల్లార్చ లేక పోతున్నారు. శ్రీవల్లి ఫొటో, సత్య వల్లి ఫొటో పేపర్‌లలో వరసగా నాలుగు రోజులు ప్రకటించి, వారి ఆచూకీ తెలిపినవాళ్ళకి అయిదువందల రూపాయలు బహుమానం ఇస్తామని ప్రకటించారు.

ఫలితం లేకపోయింది.

సత్యమూర్తి మనసునిండా చెడు ఆలో చనలు జొరబడి తేనెటీగల్లా బాధిస్తు న్నాయి. ఒక్కో ఆలోచనా బాధని ఇంకాస్త ఎక్కువ చేస్తోంది.

ఏ రౌడీనో, హంతకుడో అదే బస్సులో వస్తూనో, విజయవాడ బస్ స్టాండ్‌లో శ్రీవల్లిని చూసో, మాయ మాటలు చెప్పి నమ్మించి తీసుకెళ్ళి వంటి మీద నగలు వలచుకుని ఏ కృష్ణానది లోనో, కాలువలోనో, కొండ వెనకాలో చంపి పారేసివుంటే? శ్రీవల్లి శవం యెక్కడయిన వుందా ఇప్పుడు?

ఆడవాళ్ళని అంగట్లోని సరుకులా మార్చే ఏ వెధవో శ్రీవల్లినిచూసి బలవం తంగా తీసుకెళ్ళి అలాంటి అంగట్లో ఓ సరకుగా బంధించి వుంచాడేమో? శ్రీవల్లి గుండెలు పగిలేలా ఏడుస్తూ పది మంది చేతుల్లో నలుగుతోందా ఇప్పుడు?

లేకపోతే ఏ డబ్బున్న ముసలాడి కళ్ళలోనో పడి, వాడు మాయమాటలతో శ్రీవల్లిని తనతో తీసుకెళ్ళి తన వుంపుడు కత్తెగా బలవంతంగా వుంచుకున్నాడా తలుపులు బిగింపబడ్డ గదిలో? శ్రీవల్లి తనని తలచుకుని కుమిలుతోందా ఇప్పుడు అలా!

ఏమయింది శ్రీవల్లి!

ఎక్కడికెళ్ళింది?

ఎవరు తీసుకెళ్ళారు?

ఎవరు తీసుకెళ్ళినా, ఎక్కడికివెళ్ళినా, ఏంజరిగినా తన శ్రీవల్లి తన కంటపడితే చాలు ప్రాణాలతో. ఇకనుంచి గుండెల్లో దాచుకుంటాడు తను. తన అశ్రద్ధవల్ల అజాగ్రత్తవల్లే ఇలాజరిగింది. ఈ తప్పు తనది. తనూ ఇలాజరగడానికి బాధ్యుడు. నేరం తనది. తనుచేసిన నేరానికి శ్రీవల్లి అనుభవిస్తోంది శిక్ష.

భగవాన్

శ్రీవల్లి ఎక్కడున్నా సంతోషంగా వుండేలా చెయ్యి. అంతే తనుకోరేది.

పదిరోజులు గడిచాయి.

శ్రీవల్లి జాడలేదు.

సత్యమూర్తి బాధ చూడలేక ముందర మూడురోజులూ సత్యమూర్తి బావ అత నికి మత్తుమందు యింజక్షన్‌లు ఇప్పిం చాడు.

తర్వాత అవి అలవాటయే ప్రమాదం వుందని మానేసి మైల్డ్ స్లీపింగ్ టేబ్లెట్స్ కొనుక్కొచ్చి ఇచ్చాడు.

పదిరోజుల తర్వాత అదికూడా మానే సాడు ఇక ఇవ్వటం మంచిదికాదని.

సత్యమూర్తిని వంటరిగా వుండనివ్వ కుండా అక్కయ్య తన కూతురినో, కొడు కునో ఎప్పుడూ అతనిదగ్గర వుంచుతోంది. సత్యమూర్తి ఎంతో ప్రయత్నంమీద

ఏడవకుండా నిబ్బరించుకో గలుగుతున్నాడు.

శ్రీవల్లి గుర్తురాని క్షణంలేదు. రోజూ తన పనులన్నీ శ్రీవల్లే స్వయంగా చూసేది. నిద్ర లేవగానే పేస్ట్ని బ్రష్మీద వేసి ఇవ్వడం, మొహం కడుక్కోగానే తడిమొహాన్ని తనే తుడవటం, స్నానానికి నీళ్ళుపెట్టి తువ్వాళ్ళు అందించటం, ఒకోసారి వీపు, వళ్ళు, అరికాళ్లు తనే సబ్బుతో రుద్దటం, కంచంలో అన్నం తనే కలపటం, చాలా చాలా గుర్తుకు వస్తున్నాయి. తన పనులన్నీ మళ్ళీ స్వయంగా చేసుకోవాల్సి వస్తోంది ఇప్పుడు. శ్రీవల్లిని వదిలి ఇన్నిరోజులు ఈ రెండున్నర ఏళ్ళలో ఎన్నడూ లేడు. దిగులు, బాధ, తను వంటరినయిపోయానన్న బెంగ శ్రీవల్లి ఎలావుందో ఎక్కడుందో అన్న భయం.

సత్యమూర్తి బావగారు దిగులుతో క్రుంగిపోతున్న బావమరిదిని చూసి వూరుకోలేకపోయాడు. తన భార్యతో చెప్పాడు.

"సత్యమూర్తిని ఓసారి మాణిక్య శాస్త్రిలుగారి దగ్గరికి తీసుకెళ్ళి వాడి జాతకం చూపిద్దాం. గ్రహస్థితి బాగాలేక ఏమయినా శాంతులులాంటివి జరిపించాల్సిన అవసరం వుందంటే చేయించచ్చు."

"తీసుకు వెళ్ళండి. ప్రయత్నం చేద్దాం" అన్నది సత్యమూర్తి అక్కయ్య.

ఆరోజు సాయంత్రం సత్యమూర్తిని తీసుకొని విజయవాడ వచ్చాడు అతని బావ.

ముందర పోలీస్ స్టేషన్కి వెళ్ళి శ్రీవల్లిని గురించిన విచారణ ఎంతదాకా వచ్చిందో అడిగారు. శ్రీవల్లిని గురించిన కొత్త సమాచారం ఏం తెలియలేదు.

తర్వాత కనకదుర్గ గుడికి సమీపంలో వున్న మాణిక్యశాస్త్రిలుగారింటికి వెళ్లారు రిక్షా మీద. ఓ ఇరుకు సందులో వుంది ఆయన ఇల్లు. విశాలమయిన స్థలంలో ఓ పెద్ద పాక వేసి వుంది. పాకచుట్టూ మొక్కలు! అరటిచెట్లూ, కొబ్బరి చెట్లూ మామిడి, నిమ్మ, దానిమ్మ, జామకాయ, రకరకాల పళ్ళచెట్లు.

మంకెన, పారిజాతం, నందివర్ధనం, బొగడ మొదలయిన కేవలం పూజకి మాత్రమే పనికివచ్చే పూలచెట్లు, ఓ మూలగా సిమెంట్ పళ్ళెం కట్టివున్న బావి.

ఆ ఆవరణలోకి అడుగు పెట్టిన సత్యమూర్తికి, ఏదో గురుకులంలోకో, ఋషి ఆశ్రమంలోకో అడుగు పెట్టినట్లుగా అనిపించింది.

దారిలో రైల్లో చెప్పాడు సత్యమూర్తికి అతని బావగారు ఆయన్ని గురించి.

"దుర్గ కొండమీద వున్న గుళ్ళోని ఓ దాంట్లో పూజారి ఆయన. నియమం, నిష్టకల మనిషి. వేదాలన్నీ చదువుకున్న పండితుడు. జ్యోతిషశాస్త్రం, తర్కశాస్త్రం క్షుణ్ణంగా తెలిసిన వ్యక్తి. రోజూ సాయంత్రం ఓ గంటసేపు పురాణం చెబుతాడు కొండక్రింద. కృష్ణా జిల్లాలో నిష్టగా, పూర్వపు సంస్కృతిని మర్చిపోకుండా ఆ పద్ధతిలో జీవిస్తున్న అతి కొద్దిమందిలో ఈయన ఒకరు. వెళ్ళటం వల్ల లాభం తప్ప నష్టం జరగదు మనకు. నాకాయనమీద బాగా గురి ఏర్పడింది.

మనిషి మనసులోని ఎలాంటి బాధనయినా చేత్తో తీసేసినట్లుగా మాయం చెయ్యలేక పోయినా, కొంతలో కొంత ఉపశమనం కలిగేలా చేయగలరు. ఆయన చాలా బిజీగా వుండే వ్యక్తి. మనకి దొరుకు తాడో దొరకడో కూడా అనుమానమే.''

పాకే అయినా ఎంతో ఎత్తుగా వుంది గుమ్మం. గుమ్మానికి ఇరు ప్రక్కలా ఎత్తయిన, ముగ్గులు వేసివున్న, అరు గులు. వాటిమీద పదిమందిదాకా కుర్రాళ్ళు కూర్చొని వున్నారు.

అందరూ పంచెలు ధరించి వున్నారు. గుళ్ళు. పిలకలు, ఒంటి మీద కనపడే మూడు పోగుల జంధ్యాలు. సంస్కృతంలో ఏదో వల్లె వేస్తున్నారు.

''మాణిక్య శాస్త్రిలు గారున్నారా?'' అడిగాడు సత్యమూర్తి వాళ్ళలో ఒకరిని.

''లేరు. పురాణం చెప్పడానికి వెళ్లారు. ఎక్కడ నుంచి వచ్చారు మీరు?''

''రాజమండ్రి. ఎప్పుడు వస్తారు?''

''సంధ్యాకాలం సమీపించింది. ఇక రావచ్చు. ఓ అర్ధఘడియలో వస్తారు. కూర్చోండి.''

ఇద్దరూ అరుగు ముందు పరిచివున్న చాపమీద కూర్చున్నారు.

''వీళ్ళంతా విద్యార్థులు. సంస్కృత పాఠాలు చెప్తారు శాస్త్రిలుగారు. వేదాధ్యయనం చేయిస్తారు శిష్యులచేత' చెప్పాడు సత్యమూర్తి బావ, తన బావ మరిదికి.

ఆ పాక వెనకాలనుంచి నాలుగయిదు సార్లు ఆవు గట్టిగా అరవడం విన్నాడు సత్యమూర్తి.

దాదాపు ఇరవై నిముషాల తర్వాత వచ్చారు మాణిక్యశాస్త్రిలుగారు. ఆయన్ని చూడగానే అంతా లేచి నిలబడ్డారు.

ఆయన సత్యమూర్తి బావని చూసి వెంటనే పేరు పెట్టి పలకరించారు.

''నేను వచ్చి చాలాకాలమయింది. గుర్తున్నానా?'' అన్నాడాయన నవ్వుతూ.

''వీరెవరు?'' అడిగాడు సత్యమూర్తిని చూసి.

''నా బావమరిది. మీతో పనిపడి వచ్చాను.''

''రండి.''

లోపలికి దారితీశాడాయన. వెనకాలే వెళ్ళారు ఇద్దరూ. ముందుగది చాలా విశాలంగా వుంది. పరిచివున్న ఓ పులితోలు మీద ఆయన కూర్చొని, ఎదురుగా వున్న చాపలమీద కూర్చోమన్నట్లుగా సంజ్ఞ చేసాడు.

వాళ్ళిద్దరు కూర్చున్నాక అడిగాడు.

''చెప్పండి. ఏమిటి విశేషం?''

సత్యమూర్తి బావ శ్రీవల్లి గురించి పూసగుచ్చినట్లుగా చెప్పాడు. ఆయన మౌనంగా వింటూండిపోయాడు.

''చిన్నప్పటినుంచే నా దగ్గరే పెరిగాడు. నా కొడుకులా పెంచుకుంటూ వచ్చాను. ఈ నాటి కీ ఘోరం జరిగిపోయింది .''

సత్యమూర్తికే ఆశ్చర్యం వేసింది. తన బావ పసిపాపలా అలా ఏడుస్తారను కోలేదు. అంత కాలం ఆయన నిగ్రహించుకుంటూ వస్తున్న దుఃఖం కట్టలు తెంచుకుంది.

''ఊరుకోండి. ఈ జీవితం దేనికి? దుర్ఘటనలు ఎదుర్కొనడానికే. అవి ఆసన్నమయినప్పుడు ధైర్యం చిక్కబట్టు

కుని ఏం చేయాలో యోచించాలి.''

కండువాతో కళ్ళు తుడుచుకున్నాడు సత్యమూర్తి బావ.

''అబ్బాయి ఏ నక్షత్రంలో పుట్టాడు?''

''ఆశ్లేష. జాతకం తెచ్చాను.''

''ఆశ్లేష....అంటే కర్కాటకం....''

జాతకం అందుకుని గట్టిగా కేకేశాడు ఓ శిష్యుడిని. అతను రాగానే ''దక్షిణం గదిలో నా కళ్ళజోడుంది. పట్రా'' అని చెప్పాడు.

కళ్ళజోడు పెట్టుకొని కొన్ని నిమిషాలు దాన్ని పరీక్షగా చూస్తుండిపోయాడు. సత్యమూర్తి ఆయనవంక చూసాడు.

దాదాపు అరవై ఏళ్ళుంటాయి. నల్లటి మనిషి. అయిదడుగుల కంటె ఎత్తు వుండడు. గుండ్రటి మొహం. పూర్తిగా బట్టతల. నుదుట గంధంబొట్టు మీద పెట్టుకున్న ఎర్రటి కుంకం బొట్టు. పంటిమీద జంధ్యం, పట్టుపంచె తప్ప మరే ఆచ్ఛాదన లేదు. సత్యమూర్తికి ఆయన్ని చూపించి 'ఈయనే బృహస్పతి' అంటే నమ్మివుండేవాడు.

జాతకం మూసి సత్యమూర్తిని చూసి అడిగాడు.

''ప్రయత్నం పూర్తిగా విఫలమయిందా?''

''ఏ ప్రయత్నం?''

''అమ్మాయి ఏమయిందో కనుక్కునే యత్నం.''

''ఇంకా తెలియలేదు ఏ సంగతీ.''

''పిల్లలా?''

''ఒక కూతురు....కడుపుతో వుంది.''

''కడుపుతో వుందా?'' అడిగాడు సత్యమూర్తి బావ కొద్దిగా ఆశ్చర్యంగా.

''అవును.''

''ఎన్నోనెల గర్భం?'' అడిగాడు మాణిక్యశాస్త్రులు. ఆయన మొహంలో కూడా కొంత బాధ గోచరించింది.

---

(వి) చిత్ర విజ్ఞానం



అగ్నిప్రమాదాలప్పుడు మంటలార్పడానికి అగ్నిమాపక దళాలు అక్కర్లేదు. రష్యన్లు కనుగొన్న ఒక నవీనపద్ధతి ననుసరించి అగ్నిప్రమాదం సంభవించిన ప్రదేశంలో కృత్రిమ వర్షం పడేట్లు ఏర్పాటు చెయ్యవచ్చు. ప్రమాదం సంభవించిన ప్రదేశానికి సరాసరి పైనున్న మేఘాల్లోకి "25 **m.m.** ఫ్లేర్ పిస్టల్'' సాయంతో కొన్ని రసాయన పదార్థాలు చల్లగానే అక్కడి మేఘాలు చల్లబడి క్షణాల్లో వర్షం పడుతుంది! మంటలార్పడానికి యిది అతి సులభమైన పద్ధతి. దీనితో ముఖ్యంగా అరణ్యాల్లో సంభవించే అగ్నిప్రమాదాలనుండి వృక్ష జంతు సంపదలను కాపాడవచ్చు!!

"తెలియదు. ఊరు బయలుదేరే ముందురోజే అనుకుంటాను చెప్పింది."

"భార్యంటే వీడికి వల్లమాలిన అభిమానం. పెళ్ళయాక ఇన్ని రోజులు విడిచి వుండలేదు. యమబాధ పడుతున్నాడు మనసులో. ముందర వీడి బాధ తగ్గేందుకు ఏదయినా శాంతి చేయటమో"

"సంధ్యాకాలమయింది. సంధ్యవార్చి వస్తాను. కూర్చోండి" అని శాస్త్రులు లేచి లోపలికి వెళ్ళిపోయారు.

"రోజూ వుదయమే లేచి కృష్ణానది దాకా నడిచివెళ్ళి అందులో స్నానంచేసి అక్కడే సంధ్యవార్చి వస్తారు. ఉదయం కాసేపు శిష్యులకి పాఠాలు చెప్పి పూజలో కూర్చుంటారు. ఇంట్లో ప్రత్యేకంగా ఓ పూజ గది వుంది. దేవతార్చనం చేస్తారు రోజూ. శ్రీ చక్రం కూడా వుంది. ఎంతో నిష్ఠతో పూజ చేయాలి శ్రీ చక్రానికి. తర్వాత కొండమీది గుడికి వెళ్తారు. మధ్యాహ్నం వచ్చి మళ్ళీ మధ్యాహ్నిక సంధ్యవార్చి, భోజనం చేసి మళ్ళీ గుడికి వెళ్తారు. సాయంత్రం వస్తూ వస్తూ పురాణం చెప్పి వస్తారు. ఈ టైంలో వస్తారు చాలామంది పెళ్ళికి ముహూర్తాలు పెట్టించుకోడానికి, జాతకము వేయించుకోడానికి, జ్యోతిషం చెప్పించుకోడానికి, శాంతులు చేయించడానికి .ఎంత ఇస్తే అంత పుచ్చుకుంటాడు. ఇంత కావాలని అడగరు ఇవ్వకపోయినా మళ్ళీ వాళ్ళు వస్తే మొదట ఎంత ఆదరంగా వుంటాడో రెండోసారికూడా అంత ఆదరంగా వుంటాడు. ఆయన ధనానికి గుర్తింపు ఇవ్వరు."

దాదాపు అరగంట తర్వాత వచ్చాడు మాణిక్యశాస్త్రులు.

"జాతకంలో వున్నట్లుగానే జరిగింది. ఇదంతా దైవసంకల్పం. మనం నిమిత్తమాత్రులం. సృష్టికర్త ఘటనని తప్పించడానికి ఎవరి శక్యం కాదు."

"శ్రీవల్లి మళ్ళీ కనబడుతుందా?" అడిగాడు సత్యమూర్తి.

"ద్వితీయకళత్రంవుంది నీజాతకంలో. ఇక ఆ అమ్మాయి గురించి మరిచిపోవచ్చు."

(ఇంకా వుంది)

# శ్రీశ్రీ నిర్వహించు పదబంధ ప్రహేళిక

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | | 4 | 5 | | 6 |
| | | 7 | | | | | | |
| 8 | 9 | | | | | | 10 | |
| 11 | | | | 12 | | 13 | | |
| | | | 14 | | | | | |
| 15 | | | | | | 16 | | 17 |
| 18 | | | 19 | | 20 | | 21 | |
| | | 22 | | | | 23 | | |
| 24 | | | | | 25 | | | |

ఆధారాలు జూలై '78

## అడ్డం

1. ఆస్తికులు దేవుణ్ని——
4. మర్యాదకాదు
(. శ్రీరంగంలో శ్రీరంగనాథుడు
8. పోకముందు
10. చవకైనది నీతి
11. పృథివీపతిని ఇలా అంటారు
13. గౌరికి గంగ
14. దంచడానికి డబ్బుతో చూస్తాయి
15. వాయ
16. వ్యక్తి ఆ దేవుడు
18. ఉభయచరం
21. సమాసంలో వెలితి
22. మంత్రులు తరుచు చేసేది
21. ఆలోచించడు
25. ఇంటికన్న గుడి

## నిలువు

1. నవాబులకు కానుక

2. కచేరిలో రాగం తర్వాత
3. "——" పక్షికి కలిగిన పాట్లు
4. తిధి
5. తిరుగు
6. భారతంలో ఒక స్త్రీ
9. శతక కారుడు
10. శృంగారాదులు
12. ఇతగాడు కాడు నీరు కాకి
15. చాంచల్యం
17. మిక్కుటము అనికూడా అనవచ్చును
19. అశ్వగతి విశేషం
20. పలు ముమ్మారు
22. లత కాని లత
23. తెలిసిన దిక్కులో ప్రవహిస్తుంది.

జూన్ పదబంధ ప్రహేళికకు సమాధానం :

అడ్డం : 1. వకారాది 4. ఆమనికి 7. వివాదాస్పదం 8. పని 10. కాకి 11. లలన 13. సుశీల 14. షేక్స్పియర్ 15. ఏడాది 16. ప్రతిమ 18. కలి 21. కైకా 22. గిరి కుమార 24. రమారమి 25. చెప్పనిది.

నిలువు . 1. వలపల 2. రావి 3. దివాల 4. ఆస్పత్రి 5. మదం 6. కిలకిల 9. నిలబడాలి 10. కాశీపతికై 12. హాస్పిటల్ 15. ఏకవీర 17. మకారాది 19. కూరిమి 20. ర్లమాచె 22. గిర 23 రవ్వ.

---

## నిబంధనలు గమనించండి!

పదబంధ ప్రహేళిక కొట్టివేతలు, దిద్దుబాట్లూ లేకుండా పూర్తిచేసి జూలై 1 తేదీలోపు మాకు చేరునట్లు పంపండి. తెల్లకాగితంమీద గళ్ళుగీసి పూర్తిచేసి పంపిన ఎంట్రీలు చెల్లవు. ఎంట్రీలు పంపువారు వారి పూర్తి చిరునామా ఎంట్రీపైనే వ్రాసి పంపాలి. ఆల్ కరెక్ట్ ఎంట్రీకి రు. 50/- బహుమతి. ఒకటికి మించి ఆల్ కరెక్ట్ ఎంట్రీలు వొచ్చినపుడు బహుమతి సొమ్ము విజేతలకు సమానంగా పంచబడుతుంది. ఆల్ కరెక్ట్ ఎంట్రీ ఒకటీ రాకపోతే బహుమతి సొమ్ము పైనెల బహుమతి సొమ్ముకు కలిపి అందజేయబడుతుంది.

---

జూన్ పదబంధ ప్రహేళిక విజేతలు :

1. కుమారి జె. వి. సుబ్బలక్ష్మి, హైదరాబాదు. 2. ఎమ్. సంజీవరావు, విశాఖపట్నం. వీరిద్దరికీ బహుమతిని పంచి ఒక్కొక్కరికీ 25 రు. చొ॥న పంపిస్తున్నాము.

---

# సినిమా

## ఆంధ్రప్రదేశ్‌లో చలనచిత్ర పరిశ్రమాభివృద్ధి!

ఆంధ్ర రాష్ట్రంగా, ఆ పిమ్మట ఆంధ్రప్రదేశ్‌గా తెలుగువారి ప్రత్యేక రాష్ట్రం ఏర్పడక ముందు మద్రాసు తెలుగు చలన చిత్ర నిర్మాణానికి కేంద్ర స్థలంగా నిలిచింది. ప్రత్యేక రాష్ట్రం ఏర్పడ్డప్పటికీ ఆ పరిశ్రమ అక్కడే ఉండటంతో, ఆంధ్రప్రదేశ్‌కి తెలుగు చలన చిత్ర పరిశ్రమ తరలింపు 'సమస్య'గా తయారైంది. ఒక్కసారిగా జరగటం సాధ్యంగాని ఈ పని జరుగుతూనే వున్నా — వేగంగా జరగడం లేదన్నది సత్యం. ఈ సమస్య ఒక్కటేకాదు. మద్రాసులో ఉన్నా, హైదరాబాదుకు తరలి వచ్చినా చిత్ర పరిశ్రమను వేధిస్తున్న ఇతర సమస్యలెన్నో ఉన్నాయి..వాటిని పరిష్కరించేందుకు ప్రభుత్వమూ, పరిశ్రమ ప్రతినిధులూ ఎంతకాలంగానో సతమతమవుతున్నా ఫలితాలు ఆశాజనకంగా లేవు.

ఈ విషయాలన్నీ చర్చిస్తూ—గ॥ 27 సంవత్సరాలుగా చలన చిత్ర నిర్మాణంతో ప్రత్యక్ష సంబంధం ఉన్న నిర్మాతగా, ఆంధ్రప్రదేశ్‌లో చలన చిత్ర పరిశ్రమాభ్యుదయం లక్ష్యంగా ఒకటిన్నర దశాబ్దం క్రితం మద్రాసునుంచి హైదరాబాద్‌కు తరలివెళ్ళి అక్కడనే స్థిరపడి చిత్రాలు నిర్మిస్తున్న నిర్మాతగా—శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రికి ఒక మెమొరాండం సమర్పించారు.





'ప్రాణం ఖరీదు'లో చంద్రమోహన్, జయసుధ

ఆ నివేదికలో చర్చించబడ్డ కొన్ని అంశాలు: శాశ్వత గృహనిర్మాణ పథకం. టూరిస్టు హోటల్ నిర్మాణం. ఔట్ డోర్ ఎక్విప్ మెంట్ లొకేషన్ షూటింగ్ సదుపాయాలు. ముడి ఫిల్మ్ సరఫరా. లాబరేటరీల స్థాపన. సబ్సిడీ పథకం. ప్రయోజనాత్మక చిత్రాలకు ప్రోత్సాహం.

'కటకటాల రుద్రయ్య'లో జయచిత్ర





'ప్రేమ-పగ'లో బాలయ్య

ఫిల్మ్ డెవలప్ మెంట్ కార్పొరేషన్. థియేటర్ల అద్దె పద్ధతి. ప్రవేశ రుసుం. థియేటర్ల నిర్మాణం. ఫిలిం సొసైటీ ఉద్యమానికి చేయూత. ఫిలిం ఇన్‌స్టిట్యూట్ స్థాపన. హైదరాబాద్‌లో సెన్సార్ బోర్డు. సెన్సార్ చేయబడిన అభ్యంతరకర దృశ్యాలు తిరిగి అతికించి ప్రదర్శించకుండా చర్యలు. పరిశ్రమ వాణిజ్యమండలుల సంలీనం. సెమినార్ నిర్వహణ.

వీటన్నిటినీ వివరంగా చర్చిస్తూ, తమ సలహాలను కూడా అందిస్తూ నిర్మాత మధుసూదనరావు 'ఇలాగే ఎందరో మిత్రులు ఎన్నో ఆలోచనలను పోగుచేసుకొని వుండవచ్చు. భిన్న భిన్న అభిప్రాయలను ఒకచోట క్రోడీకరించడం వలన ప్రభుత్వం చేపట్టిన చలన చిత్ర పరిశ్రమాభివృద్ధి కార్యక్రమం సులభ సాధ్యమౌతుంది' అని ముఖ్యమంత్రికి విజ్ఞప్తిచేశారు.

## చలిచీమలు:

'హేవ్స్ అండ్ హేవ్‌నాట్స్'గా వర్ణించబడే ఉన్నవారూ, లేనివారూ-వారి మధ్యగల సంబంధాలు—ఉన్నవారు ఉన్నవారుగా కొనసాగే విధమూ, లేనివాడు ఉన్నవాడిని చూసి భయపడి నోరెత్తే ధైర్యంలేక, చేతులెత్తి దణ్ణంపెట్టి వేడుకొనే మనస్తత్వాన్ని కలిగి ఉండటమూ-ప్రస్తుతం కొనసాగుతున్న [ఇప్పటికి, ఇదివరకటి కంటె కొంత మార్పు వచ్చినప్పటికీ—] వ్యవస్థ లక్షణాలు. ఆ వ్యవస్థలోని ఒక లేని



'దొంగల వేట'లో కృష్ణ

వాడి కుటుంబం కథ ఇది. తరతరాలుగా పెద్ద రైతుల భూమి పండించుకొంటూ, అధిక భాగం రైతు కిచ్చేసి, అతిస్వల్ప భాగం తాను తీసుకొంటూ అదే అదృష్టంగా భావించి, భూమిని దేవతగా నమ్ముకొన్న ఓ బీదవాని కథ ఇది. 'చదువు' వుండటంలో ఉపయోగం గ్రహించ గలిగినా, 'అది సాధ్యంగాదని' తండ్రితో తిట్లుతింటూ ఆశ చావక అనుక్షణం చదువుకోవాలన్న తపనతో సతమతమయ్యే ఓ కుర్రవాని కథ ఇది. అంతెందుకు ఓ మంచి 'కథ' ఉన్న సినిమా ఇది.

మంచి కథకు చక్కని చిత్రరూపంగా తయారైన చలిచీమలు 'నిర్మాత' చిత్రం కాదు. నిర్మాతల చిత్రం. విద్యాధికులైన చాలామంది యువకుల ఉత్సాహమే ప్రధానమైన పెట్టుబడి ఈ చిత్రానికి. దర్శకుడు దేవదాసుతోపాటు నటించిన నటీనటులు, పనిచేసిన సాంకేతిక నిపుణులు—వీరందరి కృషి ఆ పెట్టుబడికి బలాన్నందించింది. చక్కని చిత్రంగా 'చలి చీమలు'ను రూపొందించింది.

మంచి చిత్రాలను ఆదరించగలిగే అభిరుచి తెలుగు ప్రేక్షకులలో పెరిగిన కొద్దీ, చిత్ర విజయానికి 'భారీ తారాగణం, రంగులహంగు, అసభ్యపు స్థాయికి చేరే శృంగారమూ, రెండర్థాల పాటలూ, మాటలూ.. ఆడతారల అనాటమీ ప్రదర్శన' విధిగా అవసరమని నమ్మే వారిని 'చలిచీమలు' లాటి చిత్రాలు నిజంగానే చలిచీమల్లా చురుక్కుమనిపిస్తాయి.

అన్నట్టు 'చలిచీమలు' చిత్రానికి ప్రముఖ చిత్రకారుడు చంద్ర కళాదర్శకత్వం నిర్వహించడమే గాక, ఓ 'మేష్టారి' పాత్రకూడా చేపట్టాడు.

'శభాష్ గోపి'లో
బేబిమంజుల
(హీరో కృష్ణ కుమార్తె)



## రామకృష్ణులు!

మూడు దశాబ్దాలుగా తెలుగు చలన చిత్ర సీమలో అగ్రనటులుగా, అసంఖ్యాకమైన ప్రేక్షకుల అభిమాన్ని చూరగొన్న ఇద్దరు నాయకులు ఎన్.టి.ఆర్, ఎ.ఎన్.ఆర్.లు కథా నాయకులుగా, ఇప్పటి యువతను మత్తెక్కించి, మైమరిపించే 'స్టార్స్' జంట జయసుధ, జయప్రదలు నాయికలుగా, వీరితోపాటు ఇతర పాత్రలలోనూ అనుభవం పండిన నటీనటులు జగ్గయ్య,సత్యనారాయణ, అల్లురామలింగయ్య, మోహన్‌బాబు, శరత్‌బాబు, కాంతారావు, రాజబాబులు నటించిన భారీ రంగుల చిత్రం 'రామకృష్ణులు', నిర్మాత దర్శకుడు రాజేంద్ర ప్రసాద్ చేతిలో రూపు దిద్దుకొన్నది. ఆత్రేయ పాటలూ, మహదేవన్ సంగీతమూ, వి.యస్.ఆర్. స్వామి ఫొటోగ్రఫీ, ఎ. సంజీవి ఎడిటింగ్, యస్. కృష్ణారావు కళ, నిర్వహించారు.

## మాకు 'టాక్స్ ఎగ్జెంప్షన్' వద్దు!

ఇది ఆశ్చర్యం! ఓ 'చిన్న చిత్రం' నిర్మించిన నిర్మాత - 'సినిమా ప్రయోజనాత్మకమైందని అంటున్నారు కదా, 'టాక్స్ ఎగ్జెంప్షన్' కోసం ప్రయత్నించకపోయారా?' అని మీ విలేఖరి అడిగినప్పుడు, ఖంగారు పడినట్లుచూసి 'వద్దండీ బాబూ వద్దు....'ఒక్కరూపాయి అత్యధిక ప్రవేశ రుసుముగా' కండిషన్‌చేసి ఇచ్చే టాక్స్ ఎగ్జెంప్షన్ మాకు ఉపయోగం మాట ఎలా ఉన్నా....దానిలో రిస్క్‌కూడా ఉంది' అన్నాడు. టాక్స్ ఎంగ్జెంప్షన్ వద్దనుకొనే నిర్మాతలున్నారని అప్పుడే తెలిసింది మీ విలేఖరికి.

## రహస్యం!

ఒక పెద్ద నిర్మాత....ఐ మీన్....పెద్ద పెద్ద చిత్రాలు నిర్మించిన నిర్మాతతో ముచ్చటిస్తుండగా పెద్ద పెట్టుబడితో చిత్రాలూ, చిన్న పెట్టుబడితో చిత్రాలూ అన్న విషయం చర్చకు వచ్చింది. "మీలాంటి పెద్ద పెద్ద ప్రొడ్యూసర్లు అప్పుడప్పుడూ కొత్త వారితో చిన్న బడ్జెట్ చిత్రాలు నిర్మించవచ్చు కదా....పూర్తి 'ఎంటర్‌టైన్‌మెంట్' అనే కారుండా, ప్రయోజనాత్మక చిత్రాలు అప్పుడప్పుడయినా నిర్మించవచ్చు కదా?" అన్న ప్రశ్నవేశారు ఆవేశం నిండి



'మంచి మనసు'లో కృష్ణంరాజు

వున్న ఓ 'స్మాల్ టెక్నీషియన్ ఆఫ్ ది తెలుగు ఫిలిం ఇండస్ట్రీ' పెద్ద నిర్మాత నవ్వారు. తర్వాత చాలా ఫ్రాంక్‌గా ఒక రహస్యం చెప్పారు 'అబ్బాయ్. ఆ రహస్యం నీకు తెలియదు. పెద్ద చిత్రం అది నలభై లక్షలు గానీ గాక....మన చేతిలో రెండు మూడు లక్షలుంటే కథ నడిపి చిత్రం తియ్యొచ్చు. తియ్యొచ్చుకాదు తీస్తాం. డిస్ట్రిబ్యూటర్లు, ఫైనాన్షియర్లు, ఏరియాలు కొనేవాళ్లు ముందుకొస్తారు. మనకు కావలసిన పెట్టుబడి అందిస్తారు.

'అదే చిన్న చిత్రం అనుకో....సపోజ్ ఆరేడు లక్షలలోనే చిత్రం పూర్తి చెయ్యొచ్చనుకో. ఆ చిత్రానికి దాదాపు ఆ ఆరేడు లక్షలూ మనమే పెట్టుబడి పెట్టాలి. డిస్ట్రిబ్యూటర్ 'చూద్దాం' అంటాడు, ఫైనాన్షియర్ 'పాక్కలాం' అంటాడు, ఏరియాల వ్యాపారస్థుడు 'పూర్తి చెయ్యండి చూద్దాం' అంటాడు. కనుక మూడు లక్షలుంటే ముప్ఫై లక్షల సినిమా తియ్యొచ్చు కాని ఆరేడు లక్షలయ్యే సినిమా తియ్యాలంటే ఆరేడు లక్షలూ కావాలిసిందే' అని.

చిత్ర పరిశ్రమ సార్ ఇది. 'చిత్ర' పరిశ్రమ.

—యస్వీ నారాయణ.

# షాలిమార్ = రు. 174000000 అను
# సినీ (మాయా) జగత్తులో 'కృష్ణషా' మహిమ

ఎవరీ కృష్ణషా?

జవాబు: ఒకప్పుడు భారతీయుడు, ప్రస్తుతం పరదేశీయుడు.

'షాలిమార్' అనగానేమి?

జవాబు: కృష్ణషా హిందీ, ఇంగ్లీషు భాషల్లో ఒకేమారు నిర్మిస్తున్న చిత్రం పేరు. లేక ఇరవై మిలియన్ల డాలర్ల ఓ ఇన్స్యూర్ చేయబడిన ఫిల్మ్ ఏది? అన్న ప్రశ్నకు జవాబు, కథా కమామిషూ!

'షాలిమార్' కథ ఎవరికీ తెలీదు. తెలిసిందల్లా కమామిషు మాత్రమే!

ఈ సినిమా మొదలవుతోంది అన్నవార్త తెలిసినప్పుడు బొంబాయి సినీ ప్రపంచంలోని వ్యక్తులందరూ ఓ నవ్వు చిద్విలాసంగా నవ్వి ఇదంతా ఓ పెద్ద 'ఇంటర్నేషనల్ డ్రామా' అన్నారు.

'ఇందులో ఎలిజిబెత్ టేలర్ ఆక్ట్ చెయ్యడం లేదు. ఆమెకు బదులు జీనత్ అమన్, మర్లన్ బ్రాండోకు బదులు ధర్మేంద్ర ఆక్ట్ చేస్తున్నారు' అనేటప్పటికి ఇంతకు మునుపు నవ్వేసిన పెద్ద మనుషులే, మేము యింతకు మునుపు పేరగ్రాఫులో నవ్వింది అందుకే అని మళ్ళీ నవ్వేశారు.

ఎట్టకేలకు కృష్ణషా 'షాలిమార్'కు ముహూర్తం నిర్ణయించారు. అన్ని పిక్చర్లకు లాగా ముహూర్తం హడావిడి బొంబాయి సినీ స్టూడియోల్లో జరగలేదు. కృష్ణషా అందుకోసం ఎన్నుకున్నది బాంబే టర్ఫ్ క్లబ్. అందుకోసం వేసిన ఇన్విటేషన్ కార్డ్స్ సైజు అతిశయోక్తి కాదు అనుకుంటే కిటికీ అంత సైజు. ఈ ఉత్సవానికి కృష్ణషా హాలీవుడ్ నటి గీనాలోలాబ్రిగడా (GinaLollabrigada)ను రప్పించ గలిగినా, సదరు గీనా భారతదేశపు ప్రజల మీద జాలిపడి (మీ సినిమాల్లో న్యూడ్ సీన్లు లేక సెక్స్‌కోసం మొహం వాచి పడివున్నారు అని) తన పద్ధతి ప్రకారం పైభాగాన్ని పట్టింపు లేకుండా ప్రదర్శించగలిగే డ్రెస్సు వేసుకొచ్చినా ఎవరూ ముక్కులుమీద వ్రేళ్ళు వేసుకోలేదు.

"ఈ కృష్ణషా అనే శాస్త్రీ లనేదో బ్రహ్మాండమైన సినిమా తియ్యబోతున్నట్టు ఫారిన్



‘కరజామానయుడు’లో ఓ దృశ్యం



పూర్ణోదయా ఆర్ట్ క్రియేషన్స్ వారి చిత్రానికి తొలిపాట రికార్డింగ్ సందర్భంగా తీసిన ఫోటో

ఫైనాన్షియర్ల కళ్లు గప్పి, వాళ్ళిచ్చిన డబ్బు (డాలర్లు) కొట్టేసి పసిఫిక్ మహాసముద్రంలో ఎక్కడో డజను దీవులు కొనుక్కుని ఎవరి కంటికీ కనిపించడు" అన్నారు.

ముహూర్తం జరిగిన కొన్నాళ్ళపాటు 'షాలిమార్' పేరు ఎక్కడా వినిపించలేదు. నాలుగు పేరగ్రాపుల్నుంచి మేం చెబుతున్న దేమిటి? అని భారతీయులంతా సరదాగా చెప్పు కున్నారు. కృష్ణషాను ఇంటర్నేషనల్ క్రూక్ అన్నారు.

కాని, మధ్యలో గాప్ తర్వాత మూణ్ణెల్ల పాటు నిర్విరామంగా ఒక్క నిమిషం కూడా వృధాకాకుండా షాలిమార్ షూటింగ్ జరిగే సరికి ఎవరూ నోరు తెరవలేకపోయారు. కృష్ణషా తన సినిమాను ఇరవై మిలియన్ల డాలర్లకు ఇన్సూర్ చేశాడన్న వార్త వినే సరికి....సదరు మనుషులు అందరూ తమ అభి ప్రాయాన్ని మార్చుకున్నారు.

షాలిమార్ నిజానికి సెట్స్‌కు వెళ్ళడం సెప్టెంబర్ '77లో. రెక్స్‌హారిసన్ లాంటి విదేశీ నటుల్తోసహా అందరూ షూటింగ్‌లో పాల్గొన్నారు. ఇంత జరుగుతున్నా కృష్ణషా తన పిక్చరు గురించి న్యూస్ బయటికి రాకుండా జాగ్రత్తపడ్డాడు. మొదట ఎంత ఆర్భాటంగా జరిగిందో దానికి అంత విరుద్ధంగా అన్నీ సైలంట్‌గా జరిగిపోసాగాయి. కృష్ణషా జర్నలిస్టులను ఆహ్వానించలేదు. కొంతమంది ఫోటోగ్రాఫర్లు, ఫ్రీలాన్స్ రైటర్లను తప్పనిసరి అయి పిలిపించాల్సి వచ్చినా వాళ్ళందరికీ 'షాలిమార్' గురించి ఏమీ వ్రాయకుండా వుండే షరతు మీద చాలావరకు ముట్టజెప్పాడని వార్తలు!

బెంగళూరులో షూటింగు జరిగేటప్పుడు బొంబాయినుండి గూఢచారులు బెంగాళూరు నుండి వార్తలు అందజెయ్యటానికి బయలు దేరారు.

ఆ తర్వాత వచ్చిన వార్తల్లో ఏది వాస్త వమో, ఏది ఫిక్షనో అంతుపట్టకుండాపోయింది.

హఠాత్తుగా వచ్చిన—ఒక వార్త: 'ధర్మేంద్రకు షూటింగ్‌లో బలంగా దెబ్బలు తగిలాయి. వెంటనే బొంబాయినుండి డజనుమంది డాక్టర్లను పిలిపించి ధరేంద్రకు ట్రీట్‌మెంట్ యిప్పిస్తున్నారు' ఈ వార్త వినగానే బొంబాయిలో ధర్మేంద్రను బుక్ చేసుకుని సినిమాలు మొదలు పెట్టిన ప్రొడ్యూసర్లు అందరికీ గుండెలు బేజారెత్తి పోయాయి.

ఈవార్త నిజంకాదు, అబద్ధమని ఋజువు చెయ్యటానికి ధర్మేంద్ర స్వయంగా బొంబాయి వెళ్ళి తన కండిషన్ ప్రత్యక్షంగా చూపించు కోక తప్పలేదు.

ఈ ప్రచారాలు అన్నింటిలోనూ కలికితు రాయిలాంటిది—పిక్చరు చాలా ఛండాలంగా తీశారు. ఒకమారు తీసిన సన్నివేశాల్ని మళ్ళీ యింకోమారు చిత్రీకరించకపోతే లాభంలేదు-



'సింహగర్జన'లో గిరిబాబు

అనేది. డిస్ట్రిబ్యూటర్లలో యీ వార్త కలవరాన్ని సృష్టించింది.

ఈ గందరగోళాని కంతటికీ ముఖ్యకారణం షాలిమార్ నిర్మాతలు తమ పిక్చర్ ప్రారంభానికి ముందు, ప్రారంభం అప్పుడుచేసిన హంగామానే! ఇంత పకడ్బందీగా వ్యవహారాల్ని నిర్వహించడం మన నిర్మాతలకు చేతకాదు. ఎవడో 'విదేశీయుడు'వచ్చి మనదేశంలో మనకంటే గొప్పగా ప్లాన్‌చేసి సినిమా తీస్తున్నాడే అనే దుగ్ధతో లేనిపోనివన్నీ సృష్టించి చెప్పడం మొదలయింది.

వాస్తవానికి ఏకబిగిని మూడునెలలపాటు షూటింగ్ జరపడం — అందుకు కావాల్సిన డబ్బు సమకూర్చుకోవడం, నటీ నటుల కాల్‌షీట్స్ అరేంజ్ చేసుకోవడం (రెక్స్ హారిజన్ వరకూ వెళ్ళాల్సిన అవసరం లేదు. మన హీరోల కాల్‌షీట్లు సంపాదించడమే) ఇవన్నీ ఎవరికీ సాధ్యమయ్యే పనులు కావు కాబట్టి సాధ్యమయిన కృష్ణషామీద అసూయ పడటం సహజమే మరి!

ధర్మేంద్ర, జీనత్ అమన్ రాము అంతకు మునుపే యిచ్చిన కాల్‌షీట్స్ అన్నింటినీ కాన్సిల్ చేసుకుని 'షాలిమార్'లో పనిచేశారు. షాలిమార్‌కు ఒక రకంగా గవర్నమెంట్ సపోర్టుకూడా వుంది! దీనికి కారణం కృష్ణషా ఖర్చుపెట్టేది రూపాయలుకాదు. డాలర్లు. బోలెడు ఫారిన్ కరెన్సీ వస్తుంటే మన ప్రభుత్వం వద్దు అనడానికి ఆస్కారంలేదు.

షాలిమార్ సెప్టెంబర్‌లో రిలీజ్ కావడానికి సిద్ధంగావుంది. పిక్చర్‌ను మార్కెట్ చెయ్య



'అనుగ్రహం'లో వాణిశ్రీ

డంలో యీ నిర్మాతలు అవలంబించే పద్ధతులు కూడా అద్భుతంగానే వున్నాయి. ఉదాహరణకు ఈ చిత్రం తాలూకు రికార్డుల అమ్మకం విషయం పరిశీలిస్తే చాలు. పాలిడార్ కంపెనీ (ఈ సినిమా పాటల రికార్డ్సు రిలీజ్ చేసే సంస్థ) ఒకపోటీ అనౌన్సు చేసింది. మొదటి బహుమతి 50,000 రూ॥ విలువచేసే డైమండ్ రింగ్! ప్రతి రికార్డ్ కవర్ మీద ఒక క్విజ్ వుంటుంది. ఈ టెక్నిక్ ద్వారా 'షాలిమార్' రికార్డులు అత్యధికంగా అమ్ముడుపోయే అవకాశంవుంది.

సెప్టెంబర్‌లో పిక్చర్ రిలీజ్ అయ్యేలోపల పబ్లిసిటీ కోసం షాలిమార్ నిర్మాతలు 30 లక్షలరూపాయలు ఖర్చు పెడతారట. ఈ డబ్బుతో హిందీలో అయితే బాసుచటర్జీలాంటి వాళ్ళు ఆరు సినిమాలు, తమిళంలో బాలచందర్ లాంటివాళ్ళు పది సినిమాలు సులభంగా తియ్యగలరు.

అసలు ఈ సినిమా ఎలా తియ్యబడింది? దీనివల్ల ఇతర ప్రొడ్యూసర్లు ఎలా రియాక్ట్ అయ్యారు?—ఇలాంటి విషయాలమీద షాలిమార్ విడుదలయ్యే లోపలే కొన్ని పుస్తకాలు కూడా విడుదల అవుతాయి.

కాని, వేటిల్లోనూ షాలిమార్ సినిమాలో ఏముంది అన్న ప్రశ్నజోలికి మాత్రం ఎవరూ వెళ్ళరు.

ఈ కృష్ణషా కమామిషుగాని షాలిమార్ కథగాని ఏమిటో తెలియాలంటే సెప్టెంబర్ వరకూ వెయిట్ చెయ్యక తప్పదుమరి.

('సందే' వారపత్రికలోని ఒకవ్యాసం ఆధారంగా

—ఎన్నార్కే మూర్తి.

# పెళ్లాం - కళ్లెం

పచ్చిపులుసు వెంకటేశ్వర్లు

"హిట్లరు, ముసోలినీలు నీపేరు వినుంటే అన్ని ఘాతుకాలు చేయకముందే చచ్చి వుండేవారే తాయారూ!" అన్నాడు వెంకటేశం.

"వాళ్ళెవరండీ ఆ బడుద్ధాయిలూ!"

"అదుగో ఆ బడుద్ధాయి సర్టిఫికేటు వింటేనే చస్తారు."

"ఇవ్వాళేం చావు పురాణం తీశారు?"

"పురాణం కాదే పురుషశ్రాద్ధం. ఇంది రమ్మను "నియంతో, నియంతో" అని ఆడి పోసుకుంటారుగాని అసలయిన నియంత నీవేనే తాయారూ!"

"నియంత అంటే ఏమిటండీ?"

"ఎంత అమాయకురాలివే! నియంత అంటే నిండుదనం. నిండుగా రెండోవాడిని నోరెత్త నీయకుండా, సర్వకార్యకలాపాలలో చోటు చేసుకుని, ఆర్థికమైన పెత్తనం చలాయించడం"

"ఏమండోయ్! నోరుమూసుకుని వున్నానని ఇష్టమొచ్చినట్లు మాట్లాడుతున్నారు."

"తాయారూ! నువ్వు నోరు మూసుకున్నావా? నీనోరు చూస్తే చాలు మానోళ్ళు రక్కున మూత బడవూ! అసలు మాయలూ, మంత్రాలు లేవంటారుగాని, ప్రపంచంలో అన్నిటికంటే పెద్దమాయ ఆడదాని నోరేనే."

"ఏమిటో ఇవాళ ఇలా మాట్లాడుతున్నారు. బాధ్యతలన్నీ నానెత్తిన పడవేసి బలాదూరులా తిరుగుతున్నారు. సంసారాన్ని ఎన్ని అవస్థలు పడి లాక్కొస్తున్నానో మీకేమి తెలుసు? నేనే మైనా దుబారా చేస్తున్నానా? చీరెలు, సారెలు కొని కులుకుతున్నానా? ఇక్కడ నేనేమి బావు కుంటున్నాను? మీరిచ్చే జీతం డబ్బుల్లో ఎంత జాగ్రత్తగా కర్చు పెడితే సంసారం జరుగుతుం దంటారు?"

"అదిగో రికార్డు మొదలయింది. మొన్న ఏ పుస్తకంలోనో చదివాను. రెండు రకాల గ్రామ ఫోన్లున్నాయట. మానవుడు సృష్టించిందొకటి. దాన్ని కావాలనుకున్నప్పుడు పెట్టవచ్చు. ఒద్దు అనుకున్నపుడు ఆపివేయవచ్చు. ఇక రెండోది దేవుడిచ్చింది. అది నోరట. ఆడించడం మొదలుపెడితే, ఆపడం దేవుడికే శక్యం కాదట."

"అబ్బా! నన్నాడిపోసుకోవడం తప్ప మీకు ఇంకోపని లేదుకదా!"

"నీనోరు ఆడించి నేను పోసుకునేదేముందే"

"ఇంతకూ ఈ కంఠశోష దేనికోసమో!"

"నాది కంఠశోషా! తోటి ఉద్యోగస్తులందరూ నీటుగా, ట్రిమ్‌గా, బూటు, సూటుతో వస్తు న్నారే అని చెప్పడం కంఠశోషా! నేను ఓట్లు చెప్పులతో, ఉతకేసిన పేంటు షర్టులతో వెళ్తు న్నానే అని చెప్పడం కంఠశోషేనా! అందరూ సైకిళ్ళలో వెళ్తున్నారే, నేను నడిచి వెళ్తున్నానే అంటే అర్థంగావడం లేదా!"

"అయ్యా! పెద్ద ఆఫీసులో చిన్నగుమాస్తా గారూ! ఒక వెయ్యి రూపాయిలు మోయిన కోరికలు కోరుతున్నారు. అంటే రెండునెలలు పస్తుండాలన్నమాట మనం."

"అదేమంటే యిలా నానోరు కట్టేస్తావు. నలుగురితో సమానంగా ఉండకపోతే నా పరువు ప్రిస్టేజి పోదవిగదే!"

"మీ పరువు, ప్రిస్టేజికోసం పిల్లల్ని, సంసారాన్ని పస్తులుండ మంటారా? ఇదిగో ఈ తిప్పలన్నీ నా కెందుకండీ? నెలజీతం నా కివ్వద్దు. మీ చేతిలోనే ఉంచుకుని ఖర్చు పెట్టండి. ఇవిగో తాళం చెవులు. సామాన్లుతెస్తేఉడకేస్తాను. లేకుంటే ఊరుకుంటా! బాధ్యత అందరం తెలుసుకుంటే సరేగాని, చిన్నపిల్లల్లా మీరూ మారాం చేస్తే, ఇక పిల్లలు ఊరుకుంటారా? వాళ్ళకు లేవూ కోరికలు? నాకు లేవూ కోరికలు? అందరం ఇష్టమొచ్చినట్లు ఖర్చు చేస్తే బొచ్చెత్తుకు పోవాల్సిందే. ఇదివరకు చేసిన నిర్వాకం చాలదూ!"





వెంకటేశవ నోట్లో పచ్చి వెలక్కాయ పడింది, ఈ శత్రువును జయించ డానికిది బ్రహ్మాస్త్రం.

మెల్లగా నోరెత్తకుండా జారుకున్నాడు వెంకటేశం.

* * *

ఇదివరకు చేసిన నిర్వాకం! అంటే యేమిటది!

ఇక యిది వెంకటేశం ఫ్లాష్‌బాక్ పరిస్థితి.

బీరువా తాళాలు తనచేతిలో, నెలజీతం జేబీలో ఉన్నపుడు వెంకటేశాన్ని పట్టడానికి పగ్గాలుండవు.

ఒళ్ళు తెలియదు, ఇల్లు తెలియదు.

పర్సు ఖాళీ అయేంతవరకు నిద్రపట్టదు.

పర్సులో పైసావుంటే అతనికంటె దాన కర్ణుడు మరొకడు లేడు. అతనిని మించిన జల్సా పురుషుడూ వేరొకడు లేడు. ఫ్రెండ్సు - హోటల్సు - సినిమాలు - సరదాలు.

పాపం, ఏ దుర్వ్యసనాలు లేవు. కాని పనికి మాలిన వస్తువులల్లా, కంటికింపుగా కనుపించినవల్లా కొనేసేవాడు.

జేబీ ఖాళీ అయితే మిత్రుల దగ్గర అప్పు తీసుకునేవాడు. స్నేహితులందరి వద్ద అప్పు తీసుకోవడం అయింది. తండాలిచ్చే వాడి చేతిలో చిక్కుకున్నాడు.

వాడిబాకీ తీర్చలేక నానా అవసలూ పడుతున్నాడు. అసలుకు వడ్డీ, వడ్డీకి వడ్డీ. వాడు వచ్చి ఆఫీసులో పరువు తీశాడు. ఇంటికొచ్చి కేకలు వేయడం మొదలుపెట్టాడు. అప్పటికప్పుడు తీరిస్తే తప్పితే కదలనని మొరాయించాడు.

ఏమి చేయాలి? ఎలా తీర్చాలి? వెంకటేశం ఏసుక్కు చచ్చాడు. భార్యకు తెలిస్తే అలుసైపోతామే అని యేడ్చాడు.

భార్యకు తెలియకా తప్పలేదు, అలుసుకాకా తప్పలేదు.

వెంకటేశం ఖర్చు మనిషైతే, తాయారు నోటి మనిషి.

ఇంకేమి చేస్తాడు? చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవ!

అన్ని ప్రశ్నలకూ, శాపనార్థాలకూ ఒకటే జవాబు షోడాబుడ్డి మొఖమేయడం.

భార్య తనమెడలోని గొలుసు తీసిచ్చి, ఎక్కడయినా పదువబెట్టి, బాకీ తీర్చమన్నది.

గ–చెప్పినట్లు చేశాడు హార్ మోస్టు ఒబీడి యంట్ హాస్బెండ్‌లా.

వెంకటేశం కుక్కిన పేనయాడు, నక్కిన పామయాడు.

ఆ రోజు రాత్రి అస్త్రసన్యాసయోగం——

"తాయారూ! ఇంకిలాగయితే లాభంలేదు. చాలా అవస్థలు పడతాం" అన్నాడు వైరాగ్య ధోరణిలో.

"మనల్ని మనం అదుపులో పెట్టుకుంటే అవస్థలెందుకు వస్తాయండీ? మీరు సంపాదించే జీతంలో నలుగురు పిల్లలూ, మనం జీవించాల్నా! ఎంతో పొదుపుగా వాడితేగాని సంసారం గడవదే! ఇలా విచ్చలవిడిగా ఖర్చు చేస్తే ఎలాగండీ? ఈ సోఫాసెట్లు, ఈ గుడ్డలు మన ఆకలి తీరుస్తాయా? ముందు మింగడానికి మెతుకులు, తర్వాతే మీసాలకు సంపెంగ నూనె."

"తాయారూ! వచ్చిన పామును యెందుకే ఇంకా చంపుతావు? నిజమేనే, నేను చాలా తప్పుచేశాను. వీటిని సరిదిద్దుకునే మార్గం నాకు ఒకటే తోస్తూంది——"

"ఏమిటండీ అది?"

"తాళాలు నీచేతికిస్తాను. నెల జీతం రావడం తోచే నీ దోసిట్లో పోస్తుంటాను. ఇక నాకు రోజు ఖర్చుకు ఇంతని జీవీరో వేస్తూండు. నేను ఆ డబ్బులోనే గడుపుతాను. ఇక ఇంటిని నువ్వు నిర్వహించు."

"ఈ బాధ్యతలన్నీ నాకెందుకండీ! ఏదో ఉడకేసి వడవేసి, పిల్లల్ని చూచుకునేదాన్ని!"

"తాయారూ! నువ్వు చూచుకోక తప్పదు. నా చేతిలో డబ్బు నిలవదు."

"అయితే నేను చెప్పినమాట వినాలండీ! మనకుండే బట్టలు మూడు, నాలుగు సంవత్సరాలకు సరిపోతాయి. ఇంక బట్టలు కొనకూడదు. దానధర్మాలు, హోటళ్ళు మానేయాలి. చెడీబడీ కొనటం విరమించుకోవాలి. అప్పు చేయనేకూడదు. ఆఫీసు దూరమైనా నడిచే వెళ్ళాలి. మధ్యలో అవి కావాలి, యివి కావాలని అడగకూడదు."

"తాయారూ! నా సంగతి తెలుసుగదా! మరల మరల యెందుకు అన్ని కండిషన్లు చెబుతావు."

"మీ సంగతి తెలుసు కాబట్టే చెబుతున్నాను. మధ్యలో నన్నుతిట్టి లాభంలేదు."

"అలాగే . అలాగే"

అలా ఒప్పందం జరిగింది.

దువారాచేతిని అదుపులో పెట్టుకునేందుకు చాలా అవస్థపడ్డాడు. కోరికల గుర్రాలకు కళ్లాలు వేసాడు. ఆ కళ్ళాలను పెళ్ళాంచేతిలో పెట్టాడు.

తనతోటి పనిచేసే వాళ్ళంతా కుర్రవాళ్ళు. చాలామంది కొత్తగా పెళ్ళయినవాళ్ళు. నూతన పెళ్ళికుమారుళ్ళు కావడంవల్లా, మామగార్ల చలవవల్లా, పైలాపచ్చీసుగా అతి ఆడంబరంగా డ్రస్సులు చేసుకుని స్కూటర్లపై వస్తూపోతూ వుంటారు.

విలువయిన సిగరెట్లతో విలువగా వస్తూ పోతున్నారు.

తానందరిముందూ కీతాగా కనుపిస్తున్నానేమో ననే ఇన్ఫీరియారిటీకాంప్లెక్స్ పట్టుకుంది వెంకటేశాన్ని.

అప్పటికీ తాయారు రోజూ గుడ్డలు ఉతకేసి శుభ్రంచేసి, చెంవిస్త్రీ చేసియిస్తూంది.

పాపమూయిల్లాలు యెన్నో ఇంటాలుపడి, సంసారాన్ని ఒక ఒడ్డునవేసింది.

అప్పులబాధ తీరిపోయింది.

కాని వెంకటేశం ఉగ్గపట్టలేక పోతున్నాడు. ఏమీ అనలేక పోతున్నాడు.

ఇక ఊరుకుండలేక వెళ్ళగక్కాడు.

బయటపడితే యిదీ వరస.

* * *

వెంకటేశానికి ఆఫీసు పనిమీద హైదరాబాద్ పోవలసిన పనిబడింది.

మహా ఉల్లాసంగా వున్నాడు. జైలునుండి విడుదల కాబోయే ఖైదీలా వున్నాడు.

ఉత్సాహంగా భార్యవద్దకువచ్చి "తాయారూ! హైదరాబాద్ వెళ్ళవలసిన పనిబడ్డది. గుడ్డలవీ సర్దు" అన్నాడు.

"ఏమిటో విశేషం?"

"ఆఫీసు పనిమీద పోతున్నాను."

"ప్రయాణపు ఖర్చులు ఆఫీసు వాళ్ళే యిస్తారు కాబోలు."

"ఆఫీసు యివ్వకపోతే మన చేతిది పెట్టుకుంటామా? అయితే పోయి వచ్చిన తరవాత బిల్లు చేసుకోవాలి."

"ప్రస్తుతం మనదగ్గర ఉండద్దూ. ఉన్నప్పుడు పోదురుగాని లేండి."

"అబ్బా ఎలాగే నీతో ఏడ్చేది. నీకు T.A. రూల్సు తెలియవు. తర్వాత పోదాం అని గవర్నమెంటుకు చెప్పుకోవచ్చునా? వాళ్ళు పొమ్మన్నప్పుడు పోవాల్సిందే."

"అయితే ప్రభుత్వంవారి దృష్టిలో మనం ఎప్పుడు పడితే అప్పుడు హైదరాబాద్ వెళ్ళగల స్థితిలో వున్నామనా?"

"కాదు తాయారూ! అప్పుచేసుకుని వెళ్ళమ్మని."

"మీలాంటి గుమాస్తాలకు అప్పుమాత్రం దొరుకుతుందా?"

"తాయారూ! కాలికేస్తే మెడకు, మెడకేస్తే కాలికి తగిలిస్తావు. నీతో మాట్లాడటం మహా కష్టమే. ఆ రూల్సు పెట్టేప్పుడు ముందు నీతో మాట్లాడాల్సిందే. పొరపాటు చేశారు."

"ఆ రూల్స్‌పెట్టిన ఆఫీసర్లూ, మీరూ జుట్టు జుట్టు పట్టుకోండి. ఆ అప్పు ఏ వెధవిస్తాడో వాడి దగ్గరికెళ్ళండి."

"ఒసేవ్. అప్పిచ్చువాడు వైద్యుడన్నారు గాని, వెధవన్లేదే! తాయారూ! నా తాళాలూ, నా జీతం, నాజుట్టు, నా కళ్ళాలు నీ చేతికి ఏనాడో యిచ్చాను. మరి సర్వబాధ్యతలూ సమర్పించాను. అన్యధా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ. ఈ కర్చు ఎలాగో సర్దు."

"సర్దు సర్దు అంటారు. ఎక్కడ్నించి తెచ్చేది? సరే ఎదోక తంటాలు పడతాను. కానివ్వండి. బరువు బాధ్యతలు నా నెత్తినవేసి మీరు యిష్టం వచ్చినట్లు తిరిగిరండి."

"అదుగో తాయారూ! నేను మాత్రము చేయటం లేదటే గొడ్డుచాకిరి?"

"సరే మీకిదేచెప్పడం. అక్కడ పనికి మాలినవన్నీ కొనకండి. ఇష్టమొచ్చినట్లు కర్చుచేయకండి."

"కృష్ణుడు అర్జునుడికి బోధించినట్లు బోధిస్తున్నావుగదే! నేనేం చిన్నపిల్లాడ్నా?"

"అంతకంటే హీనం!"

"చూడు, చూడు, రౌతు మెత్తనయితే గుర్రం మూడుకాళ్ళమీద నడుస్తుంది."

"సరేలేండి మీ మాటలకేమి" అంటూ వెళ్ళింది తాయారు.

ఉన్నవాటిలో మంచిగుడ్డలు ఎరుకున్నాడు. షోకిల్లాగా తయారయాడు.

"దీవించి అంపవేదేవీమాంచాలా" అన్నాడు.

"రతిరాజ సుందరా, రణరంగధీరా!" అని అనలేదుగానీ తాయారు "క్షేమంగావెళ్ళి లాభం లేకుంటే మానెగాని, నష్టంలేకుండా రాండి."

పిల్లలుచూడకుండా తాయారును ముద్దుపెట్టుకున్నాడు.

రాహుఘడియలులేకుండాచూచిరైలెక్కాడు.

ఇప్పుడతను స్వేచ్ఛా విహంగం.

పురివిప్పిన నెమలిలా మనసు ఆడుతోంది.

కోరికలు గుర్రాలై సందడి పెట్టాయి.

విసిరేసిన గాలిపటంలా విహరిస్తున్నాడు.

కళ్ళెమిప్పుడు భార్యచేతిలోలేదు.

జేబీలోనూటయాభై రూపాయలు.మనసులో రెండువందల కోరికలు.

జాలీగా రైలుదిగి లాడ్జికి వెళ్లాడు.

ఆఫీసుపని చూసుకుని సాయంత్రం బజారుకు వచ్చాడు.

ఏమి కనులపండువుగావుంది మహానగరం. రకరకాల ఆభరణాలు ధరించి, రంగురంగుల చీరెధరించి, ప్రియునికోసం ఎదురుచూచే అభిసారికలా వయ్యారంగావేచియుంది అందాల భాగ్యనగరం.

మిరుమిట్లు గొలిపే విద్యుద్దీపాలతో మిలమిల మెరిసిపోతూంది.

మనసు "బూటో, బూటో" అంటోంది. వయసు 'సూటో, సూటో' అంటోంది. ఎంత అణగద్రొక్కుదామన్నా కోరికలు అణగడం లేదు.

ఒక్క పర్యాయం ఆఫీసు స్టాఫంతా కళ్ళ ముందు కదిలింది. తానెందుకు వారికంటే కీతాగుండాలి? కొనెయ్యాలి ఎలాగయినా బూటు.

అబ్బ బూట్లు ఎన్నిరకాలున్నాయి! కళ్ళు మెరుస్తున్నాయి, పళ్ళు బిలుస్తున్నాయి (తినేందుకు కాదు, తొడుక్కునేందుకు).

ముందు వెనుక ఆలోచించలేదు. పదిషాపులు తిరిగి నచ్చిన బూటు అమాంతం కొనేసేడు. ఏభై రూపాయలు బూటు జత (ఒకటి కాదు). చాలా చీపే! బూటు మీదకు సాక్సు, తోటి బాక్సు. పిల్లలు గుర్తొచ్చారు. రిబ్బన్లు, తిను బండారాలు కొన్నాడు.

అమాంతం భార్యమీద ప్రేమపుట్టుకొచ్చింది. తన చేతిగుండా భార్యకు ఒక్క చీరెన్నా కొని యివ్వలేదు. ఇంతవరకు తనకోర్కెలు తీర్చుకోవడంతోనే సరిపోతుంది గానీ, భార్య ఒకటి వున్నదని, దానికీ కోర్కెలుంటాయని, భరించే భర్తగదా మరి! కోర్కెలు తీర్చే బాధ్యత స్వీకరించాలి గదా!

నచ్చిన చీరెనల్లా క్రింద వేయించాడు. ఆఖరుకు కొట్టువాడి దృష్టిలో అతి తక్కువరేటు, తన దృష్టిలోఎక్కువ రేటులో ఒకచీరె తీసాడు.

బయటకొచ్చి లెక్కచూసుకుంటే ముప్ఫై రూపాయలు మిగిలాయి.

గుండె గుభిల్లుమంది.

లాడ్జి బాడుగివ్వాలి, మరునటి రోజంతా పనివుంది. ఆరోజు కర్చు. తిరుగు ప్రయాణానికి రైలుచార్జీ! ముప్ఫై సరిపోవే. ఎలా! ఎలా?

చెమటలు పోస్తూంది శరీరం. ఈ మహానగరంలో తనకెవరూ తెలియదు. తీసు'కొన్న'వి వాపసుచేస్తే తీసుకోరు.

కొనేప్పుడు మురిపించిన వస్తువులు ఇప్పుడు భయపెడ్తున్నాయి. వాటిని సరిగా చూడలేక పోతున్నాడు. కొనాల, కొనాలని వేధించిన మనసుఎందుకుకొన్నావా అని వేధించసాగింది.

దివ్యకాంతులతో వెలిగిపోయే నగరం వెలిసిపోయి కనుపిస్తూంది. అందరాని ప్రమాని పండుగా, తనవంటి మధ్యతరగతి వాని కడుపు మంటగా అగుపడుతూంది.

తొలివలపు బిలుపు తీరిసి ప్రియుడిలా చూస్తున్నాడు నగరప్రేయసిని.

రూముచేరి మంచంపై వాలాడు.

ఆకలి కావడంలేదు. లేవడానికి బుద్ధి పుట్టడంలేదు. తిరిగి ఊరికి ఎలా వెళ్ళాలా అని ఆలోచిస్తున్నాడు.

అర్ధరాత్రికి కన్నుకురికాడు.

* * *

సూర్యోదయమైంది.

ఎన్నిరకాలుగా మాట్లాడుకున్నా, కాట్లాడుకున్నా, నిద్ర లేవడంతోటే తన భార్యా, తానూ ఒకరి ముఖాలొకరు చూచుకోవాలి.

అది వారి అనురాగ నియమం, అనుబంధ చిహ్నం.

తాను పరాయిచోటికి వచ్చాడు కదా! ఎలా ముఖాలు చూసుకుంటారు?

తాయారు ఒక చిన్న కవరులో తన ఫోటో పెట్టి పంపింది.

వెంకటేశం నిద్రలేచి, తన భార్య ఫోటో బయటకు తీశాడు. ఫోటోలో భార్య ముఖం చూడ బుద్ధి కాలేదు. సిగ్గేసింది. అలా చూసి యిలా పెట్టేశాడు.

భార్యను తలచుకొని చాలా బాధపడుతున్నాడు. భార్య తెలివిముందు తన తెలివి ఎందుకూ పనికి రాదనుకుంటున్నాడు.

కవరులోపెట్టేందుకుకవరు మరలతెరిచాడు.

ఆశ్చర్యం. అందులో ముప్ఫై రూపాయలున్నాయి.

వాటితోటి ఒకచిన్న కాగితం ముక్కవుంది. దానిపై ఒకే ఒక వాక్యం వుంది.

"మీ సంగతి నాకు తెలుసు."

పైకం చూచి ఎక్కడలేని ఆనందం. ఆ వాక్యం చదివి ఎక్కడలేని సిగ్గు, పరిస్థితులు తలచుకొని దుఃఖం.

ఆ ఫోటోను చూడలేకచూడలేక చూచాడు.

ఫోటోలో తాయారు నవ్వుతూంది.

తాయార్ని వెక్కిరించి, ఫోటోను ముద్దులతో నింపాడు.

మళ్ళీ జాగ్రత్తగా రత్నాన్ని తీసుకెళ్ళి, పెళ్ళాం చేతిలో ఉంచాలని నిర్ణయించుకున్నాడు. 

**Edited&Published by V. Leelavathy Raghavaiah, at 17B Rajaram Colony Kodambakkam, Madras-600024, & Printed by D. Hanumantha Rao, at Kranti Press, 12, Francis Joseph Street, Madras-600001.**